# శ్రీపర్వతపురాణ పరిశీలన



రచయిత :

కంబాల శ్రీనివాసప్ప

1991

శ్రీపర్వతపురాణం పరిశీలన

By
Dr. K. SRINIVASAPPA

First Edition 1991

Copies 1000

For Copies :
Dr. K. SRINIVASAPPA
PANYAM (Post & Mandal
KURNOOL Dt. - 518 112

This book is published under the financial assistance of Tirumala - Tirupati Devasthanams under their scheme "Aid to Publish Religious Books"

Price Rs. 40/-

Printed at
Sri Satya Sai Printers
6-2-151-C, Sannidhi Street
T. Nagar, Tirupati-517 507

# కృతజ్ఞతలు


పిహెచ్ డి. చేయడానికి అనుమతించిన డిపార్టుమెంటల్ రిసెర్చ్ కమిటీ వారికి....

"శ్రీపర్వతపురాణ పరిశీలన" పరిశోధనకు సార్థక పర్యవేక్షక బాధ్యతను స్వీకరించి తగు సహాయసహకారాలందిస్తూ ఈ సిద్ధాంత వ్యాసానికి రూపురేఖలుదిద్దిన గురువర్యులు ఆచార్య కె. సర్వోత్తమరావు గారికి....

సంస్కృతవాఙ్మయంలో శ్రీశైలానికి సంబంధించినవిశేషాంశాలను తెలియజేసిన ఆచార్య ఎస్. బి. రఘునాథాచార్య (శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.) గారికి.... నా పరిశోధన ప్రణాళికను విని అమూల్యమయిన సలహాలిచ్చిన ఆచార్య తూమాటి దోణప్ప గారికి తమిళవాఙ్మయంలో శ్రీశైలం గురించి విశేషాలు తెలియజేసిన ఆచార్య పి. శౌరిరాజన్ (శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.) గారికి.... శ్రీపర్వతపురాణంలోని విశిష్టపద ప్రయోగాలకు సంబంధించి వివరణ లిచ్చిన డా॥ ఎమ్. ప్రభాకరరావు (డాక్యుమెంటేషన్ ఆఫీసర్, తెలుగు అధ్యయనశాఖ, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం) గారికి....

నాకు అవసరమైన పుస్తకాలను సమకూర్చడంలో సహకరించిన శ్రీ వి. షణ్ముగం (తెలుగు విభాగసంరక్షణాధికారి శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయం గ్రంథాలయం) గారికి.... బి. గోపాలరెడ్డి (లైబ్రరియన్ సంస్కృత విశ్వవిద్యాలయం, తిరుపతి.) గారికి....

నా విద్యావ్యాసంగానికి ఏలాంటిఆటంకాలులేకుండా అన్నిహంగులు సమకూరుస్తూ నాఅభివృద్ధిని అకాంక్షించే తల్లిదండ్రులు కంభాల వీరమ్మ

కంబాల చిన్నగురప్ప, (రిటైర్డ్ టీచర్) సోదరులు కె. పుల్లయ్య, కె. రామేశ్వరప్ప గార్లకు.... నా అభివృద్ధిని కోరే సి. బాలవీరప్ప (టీచర్), జి. ఎల్. శివారెడ్డి (అసిస్టెంట్ డైరెక్టర్), మల్లికార్జునప్ప, టి. ఉమామహేశ్వరెడ్డి, ఎ. సుబ్రమణ్యేశ్వరప్ప గార్లకు....

నా శ్రేయోభిలాషులు, పరిశోధక మిత్రులు సహచరులు హేమ చంద్రబాబు, వి. కన్నయ్య, సి.ఎస్.రాజు, హబీ, కె. లక్ష్మయ్యనాయుడు జి. డేవిడ్, ఎం. పి. కృష్ణయ్య, దైవాదీనం, బి. రామభూపాల్‌రెడ్డి, ఆర్. ఇ. వెంకటేశ్వర్లు, మహేశ్. వి. రాజ గార్లకు....

ఈ సిద్ధాంత వ్యాసానికి శీర్షికల్ని అందంగా వ్రాసి యిచ్చిన మిత్రుడు ఆర్. వెంకటేశ్వర్లు (పరిశోధకుడు, కెమిస్ట్రివిభాగం) గారికి....

పుస్తకమును ముద్రించుటకు తగిన ఆర్థికసహాయము నొసంగిన తిరుమల – తిరుపతి దేవస్థానం వారికి....

పుస్తకమును అందముగా ముద్రించి యిచ్చిన శ్రీసత్యసాయి ప్రింటర్స్ యాజమాన్యం వారికి....

అందరికి నా కృతజ్ఞతలు.

డా॥ కె. శ్రీనివాసప్ప

*

# విషయసూచిక

--:o:--

# శ్రీ పర్వత పురాణ పరిశీలన

ప్రస్తావన :

మానవుడు సంఘజీవి. సంఘ జీవితంలో మతానికి ప్రముఖ స్థానముంది. మతాన్ని అనుసరించి వాఙ్మయం విస్తృతమవుతుంది. ఇతర దేశాలకంటె భారతీయ భాషలలో ఈ విస్తృతి విడదీయటానికి వీలులేనంతగా పెనవేసుకొనిపోయింది. వాఙ్మయంలో మాత్రంకాకుండా కళల్లో కూడ ఈ మతచ్ఛాయలు ప్రస్ఫుటం.

మతానికి, మతప్రచారాని క్షేత్రాలు ప్రబలకేంద్రాలు. క్షేత్ర విఖ్యాతికి ఆక్షేత్రంలో నెలకొన్న దేవుడు క్షేత్రంచుట్టూ ఉన్నతీర్థాలు, ఆదేవుని చుట్టూ అల్లుకొన్న కథలు, తీర్థాలు మహిమలు కారణాలవుతాయి మానవులలో విశ్వాసం పెరుగుతున్న కొద్దీ, దేశాటన చేయాలనే తపన ఎక్కువ అవుతున్న కొద్దీ ఈ క్షేత్రాలు జనసమ్మర్దాలవుతాయి. దానికి తగినట్టే వాఙ్మయం కూడా పెరుగుతూ ఉంటుంది.

ఆంధ్ర వాఙ్మయంలో "క్షేత్రసాహిత్యం" చెప్పుకోదగినంతగా ఉంది. వైష్ణవ క్షేత్రాలలో "తిరుపతి" ఒకటి ఈ తిరుపతి ఆధారంగా కావ్యాలు, మహాత్మ్యాలు పురాణాలు, యక్షగానాలు, శతకాలెన్నో వెలు

పడ్డాయి. వీటినన్నిటిని సమీక్షించి శ్రీరాంపల్లి నాగభూషణంగారు, ఆచార్య కె. సర్వోత్తమరావుగారి పర్యవేక్షణలో ఎం.ఫిల్ లఘు సిద్ధాంత వ్యాసం 1978 సంవత్సరంలో పూర్తి చేశారు.

వైష్ణవులకు తిరుపతిలాగే శైవులకు శ్రీశైలం యాత్రాస్థలం. తిరుపతి ప్రసక్తి ఆంధ్రవాఙ్మయంలో మొదట ఎఱ్ఱన నృసింహపురాణంలో మాత్రం కనిపిస్తే, శ్రీశైల ప్రసక్తి ఎఱ్ఱన కంటె ముందు శివకవుల రచనలలో విస్తృతంగా కనిపిస్తుంది. తిరుపతి క్షేత్ర వాఙ్మయమంత విస్తృత వాఙ్మయంలో పురాణాలు, కావ్యాలు,మాహాత్మ్యాలు, నాటకాలు యక్షగానాలు, శతకాలున్నాయి. పైగా తిరుపతి క్షేత్ర సాహిత్యంలో జానపద వాఙ్మయం తక్కువకాగా శ్రీశైలక్షేత్ర సాహిత్యంలో జానపద గేయ విస్తృతి కనిపిసుంది.ఈ దృష్టితో శ్రీశైల వాఙ్మయాన్ని క్షుణ్ణంగా పరిశీలించడం జరిగింది.

ఈ సిద్ధాంత వ్యాసంలో ఆరు ప్రకరణాలున్నాయి. మొదటి ప్రకరణం సంస్కృత, తమిళ, కన్నడ వాఙ్మయాలలో శ్రీశైలం రెండవ ప్రకరణం శాసనాలలో శ్రీశైలం. మూడవ ప్రకరణము ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో శ్రీశైలం. నాలుగవ ప్రకరణం కావ్యగేయ వాఙ్మయంలో శ్రీశైలం. ఐదవ ప్రకరణం శ్రీపర్వత పురాణ పరిశీలన. ఆరవప్రకరణం శేషనాథార్యకవి పై దువ్వం.

ఉపసంహారంలో సిద్ధాంత వ్యాసంలో కనుక్కొన్న విశేషాంశాలను క్రోడీకరించడం.



# సంస్కృత తమిళ, కన్నడ వాఙ్మయాలలో శ్రీశైలం

భారతీయ భాషలలో సంస్కృతం చాల ప్రాచీనమయిన భాష అంతేకాదు విస్తృత వాఙ్మయం కలిగిన భాష. అలాగే దాక్షిణాత్య ద్రావిడ భాషలలో తమిళ కన్నడాలు ప్రాచీనమయినవి. తెలుగులో శ్రీశైల వాఙ్మయం గురించి తెలుసుకోవడానికి ముందు సంస్కృత తమిళ కన్నడ వాఙ్మయాలలో శ్రీశైలం గురించి ఉండడంచేత తెలుసు కోవడం సమంజసం.

1.1 సంస్కృత వాఙ్మయంలో శ్రీశైలం :

సంస్కృతంలో వేదాలు బ్రాహ్మణాలు, అరణ్యకాలు, ఉప నిషత్తుల తరువాత పురాణ వాఙ్మయానికి తగినస్థానం ఉంది. వేద వ్యాసుడు వ్రాసిన అష్టాదశ పురాణాలలోని స్కాందపురాణంలో శ్రీశైల ఖండం ముప్పైరెండు అధ్యాయాలలో శ్రీశైల ప్రస్తావనఉంది.

సంస్కృతంలో శ్రీశైలం గురించి వ్రాయబడ్డ స్వతంత్ర గ్రంథాలు లేవు. కాని స్తోత్ర వాఙ్మయంలో మాత్రం ఈ స్వామికి తగిన ప్రాధాన్యం ఉంది. వాటిలో దుర్వాసకవి భ్రమరాంబాష్టం, గర్గకవి శ్రీభ్రమరాంబాష్టకం, శంకరాచార్యుల వారి స్తోత్రాలు ప్రధానమయినవి.

భ్రమరాంబాష్టకం :1

అష్టకం అంటే ఎనిమిది పద్యాలు లేదా శ్లోకాలున్న లఘుకృతి దుర్వాసుడు "శ్రీశైల భ్రమరాంబికాం భజమనః శ్రీశారదాసేవితామ్" అనే మకుటంతో అమ్మవారిని స్తుతించాడు. మచ్చుకు

"శ్రీకంఠార్పిత పత్రగండ యుగళాం సింహాసనాధ్యాసినీమ్
లోకానుగ్రహ కారిణీం గుణవతీం లోలేక్షణాం శాంకరీమ్

పాకారి ప్రముఖామరార్చిత పదాం మత్తేభకుంభస్తనీమ్
శ్రీశైల భ్రమరాంబికాం భజమనః శ్రీశారదా సేవితామ్"

శ్రీభ్రమరాంబాష్టకం :2

గర్గకవి శ్రీభ్రమరాంబాష్టకం వ్రాశారు. గర్గకవి "శ్రీశైల భ్రమరాంబికాం శివ యుతాం చిన్మాత్ర మూర్తిం భజే" అనే మకుటంతో అమ్మవారిని స్తుతించారు. మచ్చుకు

"శ్రీకాంతాస్తుత సద్గుణాంచిత పదాం సిద్ధర్షి సంసేవితామ్
బాలేందు ద్యుతి పాదపల్లవ యుతాం బ్రహ్మాండ సంచారిణీమ్
చారు శ్రీకల శాత పత్రక మహా సౌభాగ్య రేఖాంఘ్రికామ్
శ్రీశైల భ్రమరాంబికాం శివయుతాం చిన్మాత్ర మూర్తిం భజే॥

శ్రీమల్లికార్జున స్తుతి :3

అద్వైత సిద్ధాంత ప్రవక్త శ్రీజగద్గురు ఆదిశంకరాచార్యులవారు శ్రీశైలస్వామిని దర్శించి అక్కడ తపస్సు చేసినట్లు ప్రతీతి ఉంది. "సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్" అనే మకుటంతో స్వామి వారిని స్తుతించారు. మచ్చుకు

సంధ్యారంభ విజృంభితం శ్రుతి శిరస్థానాంతరాధిష్ఠితమ్
సప్రేమ భ్రమరాభిరామ మసకృత్సద్వాసనా శోభితమ్
భోగీంద్రాభరణం సమస్త సుమనః పూజ్యం గుణావిష్కృతమ్
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్"

శ్రీశంకరాచార్యుల వారు శ్రీశైల భ్రమరాంబ స్తోత్రం వ్రాశారు. అందులో తొమ్మిది శ్లోకాలు ఉన్నాయి. శ్రీశంకరాచార్యులవారు "శ్రీశైలస్థలవాస నీం భగవతీం శ్రీమాతరం భావయే" అనే మకుటంతో స్తుతించారు4. మచ్చుకు

"చాంచల్యారుణ లోచనాంచిత కృపాచంద్రార్కా చూడామణీమ్
చారుస్మేర ముఖాం చరాచరజగత్సం రక్షణీం తత్పదామ్
చంచచ్చంపక నాసికాగ్ర విలసన్ముక్తామణీం రంజితామ్
శ్రీశైలస్థలవాసినీం భగవతీం శ్రీమాతరం భావయే".

నవ్యులలో శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు శ్రీ మల్లికార్జున సుప్రభాత స్తుతి వ్రాశారు.

ఈ స్తుతి శ్రీశైలప్రభలో జూన్ 1966లో ముద్రితం. ఇందులో నాలుగు శ్లోకాలున్నాయి. "శ్రీమల్లికార్జున విభోతవ సుప్రభాతమ్" అనే మకుటంతో వ్రాశారు. మచ్చుకు—

"తారా సహస్ర కమలార్పిత భూత్తమాంగే
కాలాఖ్యవిష్టరయ మర్పితు మద్యతోద్య
భక్తానురక్త నయనాంబుజ బాంధవేన
శ్రీమల్లికార్జున విభో తవ సుప్రభాతమ్"

శ్రీ పుటిగొండ జ్వాలావతి లింగశాస్త్రి గారు శ్రీశైల మల్లికార్జున స్తవం వ్రాశారు. ఈ స్తవాన్ని శ్రీశైలప్రభలో ఏప్రిల్, మే 1967, మే 1973 లలో ప్రచురించారు. ఈ స్తవాలన్నిటికి "సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్" అనే మకుటంతో వ్రాశారు. ఇందులో పన్నెండు శ్లోకాలున్నాయి. మచ్చుకు.

"ఆపాతాళ నభస్థలాన్త సకల బ్రహ్మాండ భాండోదరం
ప్రత్యక్ ప్రత్యయ భిన్న సర్వభువన ప్రత్యగ్రరూపాంతరం
నానారూప విచిత్రలక్షణ లసచ్ఛ్రీభ్రామరీ లాలితం
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్"

శ్రీమతి ఆయలూరు లలితాదేవి గారు "తేజోవతీపాహిమామ్" అనే

పద్యాలల్ని వ్రాశారు. శ్రీశైలప్రభలో ఏప్రిల్ 1974లో ముద్రితం. దీనిలో ఐదు పద్యాలున్నాయి. మచ్చుకు

"శ్రీమద్భ్రామరీ మల్లికార్జున విభోః సీమంతినీః శాంకరీః
కామాక్షీః శివమంచ శాయినీః జగత్కల్యాణధాత్రీః పరా
కౌమారీః దశతత్వరూపి ః శివాః కాత్యాయనీః శాంభవీః
కామేశీః భ్రమరాంబః దుర్గః లలితాః కాపాడు నన్నుం గృపన్"

దాపేగాల స్వామివీర వ్రాయబడ్డ మరొక లఘుకృతి శ్రీమల్లికార్జున జీవస్తవోదాహరణం. దీనిని శ్రీకాశిపట్నపు సిద్ధరామకవి వ్రాశారు ప్రతి విభక్తికి వృత్తంకళిక, ఉత్కళికలు అపై సార్వవిభక్తికశ్లోకం, కవికృత నామాంకిగం పద్యాలనే లక్షణాలన్నీ ఈ మల్లికార్జున దేవస్తవోదాహరణానికి ఉన్నాయి. దీనిని నిడుదవోలు వెంకటరావు గారు ఉదాహరణ వాఙ్మయచరిత్రలో అనుబంధంలో పేర్కొన్నారు.5 మచ్చుకు

"శ్రీమచ్ఛ్రీగిరి మల్లికార్జున విభో సంతతప్రతే రర్పయేత్
శ్లాఘ్యోదాహరణం శివాద్వయవిదాం హృద్యంచిదానన్దమ్
సిద్ధాంతప్రదవజ్ఞులే అవణవ తత్కరూపిరవత్వాపకే
. శైవసావిలయంగతో గురుపదే యస్సిద్ధరామాహ్వయః"

## 1.2 తమిళవాఙ్మయంలో శ్రీశైలం6 :

ద్రావిడ భాషలలో తమిళానికి ఒక ప్రత్యేకత ఉంది. ఈ భాషలోనే ప్రాచీన లిఖితవాఙ్మయం మనకు దొరుకుతుంది. ప్రాచీన తమిళులు శైవాన్ని ఆరాధించినట్లే ఆర్యసంపర్కం తరువాత విష్ణువును కూడా సేవించారు ఈ రెండు కారణాలవల్ల తమిళసాహిత్యాని "దైవతమిళ్" అని సగర్వంగా తమిళులు చెప్పుకుంటారు అంటే ఆ దేవుళ్ళకు సంబంధించిన తేవారం, నాలాయిర దివ్యప్రబంధంలాంటివి ఇతర భాషలలో లేకపోవడం.

తమిళదేశంలో శివక్షేత్రాలు ఎక్కువ. వాటిలో "అర్జున" అనేపేరు చివరగల రెండు శివక్షేత్రాలు ఉన్నాయి. మొదటిది తిరునెల్వేలి జిల్లాలోని తిరుప్పుడై మరుదూర్ అనే క్షేత్రంలోని పుడార్జునస్వామి, రెండవది తంజావూరు జిల్లాలోని తిరువిడై మరుదూర్ అనే ప్రసిద్ధక్షేత్రంలోని మధ్యార్జునస్వామి. అలాగే అర్జుననామం చివరగల శైవక్షేత్రం శ్రీశైలక్షేత్రం.

తమిళశైవవాఙ్మయం దేవారం పెరియపురాణం, తిరుపుగళ్, తిరువాచకము మొదలయిన వాటికి వందితపామరులలో ప్రత్యేకస్థానం ఉంది తమిళభక్తులు తమ ప్రాంతాలలోని శివక్షేత్రాలనే గాకుండా ఇతర ప్రదేశాలను, ముఖ్యశైవక్షేత్రాలను కూడా సేవించారు. కీర్తించారు. వాటిలో శ్రీశైలం ఒకటి.

నాయన్మారులలో తిరుజ్ఞానసంబంధర్ బాలవిశిష్టుడు. సంబంధర్ క్రీ శ 7వ శతాబ్దం ప్రాంతంలో జీవించినట్లు చెబుతారు. తమిళనాడులోని శివాలయాలలో ఆయన విగ్రహం ప్రతిష్ఠితమై ఉంటుంది. అతనికి నిత్యపూజాకైంకర్యాలే కాకుండా ప్రతిఏటా ఉత్సవాలు జరగడం గమనించదగ్గ అంశం. ఆయన సమకాలికులయిన అప్పర్, సుందర్ మొదలయిన వారేకాకుండా ఆ తరువాతివారుకూడా సంబందర్‌ను స్తుతించారు. భగవదనుగ్రహంవల్ల జ్ఞాన సంబంధర్ మూడేండ్ల వయస్సులోనే కవిత చెప్పినట్టు చెబుతారు. జ్ఞాన సంబంధర్ ప్రతిభా విశేషాల్ని విని మధుర పాలించే గూన్ పాండ్యన్ పట్టమహిషి అయిన మంగై యర్కరసి ఆయనను మధురకు ఆహ్వానించింది. జైనమతస్థుడయిన పాండ్యుని తిరుజ్ఞాన సంబందర్ శాస్త్రచర్చలో ఓడించి, రాజును శైవునిగా చేశాడు. తమిళనాడులోని ఆయన మెట్టని శివాలయం లేదు. పాడని పుణ్య

స్థలం లేదు. సుందరర్ కవి వ్రాసిన దేవారంలో తిరుప్పరుప్పదాన్ని (శ్రీశైలం) గురించి వ్రాసిన పాటలు మధుర మనోజ్ఞంగాలు.

"వృషభాన్ని వాహనంగా కలవాడు. నీలకంఠుడయిన శివుడు వెలసిన తిరుప్పరుప్పదాన్ని పూజిద్దాం. ఓ మానసా! వెంట్రుకలు నెరసి ముసలితనం ముంచుకొస్తున్న వేళ నోరారా నిన్ను స్తోత్రం చేసి తిరుప్పరుప్పదం (శ్రీశైలం, చుట్టి మొక్కడం దీనజలంతా స్నాన ఘట్టంలో స్నానం చేసి మల్లికార్జునని సేవిస్తారు. అటువంటి ఈశ్వరుని సేవిద్దాం నంది పతాకం గుర్తుగా కలిగి దేహమంతా విభూతిధరించిన పరిశుద్ధమయిన మల్లికార్జునుని స్థలమగు తిరుప్పరుప్పదాన్ని [శ్రీశైలాన్ని] మొక్కుదాం" అంటాడు తిరుజ్ఞానసంబందర్. తిరుప్పరుప్పదం అనగా శ్రీశైలం తిరు అనే మాటకు "శ్రీ" అని అర్థం, పరుప్పదమ్ అనే మాట పర్వతానికి వికృతి.

అరుణగిరినాదర్ 15వ శతాబ్దివాడు. అరుణగిరి నాదర్, "తిరుప్పుగళ్" అనే భక్తిగీతికా సంపుటాన్ని వ్రాశారు. ఇతడు సంస్కృత ద్రావిడ భాషా పండితుడు. తిరుప్పరుప్పదం గురించి ఇతని కావ్యంలో రెండు పాటల్లో ఉంది.

1. "పిడియుడు కలిరుగల్ నడై పయిల్ కడై తెరల్ పెనయు మార్ తిరుమలై"

అనగా ఆడఏనుగు మగ ఏనుగు కలిసి జంటగా నడచిపోయే సుందర ప్రదేశమయిన శ్రీశైలంలో శ్రీ భ్రమరాంబికా సమేతుడై వెలసిన మల్లికార్జునస్వామీ! అని అర్థం.

2. "దిడు దిడు యెన ముళంగమ్ అరపిగళె ముగుంద
తిరుమలై వాళ్ళుకంద"

అనగా జలజలా.ఎత్తైన కొండల నుండి పడే జలపాతాలుగల శ్రీశైలంలో నివసించే మురుగన్ (కుమారస్వామి) తండ్రి అయిన మల్లికార్జునస్వామి అనిభావం.

దేవారం శివస్తోత్ర వాఙ్మయరాశిలో చేరిన గ్రంథమయితే ప్రభులింగ లీలై కావ్య వాఙ్మయంలోని ప్రసిద్ధకావ్యం. ఈ గ్రంథాన్ని శివ ప్రకాశర్ వ్రాశాడు. ఇతని కాలం 1652. ఇతడు బహుభాషావేత్త. కన్నడంలోని చామరసకవి "ప్రభులింగ లీలె"ను తెలుగులోని పిడుపర్తి సోమన "ప్రభులింగలీల"ను అధ్యయనం చేసి తమిళంలో "ప్రభులింగ లీలై" వ్రాశాడు.ఇది వీర శైవ కావ్యమయినా నేటికి పఠనపాఠనాదులలో దీనికి ప్రత్యేక స్థానముంది. శివప్రకాశర్ "గోరక్కర్‌గతి" అనే భాగంలో శ్రీశైలాన్ని 17 పద్యాలలో వర్ణించాడు. కన్నడాంధ్రప్రభులింగ లీలలలో ఈ ఘట్టంలో ఇంతటి విస్తృత శ్రీశైల వర్ణన కనిపించదు "తమిళ ప్రభులింగ లీలైలో శ్రీశైలం" అని ఆచార్య కె. సర్వోత్తమరావు గారు శ్రీశైలప్రభ జనవరి 88లో ఒక విశిష్టవ్యాసం వ్రాశారు.

శ్రీశైలంలో జ్యోతిర్వృక్షాలెన్నో వున్నాయి పగటిపూట ఆ వృక్షాలు పసిమిగా కనిపిస్తాయి, పక్షులు ఆ చెట్లల్లో గూళ్ళుకట్టి గుడ్లుపొదిగి ఆహారం కోసం నలుదిక్కుల వెళతాయి. మునిమాపువేళ గూడు చేరు కోవడానికి వస్తాయి. కాని రాత్రివేళ కావడంతో జ్యోతిర్వృక్షాలు ప్రకాశిస్తున్నాయట. ఆ ప్రకాశాన్ని చూసి చెట్టుకు నిప్పంటుకుందేమో అని పక్షులు ఆకాశంలో చెట్టు చుట్టూ తిరుగుతున్నాయట.

శ్రీశైలంలోస్వామి కైంకర్యార్థం పూలతోటలెన్నో ఉన్నాయి. కొన్ని వేల పూలు, కొన్ని నీటిపూలు, కొన్ని తీగపూలు. కొన్ని చెట్లలో పూసేవి వాటిలో నల్లని పూవు అందమయిన అమ్మాయి కళ్లలాగా

ఉంది అంగా ప్రకృతి పార్వతీసయంగా పరమేశ్వరుని పక్కనుండని కనిభా'

శ్రీశైలంలో ఒకానొక ఏనుగుజంట పారవశ్యంతో తిరుగుతూ ఉండేదట. మగ ఏనుగు ఆడ ఏనుగుకు ఏదయినా కానుక ఇవ్వాలను కొందట. అంచేత ఓ చెట్టు చిగురుకొమ్మ తుంచింది పక్కనే ఉన్న తేనె వాకలో ముంచి ఆడఏనుగుకు అందించింది ఆ రెండూ స్ఫటికశిల మీద వుండడంవల్ల ఆశిలలో ఆడ ఏనుగు తన ప్రతిబింబాన్ని గుర్తించ కుండా మగ ఏనుగు మరొక ఆడ ఏనుగుకు కానుక ఇస్తున్నట్టు భావించి కుంగిపోయిందుచుకొందట.

కొండలో ఎన్నో వెదుళ్ళగుంపులున్నాయట. వెదురులో రెండు గణుపుల మధ్యభాగం ధాన్యం కొలిచే కొలపాత్రలాగా ఉండేదట ఈ విషయాన్ని స్పష్టం చేయడానికోసం కవి పార్వతీ పరమేశ్వరులకు సంబంధించిన ఒక కథ చెప్పాడు.

ప్రపంచంలోని జీవరాసులకంతా ఆహారం సమకూర్చేవాడు శివుడు. కాని పార్వతి శివుణ్ణి పరీక్షించాలని అనుకొంది. ఒక చీమను దాచింది. అన్ని జీవరాసులకు ఆహారం అందించి శివుడు వచ్చాడు. అన్నింటికీ ఆహారమందించారా అని పార్వతి అడిగింది. అవునన్నాడు శివుడు మరి చీమకు సమకూర్చలేదే అంది పార్వతి. కాని తీరా చూసే సరికి చీమ నోట్లో ఒకనూక ఉందట. పార్వతి పన్నాగం శివునికి తెలిసింది. తన్ను పరీక్షించడం తప్పుగాదు. గాని తన భక్తవాత్సల్యాన్ని పరీక్షించడంతో శివునికి కోపం వచ్చింది. భూలోకంలో భక్తులకు ఆహారం సమకూరుస్తూ కాలం గడపమని ఆదేశించాడు. అయినా తనకు ధాన్యం కావాలంది పార్వతి. శివుడు అలాగే అంటూ శ్రీశైలంలోని వెదురు రెండు గణుపుల మధ్యభాగాన్ని కొలపాత్రగా ధాన్యం ప్రసాదించాడట అంటే ఆ వెదుళ్ళు ఎంత పెద్దగా బలుపుగా పాత్రలాగా పెరిగాయో కవి ఊహకు వదిలేశాడు.

అన్నీ ఉన్నా, శ్రీశైలానికి కూడా తీరని వ్యథ ఉంది. స్వామి శ్రీశైలం చేరుకోవడంలో తనకు కొంత ప్రసిద్ధి రావడంతో ఇంతవరకు ఎంతో ఆప్యాయత కనబరచే మెరువు వింధ్య మొదలయిన పర్వత సోదరులు మొగం మాడ్చుకొని దూరమైపోయారు. తన వాళ్ళంతా తనకు దూరమయ్యారనే దుఃఖంతో ఆ పర్వతం కొండ సెలయేళ్ల రూపేణ ఏడుస్తూ తనగోడు చెప్పుకొంటుందట.

తెవెగాక క్షేత్ర పిళ్లై త్తమిళ్, శివనామ కలివెణ్బా, దేవార శివ కలవెణ్బా, శివ జ్ఞలమాలైలలో కూడా శ్రీశైల ప్రసక్తి ఉంది.[7]

"క్షేత్రపిళ్లైత్తమిళ్" లోని సిరువరై వరువం అనే అధ్యాయంలో

"ఉరుచ్చిగర దరశనమ్ శెయ్‌దోన్"

అంటే శిఖర దర్శనం చేసినవాడా అని అర్థం.

" రుమన్నెవ్వలై నులైవాల్ అరుట్టరుమ నాయగా"

అంటే శ్రీశైలంలో నివసించు ప్రియనాయకా అని అర్థం.

ఈ గ్రంథంలో "వడమరుదు" అనే పేరుతో శ్రీశైలం పిలువ బడింది. వడక్కు అంటే ఉత్తరపు దిక్కు అని అర్థం. మరుదు అంటే కొండ.

శివనామ కలివెణ్బా అనే గ్రంథంలో

"తిరుప్పరుప్పదమ్ సేర్ తిరుప్పరుప్పదీస సన్నాన్,
పృరుప్పదమంగై పదియో"

ఈ పాటల్లో శ్రీశైలస్థలనామం స్వామి నామం, అంబికనామం చెప్పబడింది.

పులవర్ మూరి ముత్తాపిళ్లై 20వ శతాబ్దంవాడు. అతడు వ్రాసిన "శివారి శపతం వెణ్బా" అనే గ్రంథంలో తిరుప్పరుప్పదం గురించిన పద్యం

"శంద్రు తొలుదర్కు సేయత్ తెగిను నెంజమే
నిండ్రు దిశైనోకి నిర్తమిడు–మంద్రర్
తిరుప్పద తానై శివనె యొడిలార్ సి
ప్పరుప్పదత్ తానైప్ పరను"

అనగా ఓ మనసా! తిరుప్పరుప్పదం (శ్రీశైలం) పోయి నమస్కారం చేయడానికి దూరమైనా ఆ దిక్కును చూసి నమస్కారం చేస్తే పుణ్యం లభిస్తుంది.

షణ్ముగ మొదలియార్ వ్రాసిన "శివత్తలమాలై" అనే పద్య గ్రంథంలో

"పరుప్పద మంగై ఉమై పంగాప్పరుప్పదత్తిల్
పరుప్పద ఈన, పరణె విరుప్పముడన్
నందాంద్రువున్ మలర్ పాదయొ యనదు
సింద్రై దవిల్ నిలైకచ్చై"

అనగా తిరుప్పరుప్పదంలో [శ్రీశైలం] వెలసిన అర్ధనారీశ్వరా! పరుప్పద ఈశ్వరా! పరమేశ్వరా! ప్రేమతో వచ్చి నన్ను రక్షించి, నీపాదపద్మం నా హృదయంలో నిలిచేటట్టు నన్ను దీవించుము" అని శ్రీశైల మల్లికార్జునుని షణ్ముగ మొదలియార్ కీర్తించాడు.

ఆంధ్రదేశంలో వెలసిన శ్రీభ్రమరాంబా మల్లికార్జునస్వామి వారికి తమిళదేశంలో కూడా అధికప్రాముఖ్యం ఉంది. తమిళదేశంలోని ఎందరో భక్తులు, కవులు, యాత్రికులు శ్రీశైల మల్లికార్జున స్వామిని దర్శించి తరించినారు.

1.3 కన్నడ వాఙ్మయంలో శ్రీశైలం :[8]

తమిళం తరువాత ప్రాచీన సాహిత్యం గల భాష కన్నడం అని చెప్పవచ్చు. కన్నడ సాహిత్యంలో శ్రీశైల ప్రస్తావన ఉంది.

అక్క మహాదేవి :

కన్నడంలో వీరశైవ వాఙ్మయంలో వచనప్రక్రియలలో నిష్ణాతు లయిన శివశరణులలో అక్కమహాదేవి [12వ శతాబ్దం] ఒక్కరె. తెలుగులో తరిగొండ వేంగమాంబ, తమిళంలో కారైక్కాల్ అమ్మయార్ హిందీలో మీరాబాయి లాగా దైవం కోసం సమస్తం త్యాగం చేసిన భక్తశ్రేణిలో అక్కమహాదేవి ఒక్కతె. తన్ను నాయికగా భావించు కొని మధురభక్తి ప్రేరణతో వచనాలు వ్రాసిన కవయిత్రి ఈ అక్క మహాదేవి.

అక్కమహాదేవి వచనాలు ఆమె ఆత్మచరిత్రను, ఉజ్జ్వలమయిన వ్యక్తిత్వాన్నిచాటుతున్నాయి. మచ్చుకు

"నాశరీరాంధకారమును పొగొట్టుమయ్యా!
నా ప్రాణసంకటము మాన్పించుమయ్యా!
నా దైవమా! చెన్నమల్లికార్జున దేవయ్యా!
నన్ను చుట్టిన ప్రపంచమును తొలిగించు నీదయ
(కన్నడసాహిత్యచరిత్ర పుట 95)

రాఘవాంకుడు :[9]

రాఘవాంకుడు (13వ శతాబ్దం ప్రారంభంవాడు) హరిహరుని మేనల్లుడేకాక అతని శిష్యాగ్రగణ్యుడు. రాఘవాంకుని రచనలలో సిద్ధ రామ చరిత్ర ప్రసిద్ధం వచనకారులలో ప్రసిద్ధుడయిన సొన్నలాపురపు సిద్ధరాముని చరిత్ర అందలి విషయం. అతడు కారణరుద్రుడు. ఒకవాడు

బాలుడయిన సిద్ధరాముడు కొ్రచేలలో పశువుల్ని మేపుతుండగా శివుడు జంగమ వేషంలో వచ్చి తినడానికి పాలగింజలు అడగగా ఇచ్చాడు. అంబలి అడిగాడు. ఇంటికిపోయి తెచ్చేసరికి మాయమయ్యాడు. బాలుడపుడు అతన్ని వెదకి చింతించి మల్లయ్యారా! అని మొరపెట్టి ఏడ్చి నేలకూలాడు. శ్రీశైలానికి పోయే యాత్రికులు అతన్ని లేపి మల్లయ్యను చూపిస్తామని చెప్పి వారే తీసుకెళ్ళారు. బాలుణ్ణి తీసుక పోగా, సిద్ధరాముని తల్లి పశువులు వచ్చినా, ఇంటికి తన కొడుకు రాలేదని శోకించడం హృదయ విదారకంగా ఉంది.

"అయ్యో! వెదికిని, ఇకనేమి చేతును
నాకొడుకడవిలో దారిదప్పెనో, పాపామే కరచెనో
పెద్దపులి పాలబడెనో, చెట్టెక్కి క్రింద పడెనో
నీటమునిగెనో" (కన్నడసాహిత్య చరిత్ర పుట 108)

అని అనేక రకాలుగా భావించి తానే ఊరి బయటకు పోయింది. కనిపించిన అందరినీ అడిగింది.

శ్రీశైలానికి యాత్రికులతో వచ్చిన బాలుడు

"ఏడనున్నాడో చూపుడయ్య, మీధర్మమయ్య
జాగుసేయక ఇటనే చూచితినేని చరణమునబడి
ఆతని గాఢాలింగన మొనర్చి ఆతనియందైక్య
మయ్యెదనని" (కన్నడసాహిత్య చరిత్ర పుట 108)

చెప్పాడు. యాత్రికులు శివాలయంలోని శివలింగాన్ని చూపించారు. ఈతడే మల్లికార్జునడని చెప్పగా, ఇతడు కాదని పరల బాలుడు ఏడ్వసాగాడు.

ఇట్లు ఈ భాగంలో భక్తి, వాత్సల్యాలు, విరహావస్థ కరుణ మూలాన ఒకటే అనే నూతన రసానుభూతిని కలిగిస్తుంది.

పిన్నబయులాచార్యుడు :10

పిన్నబయులాచార్యుడు [17వశతాబ్దం] గొడగూచి చరిత్ర వ్రాశాడు. ఇందలి ఇతివృత్తం కుంతల దేశంలోని కురఘేనగరానికి చెందింది. శివదేవుడు, చెన్నమాంబిక అనే దంపతులకు, గొడగూచి వరప్రసాదాన జన్మించింది. ఈ దంపతులు శ్రీశైలయాత్ర సంకల్పించి

"పోయివచ్చెదమమ్మ షడహరుసేవింప హెచ్చరిక హెచ్చరిక
చేయు మారాధన చిత్తజువైరికి హెచ్చరిక హెచ్చరిక
[కన్నడసాహిత్య చరిత్ర పుట 187]

అని చెప్పి వెళ్ళారు.

హోసూరు పుల్లకవి :11

హోసూరు పుల్లకవి [18వశతాబ్దం) శ్రీశైల పండితారాధ్య చరిత్ర అనే గ్రంధాన్ని వ్రాశాడు.

వీరశైవ పంచాచార్య పీఠాలలో ఒక్కటయిన శ్రీశైల పండితారాధ్య పీఠపరంపరకు చెందిన ఆచార్యుల చరిత్రను పుల్లకవి పండితారాధ్య చరిత్రలో వర్ణించాడు.

ఈ పంచాచార్యులు శివుని పంచముఖాల నుండి ఉద్భవించిన పంచగణాధీశ్వరులు. వీరు యుగయుగాంతరాలలో వేరువేరు పేర్లతో భూమిపై అవతరించి శైవధర్మాన్ని ప్రతిష్ఠించినట్లు చెప్పబడింది.

ఈ పంచార్యులకు – పంచమఠాలనే – పంచసింహాసలున్నాయి

1. రేణుకాచార్యులు – రంభాపురి – వీరసింహాసనం కర్ణాటకదేశం
2 ఏకోరామాచార్యులు– హిమవత్కేదారం—వైరాగ్యసింహాసనం
3. మరుళసిద్ధాచార్యులు–ఉజ్జయిని – ధర్మసింహాసనం
4 పండితారాధ్యులు – శ్రీశైలం – సూర్యసింహాసనం

5. విశ్వారాధ్యులు - కాశీక్షేత్రం - జ్ఞానసింహాసనం
(కర్ణాటక ఆంధ్రసాహిత్యచరిత్ర పుట 269)

తరువాతి ప్రకరణం శాసనాలలో శ్రీశైలం

కం॥ విశద హిమ ధామధరునకు
గుశరుహ గర్భాది మౌనికుల వంద్యునకున్
పశుపతికి భక్త పరిష
ద్వశునకు శ్రీలింగ చక్రవర్తికి జేజే" (ఆ2-ప92)

సంఖ్యా సూచిక


1. బృహత్ స్తోత్ర రత్నాకరం. పుట 193
2. బృహత్ స్తోత్ర రత్నాకరం. పుట 194
3. శివానంద లహరి పుట 59
4. శ్రీశైలప్రభ, నవంబరు 1980, పుట 7
5. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర పుట 289
6. తమిళ సాహిత్య చరిత్ర, పుట 42, 466
7. ఆచార్య ఎమ్. అరుణాచలంగారు వ్రాసిన లేఖాంశాలు
8. కన్నడ సాహిత్య చరిత్ర పుట 94
9 కన్నడ సాహిత్య చరిత్ర పుట 106
10. కర్ణాటక ఆంధ్ర సాహిత్య చరిత్ర పుట 186
11. కర్ణాటక ఆంధ్ర సాహిత్య చరిత్ర పుట 269




# 2. శాసనాలలో శ్రీశైలం

గుడికిగాని ఊరికిగాని లేదా ఏరాజ వంశ చరిత్ర గాని నిర్ధారించడంలో విపులీకరించడంలో శాసనాలు ప్రధాన ఆధారాలనడంలో అభిప్రాయ భేదాలు లేవు. ఈ శాసనాలు శిలాశాసనాలు కావచ్చు లేదా తామ్రశాసనాలు కావచ్చు ఆంధ్రదేశంలోని ప్రాచీన దేవాలయాలలో శ్రీశైలం ఒకటి. ఈ శాసనాలలో వేయబడ్డవి, ఇతరత్ర శ్రీశైల ప్రసక్తి ఉన్న శాసనాలను నాలుగు యుగాల కాలం నాటివిగా వర్గీకరించవచ్చు.

1. చాళుక్య యుగం (క్రీ.శ. 973-క్రీ.శ. 1163)
2. కాకతీయుల యుగం (క్రీ.శ. 1000-క్రీ.శ 1323)
3. రెడ్డిరాజుల యుగం (క్రీ.శ. 1324-క్రీ.శ. 1424)
4. విజయనగర రాజుల యుగం (క్రీ.శ. 1336-క్రీ.శ. 1678)

## 2.1. చాళుక్య యుగం :

చాళుక్య యుగంలో రెండవ పశ్చిమ చాళుక్యులు లేదా కళ్యాణ చాళుక్యుల కాలంలో శ్రీశైలానికి సంబంధించిన మొదటి శాసనం క్రీ.శ. 21-4-1057 నాటిది ఈ శాసన కర్త్రి త్రైలోక్యమల్లదేవుని (మొదటి

సోమేశ్వరుడు) భార్య మైలాలదేవి, దుద్దాళ్ల గ్రామున్ని స్వామి సేవలకు అన్నదానానికి అర్పించిన విషయం ఈ శాసనంలో ఉంది.[1]

## 2.2 కాకతీయుల యుగం :

కాకతీయుల యుగంలో శ్రీశైల సంబంధి శాసనాలు తొమ్మిది. ఈ యుగంలో వేయించిన మొదటి శాసనం క్రి.శ. 1120 నాటిది. ఈ శాసనకర్త రెండవ బేతరాజు కుమారుడు దుర్గరాజు(రెండవప్రోలుడు (క్రీ.శ. 1110-1158) ఇతడు శ్రీశైలంలోని శివాచార్య రామేశ్వర పండితునికి శివపురం అర్పించిన విషయం ఈ శాసనంలో ఉంది.[2]

క్రీ.శ. 1136-40వ సంవత్సరంలో రెండవ ప్రోలరాజు వేసిన శాసనం.మల్లికార్జునస్వామిని దర్శించి పూజించి తన విజయస్తంభాన్ని నాటించిన విషయం ఈ శాసనంలో ఉంది.[3]

క్రీ.శ. 1163వ సంవత్సరంలో కాకతీయ రాజైన రుద్రదేవుడు (క్రీ.శ. 1158 1195) వేయించిన శాసనంలో తన రాజ్య సరిహద్దు దక్షిణాన శ్రీశైలం వరకు వ్యాపించిన విషయ ఈ శాసనంలో చెప్పబడింది [4]

క్రీ.శ 1230వ సంవత్సరంలో గణపతిదేవ చక్రవర్తి చెల్లెలు మైలాలదేవి తన దయూరం శాసనంలో శ్రీశైలంలో గొప్ప దేవాలయం కట్టించినట్లు చెప్పబడింది.[5]

క్రీ.శ. 1249వ సంవత్సరంలో నాయునపల్లి శాసనంలో (బాపట్ల తాలుకా గుంటూరుజిల్లా) గణపతిదేవ చక్రవర్తి దిగ్విజయం చేసి తిరుగు ప్రయాణంలో శ్రీశైలంలో భృంగిమంటం కట్టించినట్లు ఈశాసనంలో చెప్పబడింది [6]

క్రీ.శ. 1260వ సంవత్సరంలో పొందలూరు (రాజంపేట తాలుకా కడపజిల్లా) గణపతిదేవ చక్రవర్తిచేత నియమింపబడిన ఉద్యోగిజన్నిగ

చేపుడు శ్రీపర్వతాన అభినవ గోళకి మఠం, శివలింగపురం, విద్యా మండపం, అధ్యయన శుశ్రూషక బ్రాహ్మణ అతిథి అభ్యాగత పూజలకు గాను అధిరాజేంద్ర మండలంలోని పొందలూరు, పొత్తపినాడు గ్రామాలు అర్పించిన విషయం ఈ శాసనంలో చెప్పబడింది.7

క్రి.శ. 1-2-1313వ సంవత్సరంలో కాకతీయ ప్రతాపరుద్రుని (1296-1323) రాజ్యపాలనలో అతని మంత్రి, పేపేటి రామయ్య వేయించిన శాసనం. స్వామి మధ్యాహ్న నైవేద్యానికి నందికొట్కూరు తాలుకాలో చిలకల గుడిపాడు గ్రామాన్ని, ధారాదత్తం చేసిన విషయం ఈ శాసనంలో ఉంది.8

క్రి.శ. 26-2-1313వ సంవత్సరంలో కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో వేయించిన శాసనం. శ్రీశైలస్వామి అంగరంగ భోగాలకు, సత్రభిక్షాలకు రాజులు నాయకులు, భక్తజనులు, ధర్మపరులు 71 గ్రామాలను అర్పించిన విషయం ఈ శాసనంలో ఉంది.9

క్రి.శ. 1315వ సంవత్సరంలో మాదె నాయకుడు (వెలమ ప్రభువుల మంత్రి) వేయించిన శాసనం. తెలంగాణా ప్రాంతం నుండి వచ్చే యాత్రికుల సౌకర్యార్థం శ్రీపర్వతానికి అభిముఖంగా ఉండే నది దగ్గర నుండి మెట్లు కట్టించిన విషయం ఈ శాసనంలో ఉంది.10

2.3. రెడ్డిరాజుల యుగం :

రెడ్డిరాజుల యుగంలో శ్రీశైల సంబంధి శాసనాలు రెండు మొదటిది. క్రి.శ 9-1-1378వ సంవత్సరంలో ప్రోలయవేమారెడ్డి వేయించిన శాసనం. ప్రోలయ వేమారెడ్డి శ్రీశైల పర్వతం సుల భంగా అధిరోహించడానికి మెట్లు, ప్రోలయ వేమారెడ్డి కొడుకు అన వేమారెడ్డి వీరశిరోమండపం నిర్మించారు.నిర్వహణ బాధ్యత "మల్లయ్య" కు అప్పగించడమనే వృత్తాంతం కూడా ఈ శాసనంలో ఉంది.11

క్రీ.శ. 1398వ సంవత్సరంలో కాటయ వేమారెడ్డి (కుమారగిరి రెడ్డి బావ) వేసిన శాసనం. శిఖరేశ్వరానికి మెట్లు కట్టించిన విషయం ఈ శాసనంలో ఉంది.12

## 2.4 విజయనగర రాజుల యుగం :

విజయనగర రాజుల యుగంలో శ్రీశైల సంబంది శాసనాలు ఇరవై రెండున్నాయి. వీటిలో సంగమ వంశ రాజుల కాలంలో వేసిన శాసనాలు ఆరు. సాళువ వంశరాజుల కాలంలో వేసిన శాసనాలు రెండు తుళువ వంశరాజుల కాలంలో వేసిన శాసనాలు పదకొండు. ఆరవీటివంశ రాజుల కాలంలో వేసిన శాసనాలు మూడు. తుళువ వంశరాజుల కాలంలో శ్రీశైల సంబంధి శాసనాలు ఎక్కువగా ఉన్నాయి.

### 2 4.1 సంగమ వంశం :

క్రి.శ. 1393-1394వ సంవత్సరంలో రెండవ హరిహర రాయల (1377-1404) భార్య విరలాంబ వేయించిన శాసనం. పాతాళ గంగకు మెట్లు కట్టించడం ఈ శాసనవిషయం ఇది సంస్కృత శాసనం. 13

క్రి శ. 21-1-1405వ సంవత్సరంలో రెండవ హరిహరరాయలు వేసిన శాసనం. శ్రీశైలస్వామికి ముఖమండపాన్ని నిర్మించినట్లు ఈ శాసనంవల్ల తెలుస్తుంది.14

మొదటి దేవరాయల కాలంలో క్రి.శ.(1406-1422)క్రి శ 1422వ సంవత్సరంలో దేవనయ్యంగారు కుమారుడు అప్పనయ్యంగారు దుర్గా దేవి మొదలుకొని మల్లికార్జున దేవుని దక్షిణ ప్రధాన ద్వారం నంది కంభం వరకు మెట్లు కట్టించిన విషయం ఈ శాసనంలో ఉంది.15

రెండవ దేవరాయలు కాలంలో (1422-1466) క్రి శ. 1448వ సంవత్సరంలో వ్యాపారస్తులచేత ఈ శాసనం వేయబడింది శివరాత్రి

పండుగకు పట్టుచీరెలు, బంగారు మాడలు, నైవేద్యాలు స్వామికి సమర్పించిన విషయం ఈ శాసనంలో చెప్పబడింది.[16]

క్రీ శ 1458వ సంవత్సరంలో రెండవ దేవరాయల సేవకుడయిన దేమరసవ్వె రాజు తరపున భూములను కొనుగోలు చేసి శ్రీశైల నిత్యపూజలకు దానం చేసిన విషయం ఈ శాసనంలో చెప్పబడింది.[17]

క్రీ.శ. 1465వ సంవత్సరంలో విరుపాక్షరాయల పట్టాభిషేక సందర్భంలో వేసిన శాసనం. కన్నాడు మండలంలోని సిరుమావాటుకూరు గ్రామాన్ని స్వామి అంగరంగ భోగాలకు, పక్షోత్సవాలకు, మాసోత్సవాలకు పశువక్ష్యాదులకు ఆహారంగా ధాన్యం వేయడం వివరాలున్నాయి ఇది సంస్కృత శాసనం.[18]

2.4.2 సాళువ వంశం :

క్రీ శ. 1468వ సంవత్సరంలో సాళువ ప్రతాపదేవ మహారాజు వేయించిన శాసనం శ్రీశైల స్వామికి నిత్యపూజల కోసం సిద్ధాపురం గ్రామాన్ని, గంగ సముద్రం చెరువుకింద మగాణి భూముల్ని, సిద్ధ సముద్రం చెరువు దగ్గర ఉండే తోట, బ్రాహ్మణులకు, జంగమయ్యలకు పాలిచ్చే ఆవులను, రెండు భవనాలను దానంగా ఇచ్చిన విషయం ఈ శాసనంలో ఉంది.[19]

క్రీ శ. 1485వ సంవత్సరంలో యూరాము కామదేవయ్య రాజు కుమారుడు పెద్దమల్లపరాజు శ్రీశైల స్వామికి ఒక కొలను, భూముల్ని ధారాదత్తం చేసినట్లు ఈ శాసనంలో ఉంది.[20]

2.4.3 తుళువ వంశం :

క్రీ.శ.1505వ సంవత్సరంలో [నాగిశెట్టి లక్కమ్మల కుమారుడు] వీరయ్య, స్వామి ఆలయంలో ముఖమండపం, దక్షిణ ద్వారానికి బంగారు రేకులను తొడిగించిన విషయం ఈ శాసనంలో ఉంది.[21]

క్రీ. శ. 1512వ సంవత్సరంలో శ్రీకృష్ణదేవరాయల కాలంలో [క్రీ. శ 1509-1529] కామదేవలింగయ్య గారు కామలింగేశ్వర విగ్రహాన్ని ప్రతిష్టించి, స్వామి సేవార్థం ప్రాకారంమీద తూర్పు దక్షిణ గోపురాలు నిర్మించిన విషయం ఈ శాసనంలో ఉంది.[22]

క్రీ. శ. 25-7-1515వ సంవత్సరంలో శ్రీకృష్ణదేవరాయలు వేయించిన శాసనం. శ్రీకృష్ణదేవరాయలు దిగ్విజయయాత్ర పూర్తి చేసి శ్రీపర్వతం వచ్చి శ్రీశైలస్వామి తేరువీధిని శిలామండపాలు, స్వామివారి మధ్యాహ్న నైవేద్యానికి పొరుమంచాల, ఆతుకూరు గ్రామాలను ధారాదత్తం చేసిన విషయం ఈ శాసనంలో ఉంది.[23]

క్రి శ. 1516వ సంవత్సరంలో శ్రీకృష్ణదేవరాయల విజయాలు, ఆలయంలోని ముఖ్యభాగాలు మరమ్మత్తు చేయించిన విషయం ఈ విషయం ఈ శాసనంలో ఉంది.[24]

క్రీ. శ. 1518వ సంవత్సరంలో శ్రీ పర్వతయ్య వేయించిన శాసనం. శ్రీ పర్వతయ్య అతని భార్య శ్రీశైలస్వామిని దర్శించి, భీముని కొలను చెరువు, మహాపురం దగ్గర తోటను నిర్మించి స్వామి సేవార్థం సిద్ధాపురం భూమిని ధారాదత్తంచేసిన విషయం ఈ శాసనంలో ఉంది.[90]

క్రి.శ. 17-10-1529వసంవత్సరంలో అవసరం చంద్రశేఖరయ్య వేయించినశాసనం శ్రీశైలస్వామి అమృతపళ్ళకు సిద్ధాపురం సీమలోని గట్టిరాజు పెంట గ్రామాన్ని దానం చేసిన విషయం ఈ శాసనంలో ఉంది.[26]

క్రీ. శ. 15-11-1529వ సంవత్సరంలో శ్రీకృష్ణదేవరాయలు వేయించిన శాసనం. రాయలమంత్రి చంద్రశేఖరయ్య (రాజు తరపున)

స్వామి ఆలయంలో ఉత్తరదిశన కళ్యాణమండపం, హోమమండపం, బంగారు కలశాన్ని నిర్మించిన విషయం ఈ శాసనంలో ఉంది.[27]

క్రీ. శ. 28 3 – 1530వ సంవత్సరంలో శ్రీకృష్ణదేవరాయలు వేయించిన శాసనం. స్వామి వారి అమృతపళ్ళకు ముదలిమడుగుసీమ లోని శివపురాన్ని, బంగారు కాహళని గెండిపానవట్టం సమర్పించి, స్వామికి ఉత్తరాన బంగారుకంభాన్ని నిలిపి, వీరభద్రాలయంముందర స్నానఘట్టం, బ్రాహ్మణులకు దేమసముద్రం గ్రామాన్ని ఇచ్చి చంద్రశేఖరయ్య శ్రీశైలరాజ్యం విలిన విశేషాలు ఈ శాసనంలో ఉన్నాయి.[28]

క్రీ. శ. 22-8 – 1530వ సంవత్సరంలో శ్రీకృష్ణదేవరాయలు వేయించిన శాసనం. శ్రీశైలస్వామి అమృతపళ్ళకు చాగలమర్రి సీమ లోని వెలగోడు గ్రామం ధారాదత్తం చేసిన విషయం ఈ శాసనంలో ఉంది.[29]

క్రీ.శ. 1530వ సంవత్సరంలో అచ్యుతరాయలకాలంలో (1530–1542) వైకంటి కామరాజు కుమారులు వేయించిన శాసనం. అన్నపూర్ణ భవాని విగ్రహాన్ని స్వామి ఆలయంలో వంటశాలవైపు నిర్మించిన విషయం ఈ శాసనంలో చెప్పబడింది [30]

క్రీ. శ. 14-1-1531వ సంవత్సరంలో అచ్యుతరాయల పూశిగ మాలపనాయకుడు శ్రీశైలస్వామికి వింజామరలను, శ్రీ భ్రమరాంబా దేవి ధరించడానికి జలతారు. కమ్మలను సమర్పించిన విశేషాలు శాసనంలో చెప్పబడ్డాయి.[31]

2 1.4 ఆరవీటి వంశం :

అరవీటి వంశరాజులకాలంలో క్రీ.శ. 20-5-1574వ సంవత్సరంలో

రామరాజయ్యు దేవ కార్యకర్త దంతికంటి లింగన్న శ్రీశైలస్వామికి పడమరదిశన ఉన్న భోగవతీ నదిపై ఉన్న చెరువును మరమ్మత్తు చేయడం, స్వామి సేవార్థం ఒక తోటను దానం చేసిన విషయం ఈ శాసనంలో చెప్పబడింది.32

క్రీ.శ. 1585వ సంవత్సరంలో అర్చకులయిన నందినాథుడు, భృంగినాథుడు, వీరభద్రుడు వీరిలో ఎవరు ప్రధాన అర్చకులయినా అవినీతికి పాల్పడకూడదనే విషయం ఈ శాసనంలో ఉంది.33

క్రీ.శ. 1646వ సంవత్సరంలో పాతాళగంగకు పొయ్యే దారిలో వేసినశాసనం. మాదాల గోత్రంలో ముఖ్యుడయిన వెంకటపతినాయనిం గారు (నాయకుడు) శ్రీపర్వతంమీద పండుగలకు ఇతర సంబరాలలో బొమ్మలు అమ్మే వ్యాపారస్తులకు పన్ను లేకుండా చేసిన విశేషాలు ఈ శాసనంలో ఉన్నాయి.34

ఇంతవరకు విస్తరింపబడ్డ శాసనాంశాలబట్టి శ్రీశైలంలో ప్రథమ శాసనం క్రీ.శ. 1057 నాటిదని తెలుస్తుంది. విజయనగరరాజుల కాలం లోనే ఈ క్షేత్రంలో ఎక్కువ శాసనాలు వెలువడినట్లు స్పష్టమవుతుంది.

తరువాతి ప్రకరణం ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో శ్రీశైలం.

కం॥ రుక్శాంక ధరునకును ముని
దృక్శ్యాకారునకు నాదిదేవునకు జగ
ద్దృశ్యాది ఫలదమూర్తికి
ఐశ్వర్యనిష్ఠలునకు శైలభర్తకు క్షేమి"

[ఆ 2– ప 93]

# సంఖ్యా సూచిక


1 South Indian Inscriptions, IX-I, No. 119
2 Inscriptions of A.P. Warangal Dist. No. 15
3 JAHRS XXXVI - Appendix - 4, Page 61
4 Srisailam its History and Culture, Page 175
5 EP-Andhra, P 92 V 48
6 Epi. Ind XXVII PP. 195 ff
7 Inscriptions of A.P. Cuddapah Dist Part-I Page 210-212
8 South Indian Inscriptions X No. 503
9 South Indian Inscriptions X No 504
10 A. R. No. 41 of 1915
11 Copper Plate Inscription of Hyderabad Museum
by Dr N. Raman, P 182, Verses 11
12 Srisailam its History and Culture, Page 127
13 Srisailam its History and Culture, Page 129
14 South Indian Inscriptions-XVI-12
15 A R No. 52 of 1915
16 A.R. No 40 of 1915
17 A R. No 22 of 1915
18 Epigraphy Indian XVP-20
19 A R No 33 of 1915
20 A R. No 26 of 1915
21 A.R No 34 of 1915
22 Srisailam its History and cult, Page 167
23 South Indian Inscriptions, XVI. No 52
24 Srisailam its History and cult, Page 179

25 A.R No. 12 of 1915
26 South Indian Inscriptions, X-VI, No 86
27 Srisailam its Histoty and cult, Page 155
28 South Indian Inscriptions, XVI, No 87
29 Srisailam its History and cult. Page 159
30 A.R. No 35 of 1915
31 South Indian Inscriptions, XVI No 94
32 South Indian Inscriptions, XVI No 280
33 Srisailam its History and cult, Page 163
34 A.R. No 46 of 1915

—O—

# 3. ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో శ్రీశైలం

దాక్షిణాత్య భాషల్లో తమిళ కన్నడాల తరువాత సుసంపన్న-మయిన సాహిత్యం తెలుగుభాషలోనే ఉంది. మతకలహాలవల్లనైతేమి: పదకవితలవల్ల తృణీకారభావంవల్లనైతేమి ప్రాచీనాంధ్ర సాహిత్యం చాలవరకు మనకు దక్కలేదు. అందుకే సాహిత్యచరిత్రను ప్రధానంగా నన్నయ నుండి చదువుకోవడం అలవాటయింది. ఆంధ్రవాఙ్మయంలో ప్రాస్తావికంగా చాలాచోట్ల శ్రీశైల ప్రశంస కనిపిస్తుంది. వీటిని సాహిత్య విభజనతో పరిశీలించవచ్చును.

## 3.1 నన్నయ యుగం :

నన్నయ కవి (క్రీ. శ. 1053) కాలంలోని వాడు. ఇతని మహాభారత రచనలో అర్జునుని తీర్థయాత్రవర్ణన సందర్భంలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

సీ॥ దక్షిణ గంగ నాదద్దయు నొప్పిన గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడగగుచున్న శ్రీపర్వతంబును జూచి
యుర్విలోన
ననఘమైన శిష్టాగ్రహార భూయిష్టమై ధరణిసురోత్తమాధ్వరని
దాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేంగి దేశ విభవంబుజూచుచు
విభుడు దక్షి

గీ॥ ణాంబురాశి తీరంబున కరిగి దురితహారియైన కావేరీమహా
సముద్ర
సంగమంబున భూసురేశ్వలకభిమతార్థిదానంబుజేసి కృతార్థు
డగుచు

[ఆది.ప-అరి ప 189]

3 2 శివకవి యుగం :

శివకవి యుగంలో నన్నెచోడుడు,మల్లికార్జున పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు, చక్రపాణి రంగన రచనలలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

నన్నెచోడుడు (క్రీ.శ. 1130) కాలంలోనివాడు. ఇతని కుమార సంభవ రచనలో తన గురువగు జంగమ మల్లికార్జునునికి, శ్రీశైల మల్లికారున స్వామికి అభేదం చెప్పే సందర్భంలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

"కావునం బరమ శ్రీనగోత్తుంగమణి శ్రీసంగత మల్లికార్జున
దేవతా రంబై
జంగంబుల బ్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమ మల్లికార్జునదేవుడై
(కు. సం ఆ1-ప58)

మల్లికార్జున పండితారాధ్యుడు (క్రీ శ. 1160) కాలంలోనివాడు

ఇతని అక్షరాంక గద్య, స్తుతి శ్లోక పంచకం శివశరణు పదం రచనలలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

అక్షరాంక గద్యకే మల్లికేశ్వరగద్య అని కూడ పేరు. ఆంధ్ర భాషకు ఉండే యాభై వర్ణాలను పాదాదిన ఉంచి శ్రీపర్వత లింగాన్ని స్తుతించిన రచన ఇది. ఈ గద్యంలో

"వరదశైల విహార
అక్షరాంక స్తోత్ర
శ్రీపర్వత లింగ నమస్తే నమస్తే నమః
(అక్షరాంక గద్య)

అనే పంక్తులలో శ్రీశైల ప్రసక్తి స్పష్టం.

స్తుతి శ్లోక పంచకం మల్లికార్జున స్తుతికి సంబంధించింది. ఈ స్తుతిలో ఐదు శ్లోకాలున్నాయి. ప్రతి సంస్కృత శ్లోకాంతంలో

"తస్మై నమోస్తు కుధర వల్లభాయ-1
తస్మై నమశ్శ్రీకుధర ఖేలనాయ-2
తస్మై నమశ్శ్రీ కధర మందిరాయ-3
తస్మై నమశ్శ్రీకుధర వల్లభాయ-4
తస్మై నమశ్శ్రీకుధర వందితాయ-5

అని ఉండడంవల్ల ఇది శ్రీశైల స్వామిదే కావచ్చు. శైల, కుధరంలు రెండూ పర్యాయపదాలు

శివశరణు పదంలో మల్లికార్జున పండితారాధ్యుడు లింగైక్యం చెందే సమయంలో శ్రీశైలప్రసక్తి ఉంది.

"చారనీవె నన్ను నీపురి యగుచున్న

సిరిగిరి నుండెద శివ శరణు
ఉండంగ గోరెద నో పర్వతేశ
ఖండేందు మౌళి నీ గర్భంబులోన"

పాల్కురికి సోమనాథుడు (క్రీ.శ. 1160-1240) కాలంలోనివాడు. ఇతని పురాణం, పండితారాధ్య చరిత్ర, వృషాధిప శతకాలలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

బసవపురాణం ఏడాశ్వాసాల ద్విపద కావ్యం. వీరశైవ మతప్రవక్త బసవేశ్వరుని కథ ప్రధాన మయినా, అనుషంగికంగా ప్రాచీన ఆధునిక శివభక్తుల కథలు ఈ కావ్యంలో తనివి తీరావర్ణించాడుసోమన.

"శ్రీమన్మహాదేవు సింహాసనంబు
హైమవతీశు విహారస్థలంబు
హరుని భక్తులకు నేకాంతవాసంబు
వరమ యోగులకు స్వాతంత్ర్యమదావహంబు
నరులకు కర్మ సంహారణైక హేతు
వరయగ సురలకు స్వాశ్రమ భూమి
సకల తీర్థములకు జనయిత్రి యగుచు
బ్రకటింపనొప్పు శ్రీపర్వతేంద్రంబు [వ.బ.పు 31–38]

బసవపురాణంలో సిద్ధరాముడు, ముగ్ధసంగయ్య, కన్నప్ప, తెలుగు జొమ్మయ్య కథలలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

సిద్ధరాముని కథలో భక్తులు చిన్నలి పురాన్ని శ్రీశైలం చేయ వలసిందిగా కోరినపుడు చెప్పినది.

"సిద్ధుండు లోక ప్రసిద్ధంబుగాగ
నభినవ శ్రీగిరి యనగ నిప్పురము

నభినవ లీల సోంపార రచించి
యా పర్వతము మల్లికార్జునదేవు
నేపార గొనివచ్చి యిచట నిలిపి (ద్వి.ఆ. 668-672)

ఒకానొక వేశ్య సంగయ్యతో తనగురు సంప్రదాయాన్ని

"తలపమాగురు సంప్రదాయంబు వారు
గలరు శ్రీగిరి యాదిగా నెల్ల యెడల నధిప (తృ.ఆ 343-344)

అనే పాదాలలో స్పష్టం చేసింది

అరణ్యంలో ఒంటిగా కనిపించిన శివలింగాన్ని చూచి తన్నప్ప ఆనూయకంగా

"పరపల త్రొక్కన బడజాల కీవు
సిరిగిరి మండక సురిగి వచ్చితివో" (తృ ఆ 771-772)

అనే పాదాలలో శ్రీశైలం "సిరిగిరి"గా కనబడుతుంది.

తెలుగు బొమ్మయ్యకథలో శివానందుడు

"శ్రీశైలమున సమంచిత నిర్ఘర ప్ర
దేశంబున సమాధిస్థుడై యుండ (పం.ఆ. 1285-86)

అని శ్రీశైలంలో సమాధిస్థుడయిన సందర్భంలో శ్రీశైలప్రసక్తి ఉంది. బసవన శివునికి ఇతర దైవాలు సాటిరావని చెబుతూ

"సిరిమహాదేవుడొ సిరిగిరి పతికి సిరివాసుదేవాది సురలుసమంబె"
(ష.ఆ. 1681-82)

అని చెప్పే సందర్భంలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

బోయలు మడికూటి వృత్తి [ప్రసాదం కొనే వ్యాపారం] తమకే చెల్లిందని ఆధారపూర్వకంగా వాద మాడు సందర్భంలో

"వారణాసి గయు గేదారంబు నందు
సౌరాష్ట్రమునను దాక్షారామమునను
శ్రీగిరి యందును" [న.ఆ 1131-33]

శ్రీగిరి ప్రసక్తి ఉంది ఈ బసవపురాణంలోనే విషాన్ని దిగమింగిన బసవడు

"చిక్కంగ నీకుమా శ్రీగిరినాథా (స ఆ 1318)

అని శ్రీశైలేశుని ప్రార్థించాడు.

"రుద్రాక్ష శైలముల్ రుద్రాక్షతరులు
రుద్రాక్ష గనులును రుద్రాక్షనదులు (తృ.ఆ 1929-30)
జంగమ శైలముల్ జంగమ తరులు
'జంగమ గుల్మముల్ జంగమ లతలు (తృ.ఆ 1935-36,
అరుదగు శ్రీగిరి గిరులన గిరులు (తృ. 2016)
అరుదగు శ్రీగిరి తరులన తరులు (తృ.ఆ 2020)

అనే పాదాలలో మాదిరాజయ్య దర్శించిన శ్రీశైలపరిసరవర్ణన ఉంది.

పండితారాధ్య చరిత్ర పాల్కురికి సోమన వ్రాసిన ఐదు ప్రకరణాల గ్రంథం. పర్వత ప్రకరణంలో శ్రీశైలం సూక్ష్మ సూక్ష్మాంశాలతో వర్ణితం,

శ్రీగిరీంద్రం దక్షిణ కైలాసం.అనుపమ ప్రమథగణస్థానం.మునుల ముముక్షువుల మూల బండరువు. కవి శ్రీశైల పవిత్రతను, మహిమను

"కరమెప్పు దక్షిణ కైలాస మనగ
జను సర్వ పర్వత సార్వభౌమాఢ్య
తను బేర్చు శ్రీగిరీంద్రంబు దానదియు
ననుపమ ప్రమథగణ స్థానవేది

మునుల ముముక్షువుల మూలకందరువు
బాగొంద బర్వతు పండిన తపము
ప్రోగైన మూర్తి, శంభుని యశోరాశి
గరువు గట్టిన మహాకాశంబు, శ్రుతుల
శిరము, ఘనీభవించిన పరంజ్యోతి
సలిలంబులేని విజ్ఞానాబ్ధి కడలు
ధృతి ముద్దగించిన దివ్యామృతంబు
లతగిరిగొన్న మూలస్తంభమనగ
జెలువారునట్టి యా శ్రీశైలశిఖర
కలిత త్రిలోక విఖ్యాత యశః ప్ర
పూర్తియౌ శ్రీస్వయంభూ లింగ చక్ర
వర్తి, యసమకీర్తి వారిత సతత
నార్తి శ్రీమల్లికార్జున లింగ
మూర్తి యొప్పారు సమున్నత మహిమ (దీక్షా. ప్ర. పు 8-9)

అనే పాదాలలో కొనియాడాడు.

పండితారాధ్య చరిత్రలో కళియంబ, ఓహిళుడు, గంగళదేవయ్య కథలలో కూడా శ్రీశైల ప్రసక్తి ఉంది.

కళియంబ అనేవాడు జంగమార్చన చేసే సమయంలో అతని బానిసకొడుకు పాదాలు సాచాడు. కళియంబ వాని పాదాలు కడిగాడు. అతని భార్య మన బానిస కొడుకు మల్లడే వీడు అని కాళ్ళు కడగడాన్ని పరిహసించింది.

"మల్లడే శ్రీగిరి మల్లండుగాక" (పురా.ప్ర 276-285) అని బదితతో ఆమె చేతులు మడికట్టుదాక కళియంబ తెకానరికాడు. కళియంబ కథలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

ఓహిషదు వృద్ధుడయ్యే వరకు తుంగభద్రనీటితో పులిగర సోమేశ్వరుణ్ణి అభిషేకించేవాడు కాలువ దాటుతుండగా నడుం విరిగింది. ప్రాణం వుండగా వ్రతం మాననని కదల ప్రయత్నించాడు. ఈ సందర్భంలో పలికిన

"వెనజెంతలలోన విహరింపవచ్చి మనలిన శ్రీగిరిమల్లికార్జునుడో
(పురా. ప్ర ప్ర 371)

అనే పాదంలో శ్రీశైలేశుని ప్రస్తావన ఉంది

మహావిష్ణువు విహరించే స్థలాలలో శ్రీశైలం కూడా వుంది.

"మును నృసింహావ తారంబున నమల శ్రీశైలంబు
నందు దివురు నావాహన తీర్థంబునందు
(వాద. ప్ర.పు. 640)

అనే పాదాలను బట్టి స్పష్టం.

శ్రీగిరికి నయనాద్రి అని మరోకపేరు. మల్లికార్జునుడు నయనాద్రి దేవుడు. ఈ నయనాద్రిదేవుని మహిమను పాల్కురికి సోమన కీర్తించిన విధం

"శ్రీగిరికడంట శ్రీగిరి యంట
యాగ మోక్షంబ పుత్యక్షంబ చూడ
నయనాద్రి యద మల్లినాథదేవుండు
నయనాద్రి నాథుండు నాసర్వజనులు
దడయక నేత్రముల్ ద్రివ్వితండములు
పదయుడ యిచ్చుట ప్రఖ్యాతి గాదె
యిల గొల్లడైన గొల్లల గాచి గాచి
యలరుచి చేతి దుడ్డటుపోల వైచి

యరిగి నేత్రము లిచ్చి యప్పాడు పతసి
యరుగు గొత్తెల గ్రావవంత వాడనిన
నితరుల జెప్పంగనేల శ్రీశైల
పతి మహాదాన సంపద యెట్లు సెప్పె (మహిమ, పు 39-40)

శ్రీశైలేశుని మహిమ గంగళ దేవయ్య కథలో

"పరుసతోడాను శ్రీపర్వతం బేగి కన్నులు పుచ్చి
శ్రీకంరు బూజించి, కన్నులు వడసి
("మహిమ ప్ర పు. 116 17)

అనే వృత్తాంతంలో కూడా శ్రీపర్వత ప్రశంస కనిపిస్తుంది.

పండితయ్య బసవని దర్శనార్థం కన్నడదేశం వెళ్ళాడు. బసవన నిర్యాణం దారిలోనే విని, తిరిగి వస్తూ శ్రీశైలం చూశాడు. శ్రీశైలం సముద్రంగా, నీలమేఘంగా, పరమ శివునిగా, బపండితయ్యకు కని పించింది.

"కడలేని నిర్మల గాధ మహత్త్వ
జడజా విహార విస్తారోదకముల
సంగీకృతాయతోత్తుంగ శృంగౌంఘు
మంగళ రంగ త్తరంగ సంఘముల
స్థిరగిరి పార్శ్వనదీ ప్రవాహ ప్ర
సర తదియ్య ద్వీప చారుమార్గముల
బరమ నైష్ఠిక శైవ పాశుపతాది
చిరతపోధన మహాపురుష రత్నముల
ఎలమి ద్రింశద్యోజనేతర భూమి
గొలియ యొలికట్టియన్ సమాస్థలమున

మానితంబై యిట్లు శ్రీనగాంభోధి
గానంగనొప్పె ముంగలన్" (పర్వత ప్ర. పు. 228-229)

"అలరారు శ్రీనగంబను నీలమేఘము సమానమై యొప్పెను
(పర్వత. ప్ర. పు 229-31)

"పృథు తరంబై యొప్పు పృథ్వి పీఠముగ
ప్రథితాంబరము దివ్య భవ్య లింగముగ
గ్రన్న దిక్ప్రయము మేఖలముగా దిశలు
ప్రన్నని దివ్యాంబరములు గాగ
బొలుపారు నక్షత్రములు పుష్పములుగ
నలరు సూర్యేందు లద్దీపములుగ
వెలయు దత్త్వాతీత నిత్య చిన్మూర్తి
గొలువు జటాజూట కోటీరముగను
నరుడగు సూక్ష్మ తత్త్వాకారుడైన
హరుగళంబున నున్న హాలాహలంబు
నీలిమం దోచిన లీల బర్వతుని
నీలవర్ణాకృతి నేత్ర పర్వముగ" (పర్వత. ప్ర. 231)

"శ్రీగిరి మహిమడా శేషునకైన వాగీశ్వరునకైన, వాడికిసైన
పర్వతుగన్న శిలాదునకైన జెప్ప శక్యంగాదు ఆనీల
గళునికి తప్ప, నానేర్పు భంగి శ్రీనగమహత్త్వంబు"
(పర్వత పుట 253-54)

చెబుతాను అంటాడు.

శ్రీశైల భర్మహర్మ్యాగ్ర ఖచిత మాణిక్యోరు కలశ
విభూతి నప్పర్వతాగ్ర శృంగైక మధమున" (పర్వత 268)

ఒప్పినది.

"శ్రీగిరి ప్రత్యక్షకైలాసమని శ్రీరుద్ర గణాధిపు లలరినారు"
(పర్వత పుట 269)

"అఖిల మానవులకేట్లైన శ్రీశైలశిఖర దర్శనమాత్ర
సిద్ధించుముక్తి. శ్రీగిరి యందొక్క జమ్మిలయూకు
వట్టెడునంత యన్నము యొక్కనికి దానంబు (పర్వత.279-80)

చేస్తేనే ముక్తి వస్తుంది.

"నీగర్భంబులోన జొరనీవే నన్ను నీపురి యగుచున్న
సిరిగిరి నుండెడ శివశరణు" (పర్వత ప్ర. పు. 543-549)

అనే ఈ పర్వతప్రకరణం పాదాలలో శ్రీశైలమహిమ స్పష్టం.

"సిరిగిరి మల్లన్న శరణన్న జాలు" అని ఆంధ్రదేశపు పరుస
(పర్వత. పు. 374)

"సిరిగిరి యిదునిమ్మ సిరిగిరల్లయ్య" అని కన్నడదేశ పరుస
(ప.పు. 376)

చిరిగిరి నిలయనె శివనె యాణ్డవనె" అని అరవదేశపరుస
(ప, ప్ర. 388)

"సిరిగిరి మల్లయ్య చరమదితయుంత మఖరజె
సిరిగిరి మల్లయ్య రాణ" అని అరెదేశపుపరుస
(ప.ప్ర. పు. 381)

"శుభకర శ్రీశైల చూడాకరాయ"అని గీర్వాణభాష ప.ప్రపు.389

"మాళవ కాశ్మీర మాగధ సింధు గౌళ తురుష్కకొంకణ
శూరసేన బంగాళ కాంభోజ పాండ్యఘూర్జర కళింగ

ఖర్పర సింహళిక కరహాట ప్రశస్త దేశములవారు
సహజభాషలను యొండరులతో మాటలాడుచు
శ్రీగిరి ప్రణుతి సేయుచును" [పర్వత. ప్ర. పు. 391]

శ్రీశైల పర్వతాన్ని అధిరోహించారు.

పాల్కురికి సోమన వృషాధిపశతకంలో సకలేశ్వర మాదిరాజు ఆరునూరేండ్లు [ఆరువందల ఏండ్లు] శ్రీగిరిపై బ్రతికినట్లు చెప్పే సందర్భంలో—

"ఏడులు నూటటంచు శ్రుతులెన్నంగ శ్రీగిరిమీద నాఱు
నూఱేడులుపంచరించు సకలేశ్వర మాదిరాజు (వృ.శ.83వపద్యం)

శ్రీశైల ప్రసక్తి ఉంది.

చక్రపాణి రంగనాథకవి "శ్రీగిరినాథవిక్రమం" అనే శ్రీశైలక్షేత్ర-మాహాత్మ్యం వ్రాశాడు. ఈ గ్రంథం అలభ్యం. ఇతని శివభక్తి దీపిక (శేక) నయనరగడ, నమశ్శివాయరగడ అనే రెండురగడలలో శ్రీశైల ప్రశంస ఉంది.

దారిలో వున్న శ్రీశైలం దర్శించకుండా శ్రీరంగానికి వెళ్ళినదోషం వల్ల ఇతనికి కనుచూపు పోయింది. శివుని దర్శించకపోవడమే తన అంధత్వానికి కారణం అని శ్రీరంగనాథస్వామి చెప్పగా తెలుసుకొని నయనరగడను శ్రీగిరి మల్లికార్జునస్వామిపై చెప్పాడు.

నయనరగడ కంటి అనే అంత్యప్రాసతో ప్రతిపాదంముగుస్తుంది.

"శ్రీశైల వల్లభుని శిఖరంబు బొడగంటి
కాశీపురాధీశు గౌరీశు బొడగంటి
సర్వలోకేశ్వరు సర్వేశు బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబు బొడగంటి[1]

నమశ్శివాయ రగడలో శ్రీశైలప్రసక్తి ఉంది. ఈ రగడలో మొదటి రెండు పాదాలు.

"శ్రీగిరీశ వశ్యమంత్రశేఖరము నమశ్శివాయ
ఆగమోపదిష్టవిధి మహాఖరము నమశ్శివాయ"2

3.3 తిక్కన యుగం :

తిక్కన యుగంలో యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకంలో శ్రీగిరివంటి దివ్యతీర్థాలు చూస్తే దోషాలు పోతాయని—

"ధరణిం బ్రాక్తన భక్త నిర్మిత మహాస్థానంబులై యొప్పు శ్రీ
గిరి ముఖ్యంబగు దివ్యతీర్థముల భక్తింజూచిరే వారి దు
స్తరదోషంబులు వాయునన్న........సర్వేశ్వరా(స.శ.27వపద్యం)

చెప్పే సందర్భంలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

3 4 ఎఱ్ఱనయుగం :

ఎఱ్ఱన యుగంలో ఎఱ్ఱన, రావిపాటి, త్రిపురాంతకుడు, కృష్ణమాచార్యుల ప్రసక్తి ఉంది.

ఎఱ్ఱనకవి [క్రీ.శ 1280-1364] కాలంవాడు. వేమారెడ్డి గురువు ఘోడెరాయ గంగగురువు. ఎఱ్ఱన ఆశ్వాసాదిలో చెప్పిన—

"శ్రీపర్వతేశ భక్తి
ఖ్యాపిత గుణఘోడెరాయ గంగగురు కృపా
స్థాపిత సామ్రాజ్య నము
ద్దీపిత వేమక్షితీంద్ర దీప్తదివేంద్రా" (హరి. ఉ ఆ 4 ప1)

పద్యంలో శ్రీశైలప్రసక్తి ఉంది.

రావిపాటి త్రిపురాంతకుడు (క్రీ.శ. 1380) కాలంలోని వాడు-ఇతని "త్రిపురాంతకోదాహరణం" రచనలో-

"ఆఅడియాస నిరస ధరాధిపలోకము లిండ్లు వాకిటల్
దూటుట మాని శ్రీనగము తూర్పు వాకిలి జొచ్చిపాపముల్
నీఱుగంజేసి గంధవతి నీటను గ్రుంకి మనంబులోన చి
చ్ఛాలగ జేయుటొప్పు త్రిపురాంతకదేవునకై నమస్కృతుల్"

అనే పద్యం చెప్పే సందర్భంలో శ్రీశైలప్రసక్తి ఉంది.

కృష్ణమాచార్యుల సింహగిరి వచనాలలో కృష్ణమాచార్యులకాలంలో శ్రీశైలానికి వెళ్ళి శైవులయ్యేవారని తిరుపతుల సందర్శించి వైష్ణవు-లయ్యేవారని-

"దేవా! (శ్రీ) పర్వతంబునకు బోయి శైవులగుదురు
తిరుపతుల జూచి వైష్ణవులగుదురు" [సింవ 43వ పద్యం]

చెప్పే సందర్భంలో శ్రీశైలప్రసక్తి ఉంది.

3.5 శ్రీనాథయుగం :

శ్రీనాథయుగంలో శ్రీనాథుడు, పోతన, జక్కన, గౌరన, కొలవి గోపరాజు, తాళ్ళపాక తిమ్మక్క, పిన్నకోటి పెద్దన, రచనలలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

శ్రీనాథుడు [క్రీ.శ. 1385 1475] కాలంలోనివాడు, ఇతని హర విలాసం, కాశీఖండం, పలనాటివీరచరిత్ర, శివరాత్రి మాహాత్మ్యం రచన లలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

శ్రీనాథుడు హరవిలాసంలో శ్రీశైలానికి భక్తులు అధిరోహించడా

నికి మెట్లుకట్టించిన విషయాన్ని "శ్రీపర్వతసోపానస్థాపకుడగు రెడ్డి వేమ జగతీపతికిన్" అనే పద్యంలో ప్రస్తావించాడు–

శ్రీనాథుని కాశీఖండం రచనలో అగస్త్యుడు లోపాముద్ర శ్రీశైలా దర్శించిన సందర్భంలో శ్రీశైలప్రసక్తి ఉంది. శ్రీశైలవర్ణన సంక్షిప్తముగా ఉన్నా, సమగ్రతకు కొదువలేకుండా చేశాడు.

"కఠోర మద పరిణతి దశావష్టంబ సంస్తంభ సముజ్జృంభమాన హేరంబ దశనకులిశ కఠోర కోటి భేద్యమాన హాటకకటకటంకార ఘట్టి(త) కాంశం గణంబై చతుర్ద్వారంబులను జతురంతర చతుష్పక్షద్వారంబుల షోడశగవాక్షంబుల ద్వాత్రింశన్మ కరతోరణంబుల చతుష్షష్టి నాట్య కూటంబులను బంచాశదుత్తర సహస్ర దీర్ఘికలను శతసహస్ర కోటి లింగంబులను దశసహస్ర కోటి శక్తులను గోటి తీర్థంబులను గలిగి వరాహకుండ మల్లికాకుండ క్షీరకుండాది కుండంబులచేతను గభశీవన బదరీవన గౌరీవన బిల్వవనాది "ముఖ్యవనంబులచేతను హాటకేశ్వర సప్తమహేశ్వర నంది మండల నివృత్త్యాదులైన దివ్యస్థానంబుల చేతను రససిద్ధి, రసాయనసిద్ధి, మూలికాసిద్ధి, పాదుకాసిద్ధ్యాదులగు సిద్ధ క్షేత్రంబులచేతను శోభితంబై దివ్యామృతనిర్మల శ్రీస్వయంభూ జ్యోతిర్లింగ మూర్తియగు మల్లికార్జున శ్రీమాన్ మహాదేవునకు నిజవాసంబై సుఖారామంబై దివ్యంబునగు శ్రీశైలంబు" (కాశీ.ఖం. ఆ 3-ప 52)

శ్రీనాథుడు పలనాటివీరచరిత్ర రచనలో కార్యమపుది యుద్ధానికి శ్రీశైల భూమిలోనే శ్రేష్ఠమయినదని [పుట 322] చెప్పాడు.

సంతానంకోసం ఐతమ్మ పడినపాట్లు, ఆవిడ శ్రీశైలేశుని సేవించిన పద్ధతిని శ్రీనాథుడు–

"శ్రీభ్రమరాంబకు శ్రీశైలపతికి

రజత కాంచనముల రాజిల్లునట్టి
కూష్మాండ ఫలములఁగూర్చి
గౌరీమహేశ్వర ఘననామ శిఖరి
ఎక్కియు సోమిరి నేలేశ్వరమున
దిగివచ్చి నోమిరి తిల సర్వరమున
శ్రీశైలపథమున చెలువంబుమీర
అశ్వత్థవంక్తుల నభివృద్ధిజేసి"
అనే పాదాలతో వర్ణించాడు.

శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్య రచనలో శ్రీశైలంలో కొలుపున్న వారిని-

"శ్రీకాంతభిక్షా వృత్తి యతీశ్వరుండు, శ్రీపర్వత
స్వయంభూ లింగ చక్రవర్తి శ్రీమన్మల్లికార్జున
మహాదేవుని ముఖమండపమున సుఖాసీనుఁడయి
భక్త బ్రాహ్మణ క్షత్రియ వైశ్య వీరభటస్థానాధికారులు"
(శి.మా ఆ 1-వ 18)

అనే వాక్యంలో ప్రస్తావించాడు.

బమ్మెర పోతన (క్రీ శ. 1420-1480) కాలంలోనివాడు. పోతన భాగవత రచనలో-

"శ్రీశైలంబునకుంజని వేంకటాచలంబు దర్శించి(దశమ-ఉ.951)

అని బలరాముని యాత్రలో శ్రీశైలానికి ప్రాముఖ్యం ఇచ్చాడు.

జక్కన (క్రీ. శ. 1380-1440) కాలంలోని వాడు. జక్కన విక్రమార్క చరిత్రలో శ్రీశైలప్రశంస ఉంది. చంద్రగుప్తుడు తనన్ను చేయటానికి సిద్ధపడి తానెందుకు ఆ ప్రదేశం ఎన్నుకున్నాడో ఆ శ్రీశైల

మాహాత్మ్యము కొడుకులకు చెప్పు సందర్భంలో శ్రీశైల ప్రశంస ఉంది

"శిల లఖిలంబు లింగములు, చెట్లు, సమస్తము గల్పభూజముల్
జలములు దేవతానది జలంబులు మానవులెల్ల సంశయముల్
పలికిన పల్కులెల్లను జపంబు చరించుట సత్ప్రదక్షిణం
బులు నిదురల్ సమాధి, తలపోయగ శ్రీగిరిమీద జోద్యముల్
[వి చ. ఆ1-ప 197]

"వారణాసీ పురంబున వారణమేను దొరంగనేల కే
దార జలంబు లర్థిమెయిన్ ద్రావి శరీరము కోరవోవగా
నారడి పొందనేల? యొకయప్పుడు జన్మము లేకయుంటకై
దూరయ శ్రీనగంబు శిఖరాగ్రము జూచిన చాల నెమ్మదిన్
[వి.చ. ఆ 1-ప 200]

గౌరన (క్రీ.శ 1380-1450) కాలంలోని వాడు. ఇతని హరి శ్చంద్రోపాఖ్యానం, నవనాథచరిత్ర రచనలలో శ్రీశైలప్రసక్తి ఉంది.

హరిశ్చంద్రోపాఖ్యానంలో శ్రీశైలం ప్రసక్తి ఉంది. కవి మల్లి-కార్జునస్వామిని, భ్రమరాంబికను కొలిచే సందర్భంలో—

"శ్రీగిరిజాధీశు శ్రీగిరినాథు [ప్ర.ఖా. మొదటిపాదం]
....భ్రమరాంబికా సుహాశక్తి గొలిచి [17వ పాదం]

అనే పంక్తులలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

నవనాథచరిత్రలో సిద్ధనాగార్జునుడు దర్శించిన శ్రీశైలం క్రింది ద్విపదల్లో కీర్తించబడింది.

"దేవాలయంబుల దివ్యలింగముల
జలత్పణ గ్రామకాష్ఠ ప్రకాశనముల

బలసిన జ్యోతుల బరునవేదులను
విమల చింతామణి వేదికాస్థలుల
రమణీయమగు సిద్ధరసకూపములను
విలసిల్లు నిజశృంగ వీక్షణమాత్ర
నలఘు పాపంబుల నన్నిట గడచి
క్రమ్మఱ మాతృగర్భములకు రాక
నెమ్మది నుండెడు నెలవుల నిలుపు
నతి మహోన్నతి నమరు శ్రీనగము (వం.చ. పుట 218)

కొలని గోపరాజు సింహాసనద్వాత్రింశికలో శ్రీనగం చూస్తే చాలు ముక్తి వస్తుందని పౌరాణికుడు చెప్పే సందర్భంలో

"మెట్టక పెట్టక పట్టక గిట్టక తీర్థముల ముక్తి కిం జనరాదె
తొట్టుచు బొరయక మెయి మెయి కట్టెదురన్ శ్రీనగంబు గనినన్
చాలున్ (సిం.ద్వా అ 8-ప 142)

శ్రీశైలప్రసక్తి ఉంది.

తాళ్ళపాక తిమ్మక్క (క్రీ.శ. 1460) సుభద్రాకళ్యాణం రచనలో అవతారికలోనే శ్రీశైలస్వామి తమకు శుభాలిస్తాడని ఉంది.

"శ్రీనగమందిరుం డమర సేవితుడు....
మల్లికార్జునుడు తానిడు మాకు శుభంబు లొప్పుగన్ (అవ. 2)

అర్జునుని తీర్థయాత్రా వర్ణన సందర్భంలో-

"చనుతెంచె పర్వతస్వామి సన్నిధికి
అమర అహోబలం చా వేంకటాద్రి
పరుస నాపై కంచి వరదుల గొలిచె (సు.క. పు. 6)
అని శ్రీశైలాన్ని కూడా పేర్కొంది.

విన్నకోట పెద్దన్న [క్రీ. శ. 1402] కాలంలోని వాడు. ఇతని కావ్యాలంకార చూడామణి రచనలో ఆంధ్రదేశానికి త్రిలింగదేశం అనే పేరు చెప్పు సందర్భంలో—

"ధర శ్రీపర్వత, కాళేశ్వర, ద్రాక్షారామ సంజ్ఞవలలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం బరుధార త్రిలింగదేశమన జనుగృతుల్
(కా.చూ. ఆ 9—ప 5)

3.6 రాయలయుగం :

రాయలయుగంలో ధూర్జటి, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరన రచనలలో శ్రీశైలప్రసక్తి ఉంది.

ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో కాళహస్తీశ్వర శతకంలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యంలో అగస్త్యుడు లోపాముద్రతో శ్రీశైలానికి వచ్చిన సందర్భంలో—

"వింధ్యపర్వత గర్వంబు విఱగద్రొక్కి, గౌతమీ కృష్ణవేణ్య
వగాహనములు
సేసి శ్రీశైలనాథు దర్శించిజ్యోతి, సిద్ధవటనాథుగొల్చి విచ్చేయు
నపుడు [కా.మా. ఆ 1-వ 108]

శ్రీశైల ప్రసక్తి ఉంది.

కాళహస్తీశ్వర శతకంలో—

"శ్రీశైలేశు భజింతునో యభవు గాంచీనాథుసేవిం
తునో కాశీవల్లభుగొల్వ బోదునో మహాకాళేశు
బూజింతునో నాకేలంబబ్బువైన మేరువనుచున్ రక్షిం

వచే నీకృపా శ్రీశృంగారవిలాసహాసములచే శ్రీకాళహస్తీశ్వరా!"
(కా.శ. 72వ పద్యం)

శ్రీశైలేశని ప్రసక్తి ఉంది.

తెనాలి రామకృష్ణుడు (క్రీ.శ. 1485-1575) కాలంలోని వాడు. ఇతని పాండురంగ మాహాత్మ్యం రచనలో పుండరీకక్షేత్ర వర్ణనలో పాండురంగస్వామి పుండరీకునితో చెప్పు సందర్భంలో-

"వేదారంబునకంటె షడ్గుణంబును, వారాణసి
కంటె దశమ గుణంబును, శ్రీశైలంబుకంటె
ననంతంబునై పుండరీకుని పేరం బౌండరీకంబన
మహీమండల మణికుండలం బగుచునుండును" పా.మా.అ2-80

శ్రీశైల ప్రసక్తి ఉంది.

పింగళి సూరన (క్రీ శ.1560)కళాపూర్ణోదయం రచనలో సిద్ధుడు శ్రీశైలాన్ని దర్శించిన సందర్భంలో—

"శిలిత యోగ వైభవుండు సిద్ధుడు వేడుకమించ గాంచె శ్రీ
శైలము నీలలోహిత లసన్మణి చిత్రితసానువైభవో
త్తాలము సేవకేష్ట ఫలదాన విధాన నవీన దివతా
పాలము నిత్యవర్ధగుణజాలము ముక్తిలతాలవాలమున్
[క.పూ. 5-వ 177]

శ్రీశైల ప్రసక్తి ఉంది.

3.7 దక్షిణాంధ్ర యుగం :

దక్షిణాంధ్ర యుగంలో చేమకూర వేంకటకవి, ప్రౌఢకవి మల్లన్న గట్టుప్రభువు, అయ్యలరాజు నారాయణామాత్యుడు రచనలలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

చేమకూర వేంకటకవి 17వశతాబ్దంవాడు. ఇతని విజయవిలాసం రచనలో అర్జునుని తీర్థయాత్ర వర్ణన సందర్భంలో-

"కృష్ణవేణ్యాది పుణ్యతరంగిణుల మునింగి
యత్తుంగ శృంగ వినోగిలోర సౌత్కృష్ట సువర్ణ
పర్వతంబగు శ్రీపర్వతంబు లోచన పర్వంబుగా
జూచి ప్రణమిల్లి మల్లికార్జున సమ్మోదంబున
బ్రణుతించి, శ్రీమల్లికార్జున మనోజ్ఞభ్రామరీ
విభ్రమ రమ్యముగు శ్రీభ్రమరాంబం బ్రశంసించి"
(వి.విలా. ఆ-1వ128)

అని శ్రీశైల ప్రశంస ఉంది.

ప్రౌఢకవి మల్లన్న రుక్మాంగద చరిత్ర రచనలో బ్రహ్మదేవుడు యమధర్మరాజుతో-

"శ్రీశైలమున్ సాకేతంబును జూచి చూడరు
మనుష్యశ్రేణి నిన్ సూర్యజా (రు.చ. ఆ2-వ85)

అని శ్రీశైల ప్రశంస ఉండ.

గట్టుప్రభువు 18వ శతాబ్దం వాడు. ఇతని కుచేలోపాఖ్యానం రచనలో కవి స్వవిషయంలో చెప్పే సందర్భంలో-

"భ్రమరాంబికావర ప్రవరదివ్య కవిత్వ విద్యా ప్రవీణత వెలసినాడ" ......."శ్రీకుధర మల్లికార్జున శ్రీపదాబ్జ
మత్తభృంగాయమాన సన్మానమండ గట్టుప్రభు
నామధేయ విఖ్యాత యశుడ"

శ్రీశైలస్వామి ప్రసక్తి ఉంది.

అయ్యలరాజు నారాయణామాత్యుడు 19వ శతాబ్దం వాడు. అతని హంస వింశతి రచనలో శ్రీశైలానికి వెళ్ళే భక్తులను కవి క్రిందివిధంగా వర్ణించాడు.

"అయ్యావళీ ముఖ్యమై తనరారెడు మిండజంగంబులు మెలసి
నడువ
గౌరఘే మల్లప్ప గంగకుజను కంచికానళ్ళవారును గలిసి చనగ
గుమ్మెతల్ కిన్నెరల్‌గూడి వాయించుచు భైరవజోగివెంబడినెగడల
బసవగంటలు బృహత్పటుశంఖములుమ్రోయు శివరాత్రి జంగాలు
చేరి కొలువ
లశున తిలపిష్టచూర్ణ భాగశన మసిమి యుల్లి పచ్చళ్ళు పులిదోసె
లూరుబిండ్లు
మూట జోలెలు చిటిగాళ్ళు మ్రోసి తేగ నాతడేదెట శ్రీశైలమరిగి
వచ్చు [హం వి. ఆ 3-ప. 189]

తరువాతి ప్రకరణం కావ్యగేయ వాఙ్మయంలో శ్రీశైలం.

కం॥ మహిత హిమకిరణ ఖర కృ
ద్దహనాకాశ నిలాంబు తత్త్వాది మిళ
ద్బహువిధ పద్మభవాం డో
ద్వహునకు శ్రీలింగ చక్రవర్తికి జేజే (ఆ 2-ప 94)

సంఖ్యా సూచిక

1. ఉదాహరణ వాఙ్మయచరిత్ర, పుట 82
2. ఉదాహరణ వాఙ్మయచరిత్ర, పుట 83



# 4. కావ్యగేయ వాఙ్మయంలో శ్రీశైలం

ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో శ్రీశైల ప్రస్తావన ప్రాస్తావికంగా కనిపించినా శ్రీశైలానికి సంబంధించి స్వతంత్ర కావ్యగేయవాఙ్మయం కూడా విస్తృతంగా ఉంది.

## 4.1 కావ్య వాఙ్మయం :

కావ్యమన్నది విశాలార్థబోధకం, పరిమితిబట్టి వీటిని మహాకావ్యాలని, కావ్యాలని, లఘు కావ్యాలని వర్గీకరించడం అలవాటు. అట్లే శ్రవ్యాలు, దృశ్యాలనే విభాగం కూడా చేయడం సంప్రదాయం. శ్రీశైలానికి సంబంధించిన వాఙ్మయంలో పురాణాలు, మాహాత్మ్యాలు, నాటకాలు అనేకావ్యాలేకాకుండా యక్షగానాలు, శతకాలనే లఘుకావ్యాలు ఉన్నాయి.

### 4.1.1 శ్రీశైలపురాణాలు :

సంస్కృత వాఙ్మయంలో వైదికవాఙ్మయం తరువాత పురాణ వాఙ్మయానికి ప్రాధాన్యం. వేదాలు ప్రభుసమ్మితాలయితే, పురాణాలు

మిత్రసమ్మిశ్రాలని అలంకారికులు నిర్ణయించారు. ఒక శబ్దాన్ని, కవి ఎన్నుకొన్న మార్గవిభేదమేగాని అంతస్సార చిత్రణలో వేదపురాణాలకు తేడా ఏమీలేదు.

ప్రతి ప్రక్రియకు కొన్ని లక్షణాలున్నట్లే పురాణానికి కొన్ని లక్షణాలున్నాయి. సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితాలు చెప్పడంవల్ల పురాణం అని ఒక లక్షణం. జగత్ప్రాగవస్థను గూర్చి చెప్పే సర్గ ప్రతిపాదక వేదవాక్య సముదాయం పురాణం అని విద్యారణ్యుల వారి అభిప్రాయం. ధర్మాన్ని ప్రచారం చేయడం కోసం మహిమలున్న కథల్నికూడా జోడించి వ్రాసిన కథలుకూడా పురాణాలే. సమాజప్రేరణతో సమాజం కోసం సృష్టించబడ్డ సాహిత్యప్రక్రియ పురాణం అనడంలో సందేహంలేదు.

పురాణాలు పద్దెనిమిది అని వాడుక. ఇవేగాక మరికొన్ని ఉప పురాణాలుకూడా ఉన్నాయి. పురాణాలలో స్కాందపురాణానికి ప్రత్యేక స్థానం ఉంది. తీర్థక్షేత్రమాహాత్మ్యం కథనానికి స్కాందం నిలయం. ఇందులో 500 ఖండాలున్నట్లు ప్రసిద్ధి. ఆ 500 ఖండాలలో శ్రీశైల ఖండం ఒకటి. ఈ ఖండం ఆధారంగా నాగలూటి శేషనాథార్యకవి వ్రాసిన పురాణం శ్రీపర్వతపురాణం. ఈగ్రంథం గురించి సమగ్రపరిశీలన ఐదవ ప్రకరణంలో విశ్లేషితం.

#### 4.1.2 శ్రీశైల మాహాత్మ్యాలు :

మాహాత్మ్యం అనే మాటకు గొప్పతనం, మహాత్మ్యత్వం అనే అర్థాలున్నాయి. పూజ్యభావాన్ని తెలిపేది మహిమ అయితే మహిమను వివరించేది మాహాత్మ్యం.

తెలుగులో క్షేత్రమాహాత్మ్యాలు ఒక సాహిత్యప్రక్రియగా ఉంది. తెలుగులో మొట్టమొదటి మాహాత్మ్యకావ్యం నృసింహపురాణం. ఆతరువాత

వెలువడిన శ్రీమహేశ్వరపురాణం మొదలయినవి మాహాత్మ్యకావ్య ప్రక్రియ మైలురాళ్ళు. లాక్షణికులెవ్వరుగాని మాహాత్మ్యలక్షణాలు ఒకచోట ఏర్చి కూర్చలేదు అయినా లక్ష్య పరిజ్ఞానంబట్టి పురాణాలనుండి ఒక ఖండాన్ని తీసుకోవడం. ఉపాఖ్యాన కథలు ప్రధానకథకు విశేషం కావడం. తీర్థ, క్షేత్ర, దైవతమాహాత్మ్యాన్ని చెప్పడమే ప్రధానం కావడం. రచనలలో పండిత పామరరంజకమయిన పద్ధతిని అనుసరించడం మాహాత్మ్యకావ్య లక్షణాలుగా చెప్పవచ్చు.

శ్రీశైలమాహాత్మ్యం :

ఇంతవరకు లభ్యమయిన శ్రీశైల మాహాత్మ్య కావ్యాలలో శ్రీ ఉవ్వుల వేంకటశాస్త్రి శ్రీశైలమాహాత్మ్యం మొదటిది. ఇతడు బాలా త్రిపురసుందరీ త్రిపురాంతకేశ్వర ప్రసాదలబ్ధ సుకవితా విరాజితుడు. కోటీశ్వరుని మనుమడు. సింహాద్రి నరసింహుని పుత్రుడు భారద్వాజస గోత్రుడు. అశ్వలాయన సూత్రుడు. ఇతడు కాశీ ప్రయాణంలో బాలా త్రిపురసుందరీ ఘట్టంలో కూర్చొన్న ఒకానొక యోగి ప్రేరణతో శ్రీశైల మాహాత్మ్యం వ్రాసినట్లు పీఠికవల్ల తెలుస్తుంది. ఇతడు శ్రీపాలుట్ల విశ్వనాధరావు గారికి తన గ్రంథాన్ని అంకితం చేశారు.

కృతికర్త శ్రీ.విశ్వనాథరావు గారు ప్రముఖ న్యాయవాది. మార్కా పురం పట్టణాధ్యక్షుడై పేరుగన్నవాడు. శ్రీశైలక్షేత్రాధిపత్యాన్ని కొంత కాలం నిర్వహించాడు. మదరాసు విశ్వవిద్యాలయం సెనేట్ సభ్యుడు రాయలసీమ మండల బోర్డు మెంబరు "అరుకొండ"పాలెంలో జీర్ణా-లయాన్ని ఉద్ధరించి నాగప్రతిష్ఠాదులు చేసినవాడు.

శ్రీశైలమాహాత్మ్యం ఒక లఘుకావ్యం. ఇందులో రెండు విభాగా లున్నాయి. కాని ప్రథమభాగం మాత్రమే(?) సంవత్సరంలో ముద్రితం పీఠికలో "మరలరచింపమున్నది. ద్వితీయఖండముగా పరిణమింపగలదు

అని చెప్పడంవల్ల రచయిత కావ్యం వ్రాశాడో, వ్రాసినా ముద్రింప బడిందో లేదో తెలుసుకోవడానికి ఖచ్చితమయిన ఆధారాలులభించలేదు.

4.1.3 శ్రీశైల నాటకాలు :

పండిత పామర రంజకమయిన సాహితీ ప్రక్రియలలో నాటకాలు ప్రధానమయినవి. సాహిత్య పఠనం నాటకంతో పూర్తవవుతుందని ప్రచారంలో ఉంది. ఇతర సాహితీప్రక్రియలు వ్రాయటంకన్నా నాటకం వ్రాయడం కష్టంకావడంవల్ల "నాటకాంతాహి సాహిత్యమ్" అనే ఆభాణకం ఏర్పడినట్లు పరిశోధకులు భావిస్తారు.

శ్రీ శైలక్షేత్ర ప్రచారానికి కారణమయిన వాటిలో రూపక రచన కూడా ఒకభాగం. ఆ స్వామి మహిమల్ని వ్యక్తంచేసే నాటకాలు రెండు వెలువడ్డాయి. ఈ రెండుకూడా శ్రీపైడి లక్ష్మయ్య గారే వ్రాశారు.

శ్రీ పైడి లక్ష్మయ్యగారి తల్లిదండ్రులు సుబ్బమ్మ, వేంకటాంబలు లక్ష్మయ్య గారు పాపిళ్ళ గోత్రం వారు. వీరు అనంతపురం జిల్లా అచ్చంపల్లి గ్రామవాస్తవ్యులు. సంస్కృతాంధ్ర ఆంగ్లభాషా విశారదులు. ప్రతిభచేత, పరిపాలనా పాటవంచేత అసెంబ్లీ మెంబరుగా, లోక్‌సభ సభ్యులుగా, దేవదాయశాఖ కమీషనరుగా రాణించారు. కవి చకోర చంద్రోదయ బిరుదాంకితులు.

శ్రీలక్ష్మయ్యగారు శ్రీశైలీయం, శ్రీశైల మల్లికార్జునమాహాత్మ్యం అనే నాటికాలు వ్రాయడానికి ప్రధానకారణాలు మూడు

మొదటిది శ్రీలక్ష్మయ్య గారు శ్రీశైలస్వామి భక్తులు కావడం

ఇక రెండవది భారతదేశాధ్యక్షులయిన శ్రీరాధాకృష్ణన్ గారి ప్రేరణ.!

మూడవది పౌరాణికి చారిత్రక జానపద కథల్ని జోడించి వ్రాయా లనే సంకల్పం.

శ్రీశైలీయం :

ఇది 1979లో ముద్రితమయిన నాటకం. ఈ గ్రంథాన్ని శ్రీశైల దేవస్థానం వారు ప్రచురించారు. ఈ నాటకాన్ని అప్పటి ఆంధ్రప్రదేశ్ దేవాదాయ శాఖామాత్యులు శ్రీ పి.వి. చౌదరిగారు ఆవిష్కరించారు. ఈ నాటకం ఉరవకొండ శ్రీభ్రామరీ మల్లికార్జున నాటక కళాసమితి వారిచే ప్రప్రథమంగా 1978లో మహాశివరాత్రి పర్వదినం నాడు ప్రదర్శితం.

శ్రీశైల మల్లికార్జున మాహాత్మ్యం :

శ్రీ పైడి లక్ష్మయ్యగారు శ్రీశైల మల్లికార్జునమాహాత్మ్యం 1981లో ముద్రితం. ఈ గ్రంథాన్ని శ్రీశైల దేవస్థానం వారు ప్రచురించారు. రచయిత మల్లమ్మ హేమారెడ్డి కథను ఐదు అంకాలుగా రూపొందించారు ఈ నాటకాన్ని విజయవాడ వాస్తవ్యులయిన క్రీ.శే. సూరిబాబు గారి యాజమాన్యంలోఉన్నరాజరాజేశ్వరి నాట్యమండలివారు భద్రాచలంలో శ్రీశైల క్షేత్రంలో, మదరాసులో ప్రదర్శించారు. ఉరవకొండ భ్రామరీ మల్లికార్జున నాటక కళాసమితి వారు సింహాచలంనుండి శ్రీకాళహస్తి వరకుండే దివ్యక్షేత్రాలు అన్నిటిలో ఈ నాటకాన్ని ప్రదర్శించారు. కర్నూలు నాటక కళాపరిషత్తువారు శ్రీనీలం సంజీవరెడ్డిగారి సమక్షంలో ప్రదర్శించారు. కీ.శే. ప్రధానమంత్రి పండిట్ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ సమక్షంలో, శ్రీశైల ప్రాజెక్టు శంకుస్థాపన మహోత్సవ సమయంలో కూడా ఈ నాటకాన్ని ప్రదర్శించారు. నాటి ఆర్థికశాఖా మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, దేవాదాయశాఖా మంత్రిణి శ్రీమతి టి.యస్. సదాలక్ష్మి గారు శ్రీశైలం దర్శించిన సమయంలో ఈ నాటకం ప్రదర్శించారు. ఈ ప్రదర్శనలు జరిగిన తేదీలు ఖచ్చితంగా తెలియవు.

4.1.4 శ్రీశైల యక్షగానాలు :

దేశిసాహిత్య ప్రక్రియలలో యక్షగాన వాఙ్మయం పేర్కొనదగింది. తెలుగున ఉన్నన్ని యక్షగానాలు తమిళ, కన్నడ భాషలలో లేవు. ప్రజలు మెచ్చినదీ, రాజులు పోషించినదీ అయిన సాహిత్య ప్రక్రియ యక్షగానం. శ్రీశైలస్వామి మహిమ ఇతివృత్తంగా వ్రాయబడ్డ యక్షగానాలు రెండు. ఈ రెండు కూడా శ్రీపైడి లక్ష్మయ్య గారే వ్రాశారు.

శ్రీశైల మల్లికార్జున మాహాత్మ్యం :

ఈ యక్షగానానికి హేమారెడ్డి మల్లమ్మ అనే పేరొక పేరుంది. శ్రీపైడి లక్ష్మయ్య గారు—

"నెమ్మది మల్లికార్జునుని భజించిన భక్తురాలి మ
ల్లమ్మ చరిత్ర కాంభవికి నంకితమిచ్చి తరింప యక్షగా
నమ్మును వ్రాయగా విని మనమ్మున సంతసమంది "శ్రీశైల
మల్లికార్జుని ప్రశంస. ప. 5)

అని ప్రశంసలో పేర్కొన్నారు. ఈ యక్షగాన రచనకు కూడా శ్రీ నీలం సంజీవరెడ్డి గారే ప్రేరకులని తెలుస్తుంది. ఇది పలుమార్లు ప్రదర్శితమయినట్టుకూడా విజ్ఞప్తినిబట్టి తెలుస్తుంది. శ్రీశైల మల్లిర్జున మాహాత్మ్యం విజ్ఞప్తిని ఇతివృత్తందృష్ట్యా పరిశీలిస్తే శ్రీశైల మల్లికార్జున మాహాత్మ్య నాటకానికి దీనికి భేదాలేదు. కాకపోతే రచయిత మల్లమ్మ కథకే ప్రాధాన్యం ఇచ్చి రంగనాథకవి, చెవిటి వీరన్న కథల ప్రసక్తి తొలగించారు.

శ్రీశైలీయం :

శ్రీశైలీయం శ్రీపైడి లక్ష్మయ్య గారు వ్రాసిన రెండవ హరికథా

రూపకమయిన యక్షగానం ఇది శ్రీశైలప్రభలో 1981వసంవత్సరంలో ప్రకటితం. శ్రీశైలస్తుతి, భ్రమరాంబస్తుతి, గణపతి ప్రార్థన, వాణీ స్తుతులు అవతారికా భాగంలోనే ఉన్నాయి. ఆపై కవివంశావళి ఉంది. శ్రీశైలీయం అనే నాటకానికి ఈహరికథాకు కథావిషయంలో తేడా ఏమీ లేదు. శిలాదుని కథ, చంద్రగుప్తునికథ ఈ హరికథాలోనిప్రధానాంశాలు.

ఈ హరికథలో కథచక చకా సాగడానికే ప్రాధాన్యం ఇచ్చారు.

తోహరా :

"వసుమతి యను మునికన్య బిల్వతరు
    ప్రాంతమునన్ తపమొనరింపన్
భసితాంగుడు శంకరుడరు దెంచెను
    వాంఛ దీర్చి తరియింపన్
శ్రీగిరిజాపతి యీగిరి నిరతము
    శ్రీపర్వతమను పేరన్
భోగభాగ్యముల సిరిసంపదలన్
    భూరి కీర్తినలరారెన్
వరము నొసంగుము కరుణాకర నా
    ప్రార్థల మదియుని వేడన్
పరమేశ్వరుడు తటస్తటించుచు
    బల్కెను నాసతి తోడన్ (శ్రీశైలీయం పుట 54)

**4.1.5 శ్రీశైలశతకాలు :**

ఆంధ్ర సాహిత్య సంపన్నతకు శతకవాఙ్మయం ఒక సాక్ష్యం సంస్కృతవాఙ్మయంలోని శతక రచన తెలుగు శతక రచనకు మార్గ దర్శకమయినా సంస్కృతంలోకంటె తెలుగులో నేటికిని శతకప్రక్రియ విస్తారంగాను, సజీవంగా ఉంది. తెలుగులో ఉదాహరణాది దేశి

ప్రక్రియల్ని వీరశైవమత ప్రచారార్థం ప్రవేశపెట్టిన శివకవులే శతకాల్ని కూడా వ్రాయడానికి నడుంబిగించారు. శ్రీశైలవాఙ్మయంలో పరిగణించ దగ్గ శతకాలు 7

శ్రీగిరి మల్లికార్జున శతకం :

మల్లికార్జున పండితారాధ్యుడు శివతత్త్వసారమే కాకుండా "శ్రీగిరి మల్లికార్జున" అనే పేరుతో ఒక శతకం వ్రాసినట్లు పండితలోకంలో ప్రచారంలో ఉంది. కాని ఈ శతకం లభ్యంకాలేదు. కాని

"లోకములెల్ల నీతనువు లోనివ నీవట యెంతగల్గుదో
నాకవధూ సంభవ జనార్దనులాదినెల్లి పెద్దలున్
నీకొలదింత యంత యనేకరక క్రొమ్మొక్క దొడంగిరన్నని
న్నేకరణిన్ నుతింతు బరమేశ్వర శ్రీమల్లికార్జునా"[2]

అనే పద్యం మాత్రం పండితారాధ్యునిగా భావిస్తున్నారు.

శ్రీగిరి శతకం :

శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారు మధ్యాక్కరలో వ్రాసిన విసూత్న శతకం ఈశతకానికి ర్మపరం కృష్ణవేణమ్మ వెంకటసుబ్బయ్య తుమిరారుడు శ్రీసీతారామాంజనేయులు అర్థికసహాయం చేశారు. ఇందులో విశ్వనాథ సత్యనారాయణ గారి ఆత్మానుభూతి చాలచోట్ల వ్యక్త మవు తుంది. మచ్చుకు-

"నేనెంత నా బ్రతుకెంత! సృష్టిలో నిజము నావంటి
మానవుల్ మూడుకాలముల బుట్టుచు మడియుచునారు
కానగా సర్వదేశములయందు జగంబొక పెద్ద
సూనావణంబు శ్రీశైల మల్లికార్జున మహాలింగ

[శ్రీగిరి శతకం ప.7]

మల్లికార్జున లింగశతకం :

ఈ శతకకర్త మగటపల్లి బుచ్చిరామ కవీంద్రుడు. ఇది 1940వ సంవత్సరంలో వెలువడింది మచ్చుకు—

"నిరతమ్ము శ్రీగిరి పలుఖేచర కిన్నెర సాధ్యచారణ ముఖ్యా
మరులు నివసించెదరు నీకరుణ నపేక్షించి మల్లికార్జునలింగా
మనుజులు శ్రీశైలముపై దనరారెడి తరులఫలవితతము భక్షిం
చిన మాత్రాన ముక్తిపొందల నెరుగురు మన్నాడు మల్లికార్జున
లింగా! (మల్లికార్జునలింగ శతకం)

శ్రీశైల దేవశతకం :

ఈ శతకకర్త శ్రీమానూరు బావయ్యశర్మ. ఇది సీసపద్యశతకం రెండుపాదాల మకుటం కలిగింది. ఇతడు పరమేశ్వరునిపట్ల జాలి కన బరుస్తూ వ్రాసిన పద్యం రమణీయం

"గరళంబు మ్రింగిన కంఠమంచనిరైన
గోక్షీరములు దావ గోరుకొనవు
వ్యాఘ్రచర్మాంబర అట్టహాస మెగాని
పట్టువస్త్రములను గట్టబోవు
సర్పభూషణముల సంతసింతువుగాని
రత్నభూషణముల భ్రమను పడవు
కొండకోనలలోన నుండ వలతువు గాని
సౌధాగ్రవాస ప్రసక్తిగనవు
అకట నీలీల లెవరికి నర్థమగును
చిత్రచిత్ర ప్రభావ దాక్షిణ్యభావ
నీదు పదసేవె మోక్షము నిచ్చు త్రోవ
జాలమేలనుతోవ శ్రీశైలదేవ (శ్రీశైలదేవశతకం పద్యం 1)

**శ్రీభ్రామరీ మల్లికార్జున శతకం :**

ఈ శతకరచయిత శ్రీమొవ్వ వృషాద్రిపతి. ఇది సీసపద్యశతకం ఈ శతకంలో రెండుపాదాల మకుటం ఉంది. ఇందులో స్వామి వేష భూషణాదులు, లీలా వినోదాలు చక్కగా వర్ణితం. ఈ శతకంలోనే పరమశివునిచేత వరాలు పొందినవారు శివునికి చేసిన అకృత్యాల్ని వృషాద్రిపతిగారు జాతీయోచితంగా వర్ణించారు. మచ్చుకు—

సీ॥ వరమును బొందినవాడె మీసెత్తిని
 జేతులు పెట్ట వాంచించెగాదె॥
ఒకనికి దయవరం బొసంగి నంతనె వాడు
 నెంతయు మీచంక నెక్కగాదె॥
ఒక రక్కసుని భక్తి కుబ్బొంగి వరమీయ
 మిము వాడు గటుకున మ్రింగెగాదె॥
కరుణించి యొకనికి వరమిచ్చినంతట
 వెస మీ గృహము వాడు పీకెగాదె॥
ఆలి పార్వతినే గోరె నసురుడొకడు
ఇట్టివారల దరి చేర్చుటేమి॥ స్వామి॥
శమితపటు కాలపాశ॥ శ్రీశైలవేశ
భ్రామరీ మల్లికార్జున॥ భవ వినాశ॥ (భ్రా.మ.శ. పద్యం 8)

**మల్లికార్జున దేవశతకం :**

ఈ శతక రచయిత శ్రీపోలా వెంకటసుబ్బయ్య. ఇతడు మధుర కవి. కవిరాజహంస బిరుదాంకితుడు. కడప వాస్తవ్యులు. ఇతని "మల్లికార్జున దేవశతకాన్ని" శ్రీశైల దేవస్థానంవారు 1975లో ప్రచురించారు. ఇది కందపద్యశతకం. ఇందులో పరమశివుడు నెలకొన్న క్షేత్రాలు (3. 12 పద్యాలు), శ్రీశైలశిఖరప్రశస్తి (19పపద్యం), శ్రీశైల పరిసరాలు

(26, 27, 28, 29 పద్యాలు), స్వామిని సేవించిన రాజులు (31, 32, 34 పద్యాలు), స్వామి దివ్యానుభూతి చిత్రకల్పనలు [60వ పద్యం] ఉన్నాయి. ఉదాహరణకు ఈ శతకంలోని పద్యం—

కం॥ నిను బూజించెడి భక్తులు
ఘనపాపాత్ముల క్రియలను గారియబడగా
గనుగొనవేలః దురాత్ముల
హననము గావింపు మల్లికార్జున దేవా॥ (మ.దే.శ. ప-99)

శ్రీశైల మల్లేశ్వరశతకం :

ఈ శతకకర్త ఎవరో తెలియదు. శ్రీశైల మల్లేశ్వరా అనేపేరుతో ఉన్న తొమ్మిదిపద్యాలు తంజావూరు సరస్వతీ మహలు శరభోజీ గ్రంథాలయంలో ఉన్నవాటిని ఉద్ధరించి శ్రీ శైలప్రభ జూలై 1971 సంచికలో ప్రకటించినవారు శ్రీ అవంచ సత్యనారాయణ గారు. మచ్చుకు—

"బాలత్వంబున నీకునే వలచితిన్ పంతంబు లింటేలరా
సొలాకావగ నమ్మియుంటెగదరా జాణుండవై యేలరా
యేలీలన్ నినుబాసి నిల్వ (లేను) గదరా యీవేళ మన్నించరా
శ్రీలక్ష్మీశ్వర పూజితాంఘ్రి యుగళా శ్రీశైల మల్లేశ్వరా॥
(శ్రీ.మ.శ. పద్యం 3)

4.2 గేయ వాఙ్మయం :

గానానికి యోగ్యమయిన దానిని గేయమనడం పరిపాటి. భగవంతుని నృత్య సంగీతాదులతో అర్పించడం అనాది సంప్రదాయం అందువల్లే పూజలో పాటకు ప్రాధాన్యం ఏర్పడింది. ఈ దృష్టితో చూస్తే, శ్రీశైలస్వామిపై వ్రాయబడ్డ గేయాలు ప్రసిద్ధ గేయకారులవీ కావచ్చు. జానపదగేయాలు కావచ్చు. జానపదవరుసలలో రవులు వ్రాసినవికావచ్చు సామాన్య గేయాలు కావచ్చు.

**4.2.1** పదవాఙ్మయంలో శ్రీశైలం :

శ్రీశైలస్వామిని గురించి ప్రస్తావించినవారిలో యాగంటిపదకవులు వీరబ్రహ్మం గారు ప్రముఖులు.

యాగంటివారి పదలు³ :

వీరి వచనాల్లో ఐదింటిలో శ్రీశైలప్రసక్తి ఉంది.

**1.** పల్లవి : పొందుగ తనువనెడి అడవిలోపల పొడవైన
త్రికూటంపుగిరి కలదందు యిరవైయేనా ఆవులలరి
మేయనగు
ముందుగావచ్చిన పదుగురికి తా మొదలై పరమాత్మనాథుని
మందలో నుంచి తెచ్చిన మంత పెరుగిదిగో

చరణం : కోరికలు విడనాడి యీదధి గురుతుగా గొని అనుభవించి
సూర్యునకు సంసారునకు సంసారరోగము సులభమున
బాయు
ధీరుదగు శ్రీశైలనాథుని దివ్యతేజంబునందు గలసిన
చేరు ఐక్యతపదమునుండెడు సిద్ధముటుగాదె ॥పెరు॥

**2** పల్లవి : గురుపుపదేశం బాయగద యిక పురాకృతంబులులేదుగదా
పరాకారంబైన వెలుగునునుండె ప్రణవము తెలియని
తెరపుజూపెగదా ॥గురుపు॥

.... .... .... .... ....

చరణం : దూరము లేదిదిగో మోక్షద్వారం బిదియని తెలిసెదా
నారాయణవరమున శ్రీశైలానునాథుని కనమని కనుకన
తీర్చెను ॥గురుపు॥

3. పల్లవి : అన్నియును నీవే నీకన్న ఇతరములేదు
యున్నాళ్ళు నినుగానక భ్రమలబడితిన్ ||అన్ని||
.... .... .... ....

చరణం : నెరయ విశ్వంబెల్ల నీవేయైయుండగా
అరుదైన ఊహవరంబనగ యేది
సరిలేని శ్రీగిరీశ్వరు నిన్ను భావించి
వరుసగా పూజలెటు చేయవలెను ||అన్ని||

4. పల్లవి : యెన్ని నేర్పులుగలవు యిల్లాలు తనమునకు వన్నె
పతితో యెదిరించి పలుకనిది యిల్లాలు
పతిదేవుడని చేపట్టుడిల్లాలు
.... .... .... ....

చరణం : తనువు అస్థిరమని తాల్మిగలద్ది
తన బంధువులు మెచ్చదగిన యిల్లాలు
తనర శ్రీగిరివిభుని వలచిన దిల్లాలు
తన హృదయ మెరిగినది ధర్మయిల్లాలు ||యెన్ని||

5. పల్లవి : అదిగో తారకనూ హో వరంజ్యోతి
అదిగో తారక మంత్రలక్షం బదిగో తారకము ||అదిగో||

చరణం : రవి చంద్రానల రంగస్థలమున॥
కవి వితత కోటి విరాజితమై॥
శివలింబంగు శ్రీగిరి నిలయుడు॥
భవతారకమై ప్రభతో నున్నది॥ ||అదిగో||

వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్త్వాలు :

వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్త్వాల్లో శ్రీశైలప్రసక్తి ఉంది. కాల

జ్ఞానం అంటే భవిష్యత్ జ్ఞానం. యోగవిద్యద్వారా యోగులు భూత, భవిష్యత్తులు తెలుసుకొనేవారు. అష్టసిద్ధులను పొందేవారు. కాలజ్ఞానసిద్ధి అందులో ఒకటి. జరిగిన, జరుగుతున్న, జరుగబోయే విషయాల్ని గురించి తెలిసికొనగలిగే జ్ఞానాన్ని పొందడాన్ని కాలజ్ఞానసిద్ధి అంటారు.

కలియుగంలో జరిగిన, జరుగబోవు వైపరీత్యాలు వివిధ ప్రదేశా లలో జరిగే ఉత్పాతాలగురించి బ్రహ్మంగారు తమ తత్త్వాలలో వివరీ కరించారు. ఈ తత్త్వాలలో రెండింటిలో శ్రీశైల ప్రసక్తి ఉంది.

శ్రీశైల భ్రమరాంబికాలయమున
మొసలి చేరి రెండుదినములే యుండేనయా
ఉండి మేకవలె యరచి
మాయమై పొయ్యేని బ్రహ్మ"4 ||హరి గోవింద||

నా రాకకు ముందు నక్షత్రములు రాలు
దుష్టులెల్లదుమాయమయ్యేరయా
శ్రీశైలక్షేత్రము శిథిలమైపోవును
శ్రీశైలనాథుడు మనుజులతో మాటాడు
సూర్యుడు గడగడలాడేను నిజముగ
చుక్కలెన్నో నేలరాలేనయా.5

4.2.2 జానపదసాహిత్యంలో శ్రీశైలం :

కర్త పేరుతెలియనిది, భక్తిపారవశ్యంతో పాడినది, పర్యంపరగా ప్రజల నాలుకలలో నడయాడేదీ జానపదగేయమవుతుంది. జానపదుల్లో శ్రీశైలానికి సంబంధించిన పాటలు ఎన్నో ఉన్నాయి. వీటిని రెండు రకాలుగా వర్గీకరించవచ్చును. మొదటివర్గంలో కర్తృత్వం తెలియనివి రెండవవర్గంలో జానపదగేయవరుసలలో కవులు వ్రాసినవి చేరాతాయి

విడిలోకర్తృత్వం తెలియునిగీయాలు కొన్నింటిని ఆచార్య బి.రామరాజు గారు, డా॥ ఇ. బాలకృష్ణారెడ్డి గారు కొంతవరకు సేకరించారు. అంతే గాక శ్రీ శైలప్రభ మాసపత్రికలో ఆయా వ్యక్తులు సేకరించిన జానపద గేయాలు కూడా ఉన్నాయి.

జానపదగేయాలు :

కర్తృత్వంతెలియని పారమార్థిక గేయాలు, మేలుకొలుపు, ఆరగింపు, మంగళహారతులు, సంవాద గేయాలున్నాయి.

పారమార్థికగేయం :

"పేద్మవెలసిన మీ ప్రభావము విష్ణులోకమందునా
పల్లవించిన యింద్రలోకము బ్రహ్మలోకమునందునా
మొల్లముగ కైలాసమందున మూడులోకములందునా
చెల్లునమ్మ త్రిలోకపావని శ్రీగిరి భ్రమరాంబికా."[6]

మేలుకొలుపులు :

లభ్యమయిన గేయాలలో "అమ్మవారిని" మేలుకొలుపే పాటలే ఉన్నాయి. కాని "స్వామి మేలుకొలుపు పాటలు" లేవు.

"తెల్లవారవచ్చె ముల్లోకపావని
మొల్ల సుగంధిరో మేలుకో
తల్లిరో, శ్రీశైలమల్లేశు పట్టంపు
టిల్లాల భ్రమరాంబ మేలుకో
కుంకుమ మలయజ పంకలిప్తదేహ
హ్రీంకార రూపిణి మేలుకో
శంకరి నీవకలంకముగ లకా
టంక, ధగద్ధగిత మేలుకో."[7] ॥తెల్లవారవచ్చె॥

ఆరగింపులు :

"ఆరగింపరా ఓ శ్రీశైల మల్లేశ! ఆరగించరా!
ఆరగించు నీవు దద్ధ్యోన్నము పూశిహోర
గారెలు చారపప్పు అత్తిరసాలు వెన్నపప్పములు ॥ఆరగించరా॥
పానకము వడపప్పు నరటిపండ్లు
పనసపండ్లు, కొబ్బెర పాలూ జుంటితేనె ॥ఆరగించరా॥
సారపప్పు ముద్దా ఖర్జూరము కుసుమీసువండ్లు
తారమైన జామపళ్ళతోను వేడుకమీరా."॥ ॥ఆరగించరా॥

మంగళహారతులు :

"లింగా శైలజాత రంగా భువనజాత శృంగా
శ్రీరామలింగ మంగళం
రంగుమీర శ్రీశైల శృంగమందు భ్రమరాంబ
సంగమందు మల్లేశ లింగమంగళం"॥ ॥లింగా॥

సంవాదగేయాలు :

శ్రీశైలస్వామిమీద అల్లిన శ్రీలపాటలలో అత్తాకోడళ్ళ పాట ఒకటి ఈ పాటలో కోడలు గర్భవతి. అయితే అత్త మనుమరాలు పుట్టాలని కోరుకుంటుంది. కాని కోడలేమో పండంటికొడుకు పుడితే బాగుంటుందని అనుకుంటాది. తన కోరిక తీరడం కోసం అత్త శ్రీశైలం వెళ్ళాలని స్వామికి "మొక్కు" కోవాలని శాసిస్తుంది. వారి సంభాషణ—

అత్త : రాయే గౌరమ్మ మనం కొండకు పోయొద్దాము
మల్లన్నను సూద్దాము బిడ్డనడిగి వద్దాము ॥రాయే గౌరమ్మ॥

కోడలు : నేను రాను అత్తో ఆ కొండకు నేనడువలేను
పండంటి కొడుకు పుడితే ముందేటికిపోదాము ॥నేను రాను॥

నడువలేనని మారాంపెట్టిన కోడలితో దోరజాల కొండదాక బండిలోన పోదామని అక్కడనుండి డోలీలో కొండ చేరుకొందామని నచ్చచెప్పింది. అయినా ఐదోనెల కనుక కోడలు రానని నిక్కచ్చిగా చెప్పింది చివరకు తల్లి ప్రోద్బలంతో మల్లన్న భార్యను ప్రయాణానికి సిద్ధం చేస్తుంటాడు.

"శ్రీపర్వత మెల్లొద్దాం రాయే గౌరమ్మ మనం
మల్లన్నను తాకొద్దాం రాయే గౌరమ్మ
కాలినడక సాగిద్దాం కమ్మంగా పాడుదాం
మెట్టుకొక్క పదం పాడి మల్లన్నను తలుద్దాం ||శ్రీపర్వత||

నాగిలూటి భద్రప్పను నడక దారిలో చూద్దాం
సేయిసేయి పట్టి సల్లంగా సాగుదాం
పెద్దసెరువు నీల్లుదాగి వడలలక్కడేసేద్దాం
బొద్దుస్నేలేచి మల్ల కాలినడక సాగిద్దాం ||శ్రీపర్వత||

శ్రీపర్వతమెక్కుదాం శిఖరానికి పోదాం
విభూది గుండంలో మునిగి మునిగి పైకొద్దాం
పర్వతాల మల్లన్నకు వదిలంగా చూద్దాం
మల్లీ జన్మమొద్దంటూ మనసారా మొక్కుద్దాం ||శ్రీపర్వత||

సాక్షి గణపతికీ మనం పేరు సెప్పి మొక్కుద్దాం
జంగులు యీరభద్రన్నకు సాగిలబడి మొక్కిద్దాం
పర్వతాల మల్లన్నను ధూళిదర్శనం చేద్దాం
పండంటి కొడుకుకోరకు పదే పదే మొక్కుదాం

(శ్రీశైలప్రభ, సెప్టెంబర్ 1986)

భర్తతో సరదాగా పోవడం ఒక ప్రయోజనమయితే, కొడుకు కావాలని కోరుకోవడానికి అవకాశం దొరకడం మరొక ప్రయోజనం.

జానపదగేయ వరుసలలో కవులు వ్రాసినవి :

కర్తృత్వం ఇతమిత్థంగా తెలుసుకోవడానికి వీలులేనివి జానపద గేయాలు, కాని వరుసలకు ప్రాధాన్యం ఇస్తూ, ఆ ఛాయలోనే కొన్ని పాటలు వ్రాశారు.

డా॥ కె. ఓబిరెడ్డి గారు జానపదగేయ వరుసలలో "మల్లయ్య కొండకు పయనం" అనే గేయాన్ని వ్రాశారు.

"కొండకని బోదాం రారమ్మా మల్లయ్య కొండలో
సామినే సూద్దాం రారమ్మ
శివపురానికి పదమటంట సిద్ధులేలే మల్లయ్య కొండకు
సిన్నంగా పోదాం రారమ్మా
ఆ పర్వతాలకు మెల్లగా బోదాం రారమ్మా
మల్లెపూల కోనలోన మల్లికార్జునుడున్నాడంట
ఇష్టంతో పూజిస్తే కష్టాలు ఎడబాసె దేవుడు
సిన్నంగా పోదాం రారమ్మా
ఆ పర్వతాలకు మెల్లంగా బోదాం రారమ్మా
లోతైన కోనేరంట ఘాతమెవ్వరికి తెలియదంట
అందులోన స్నానం చేసై నిండుమోక్షం కలుగునంట
కొండపైన దేవళంబు కొండకింద మందిరంబు
మందిరంలోన వెలిగేటి మల్లికార్జునుడంట
ఘలుఘల్లుమని తేచె గదవమ్మ ఆ సదాశివుడు
ఎన్ని మాయలు గలవాడమ్మా
చుట్టు తిరిగె కొండలదిగో నట్టనడుమ దేవళం
ఒంటి స్తంభం మాలలోనే ఒక్కడే మల్లయ్య నిలిచిన
కొండకని బోదాం రారమ్మా

ఆ వత్సతాలకు పరుగునా పోదాం రారమ్మా
(శ్రీశైలప్రభ, మే 1986, పుట 49)

చెరుకూరి వీరయ్య గారు "రంగితో శ్రీశైలం" అనే పాటను వ్రాశారు.

"రంగి నా బంగారు రంగీ నోదాము రాయే శ్రీ శైలం
సేదుకో మల్లయ్య సేదుకో అందాము
అలుపు సొలుపు లేక ఆడుతూ పోదాము ॥రంగి॥
సేయి సేయి కలిపి సికరమూ కొండెక్కి
శ్రీ శైలగోపురము సిత్రంగ సూద్దాము ॥రంగి॥
ఆటకేసుడి గుళ్ళో ఆరతెలిగిద్దాము
సాక్షి గణపతి ముందు సాగిలావడదాము ॥రంగి॥
మనసులో మాటేదో మల్లయ్యకు సెబుదాము
జలమ జలమాలకీ జంటగా వుందాము ॥రంగి॥
పెవరామ్మ తల్లికి ఎయ్యిరణ్ణాలెట్టి
బుల్లోడి నియ్యపుని పూజలేసేద్దాము
కొత్త దంపతులల్లె కొంగులు ముడిపేసి
పాతాళగంగలో తానాలు సేదాము ॥రంగి॥
సివరాత్రి తిరణాల్లో సీరలె కొనిపెడత
రంగులా గాజులూ, రంగీ నీకే యిత్తా ॥రంగి॥
(శ్రీ శైలప్రభ, జనవరి, 1987 పుట22)

**4.2.3 గేయవాఙ్మయంలో శ్రీశైలం :**

భక్తిపారవశ్యంతో ఆయా కవులు పాడిన పాటలన్నీ ఈ వర్గ కరణలోకి చేరతాయి. ఈలాంటి పాటలు వ్రాసిన వారిలో యదు శ్రీకృష్ణ

దీవి రంగాచార్యులు, జి. రాము మొదలయిన వారు ప్రసిద్ధులు. వీరి పాటలన్నీ శ్రీగిరిశైలప్రభలో ప్రకటింపబడ్డాయి.

యదు శ్రీకృష్ణ వారి పాటల్లో "శ్రీమల్లికార్జునస్తవం" చాలవరకు పంటోధనాత్మకం.

"శ్రీశైలమల్లేశ్వరా! నిను సేవింతు సుగుణాకరా!
మనసార నమ్మేమురా! ఓ మహదేవ ననుకావరా!
అనయము నీపద-అర్చన చేసెద-అహిభూషణ నన్నేలుసదా
ఓ నగజాప్రియా-ఓంకారమయా నీనగుమోమును జూపుమయా
॥శ్రీశైల మల్లేశ్వరా॥
కుంజరాసుర భంజనాహర రంజనాముని భక్తజనా
వందనం బిదె అందుకోరా సుందరేశ్వరా శూలధరా
॥శ్రీశైల మల్లేశ్వరా॥
నటన జనావన నిటల నయన నటరాజ ఓనిఖిలేశా
వాటముగ ఇలనామదేవ నీపాటరా వ్రాయుచు పాడెమురా
॥శ్రీశైల మల్లేశ్వరా॥
శ్రీశైలప్రభ, ఏప్రిల్ 1974, పుట 18)

శ్రీదీవి రంగాచార్యులు వ్రాసిన "శ్రీశైలవాసా! శంకరా! అనే పాట శ్రీశైలప్రభలో ముద్రితం.

"శ్రీశైలవాసా! శంకరా!
చల్లగ కాచే సర్వేశ్వరా!
కావగారావా మల్లేశ్వరా!
కరుణతో వేగ పరమేశ్వరా! ॥శ్రీశైలవాసా॥

మూలాకైంకర్య విశేషం
మల్లికార్జున నాహార్చనం

శ్రీ భ్రమరాంబికాదేవి సహితం
భక్తుల యెడల సేవాంకితం ||శ్రీశైలవాసా||
(శ్రీశైలప్రభ, ఆగష్టు 1982, పుట114)

ఈ పాట పూర్వార్థంలో తెలుగుపదాలు, ఉత్తరార్థంలో సంస్కృత సమాసాలున్నాయి.

శ్రీ జి. రాము గారు సంగీతవిద్యానిష్ణాతులు. నిరంతరం శ్రీశైల స్వామి కీర్తనలలో ఆనందానుభూతి పొందే భక్తులు. వారు తమ పాట లన్నిటికీ రాగతాళ నిర్దేశం చేశారు. వాటిలో మచ్చుకు ఒకటి.

షణ్ముఖ ప్రియరాగం-ఆదితాళం

"శరణు! శరణోయన్న! శ్రీశైలమల్లన్న
చల్లగా చూడమ్మా! తల్లీ! మా భ్రమరాంబికా ||శరణు||
రామచంద్రాపూతము
కాలకృష్ణాదతము
కోరి నిను కొలిచేము
దరిజేర్పగ దమ్మ ||శరణు||
(శ్రీశైలప్రభ, ఫిబ్రవరి 1978 పుట 18)

ఇవేగాక శ్రీశైలాన్ని, మల్లికార్జునస్వామి మాహాత్మ్యాన్ని ప్రకటించే పాటలు సినిమాలలో కూడా చోటు చేసుకొన్నాయి. వాటిలో మల్లమ్మకథ ఉండమ్మ బొట్టుపెడతా, కృష్ణవేణి చిత్రాలలోని పాటలు జనమోదాన్ని పొందాయి.

మల్లమ్మ కథ సినిమాపాటలు :

1 భవహరణా శుభచరణా
నాథాభరణ గౌరీరమణా ||భవ||

2 ఈశా మహేశా అమ్మను ఒకసారి చూపరాదా!
అమ్మని నీపైనా చెప్పరాదా
పావను నాపైనా జాలిలేదా ||ఈశా మహేశా||

3 కానరావా దేవ దేవ దీనజనపోషా
శరణు నీవే అభయమీవే
పాహి మల్లేశ! శ్రీశైల మల్లేశా! ||కానరావా||

4 అంతా శివమయమే కాదా
ఈ శివలీలలను వినరాదా
ఆ శివజ్యోతినే కనరాదా ||అంతా||

చందమ్మ బొట్టుపెడతా సినిమాపాటలు :

శ్రీశైల మల్లన్న శిరసొంచెనా
చేలంతా గంగమ్మరానా
తిరుమలపై వెంకన్న కనువిప్పేనా
కరుణించు ఎండా వెన్నెలైనా ||శ్రీశైల||

కృష్ణవేణి సినిమాపాట :

శ్రీశైలా మల్లయ్యా! దైవమే నీవయ్యా!
శ్రీభ్రమరాంబతో వెలసిన జంగమయ్యా! ||శ్రీశైల||

ఇవేగాకుండా శ్రీశైల దేవస్థానంవారుశ్రీశైలక్షేత్రంపై ఒక డాక్యుమెంటరీని 1961వ సంవత్సరంలో తీశారు. హైదరాబాదు దూరదర్శిని కేంద్రంలో శ్రీశైలం గురించి 26-2-1987వ తేదీ రాత్రి శివరాత్రిపర్వదినంనాడు ఒక డాక్యుమెంటరీ ప్రసారం చేశారు.

తరువాతి ప్రకరణం శ్రీపర్వతపుకాణ పరిశీలన.

కం॥ హరునకు నతశత మఖముఖ
సురవరివృథ మకుటఘటితశుభ మాణిక్య
స్ఫురిత పదకమలునకు గణ
వరునకు శ్రీలింగ చక్రవర్తికి జేజే (అ 2—వ 95)

సంఖ్యా సూచిక

. శ్రీశైలీయం (నాటకం) విజ్ఞప్తి పుట 2
2. వీర శైవాంధ్రవాఙ్మయం, పుట 6
3. జనార్దనం, కె. సేకరించిన యాగంటి పదాల ప్రతులు
4. కోతూలూరి బ్రహ్మేంద్రం, కాలజ్ఞానం పుట 15
5. శ్రీవీరబ్రహ్మం గారి వేదవాక్యములు, కలియుగ వడవడి పుట 8
6. జానపద గేయ సాహిత్యం, పుట 393
7. ఆర్. 2585; శైవకీర్తనలు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్య పరిశోధనా సంస్థ, తిరుపతి.
8. కాలకృష్ణారెడ్డి, ఇ. సేకరించిన అరగింపు పాట
9. డి. 2585, శైవకీర్తనలు, శ్రీ. వేం. వి. ప్రాచ్య పరిశోధనాసంస్థ



# 5. శ్రీపర్వతపురాణ పరిశీలన

శ్రీశైలక్షేత్రానికి సంబంధించిన మొట్టమొదటిపురాణం శ్రీపర్వత పురాణం. శ్రీపర్వతపురాణ పరిశీలనకు ముందు శ్రీ పర్వతపురాణం ఆకరాలు పరిశీలించడం సమంజసం.

## 5.1 శ్రీపర్వతపురాణం—ఆకరాలు :

నాగలూటి శేషనాథార్యకవి వ్రాసిన శ్రీపర్వతపురాణానికి మూలం ఏది అనడంలో రెండు అభిప్రాయభేదాలున్నాయి. మొదటిది స్కాంద పురాణమే మూలమనడం. రెండవది పండితారాధ్యచరిత్రలోని పర్వత ప్రకరణం మూలమనడం.

### సంస్కృత స్కాందపురాణం :

పురాణాలలో క్షేత్రమాహాత్మ్యలకు అత్యధిక ప్రాధాన్యం ఇచ్చిన పురాణం స్కాందం. శ్రీనాథుడు "పంచాశత్ ఖండమండితంబైన" అని 50 ఖండాలు స్కాందంలో ఉన్నాయని చెప్పాడు. కాని

50 ఖండాలు పూర్తిగా ఉన్న స్కాందం ఇంతవరకు దొరకలేదు. ఎన్నో పురాణాలను అందంగా నిర్దుష్టంగా ప్రయాసపడి ప్రచురించిన క్షేమరాజ కృష్ణదాస, శ్రీవేంకటేశ్వర స్టీమ్‌ప్రెస్ బొంబాయి వారి స్కాందంలో కూడా శ్రీశైల ఖండం లేదు. కాని మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో శ్రీశైల ఖండం పేరుతో తెలుగులిపిలో వ్రాసిన నాలుగు ప్రతులున్నాయి. వీటిలో డి. 15605 అనే వ్రాతప్రతి మాత్రం చదువ డానికి వీలుగా ఉంది. మిగిలిన ప్రతులు క్రిమిదష్టాలు. చదవడానికి వీలుకానివి.

సంస్కృత నాగరలిపిలో శ్రీశైల ఖండం లేకపోవడానికి, తెలుగు లిపిలోని స్కాందంలో శ్రీశైల ఖండం కనిపించడానికి ప్రధాన కారణం శ్రీశైలం దక్షిణదేశంలో తెలుగునాట ఉండడం. పైగా ఔత్తరాహులకు అంతగా పరిచయం కాని క్షేత్రం కూడా కారణం కావచ్చు.

తెలుగు కవికి సంస్కృత స్కాందం పరిచయమయినట్లు
"పరమ స్కందపురాణ సంహితలలో బంచాదశాఖ్యానమున్
వరుసన్ జూచుచు నందు శ్రీగిరి మహత్వం బైహికాముష్మిక
స్ఫురణానందకరంబు భవ్యమనుచున్ బుణ్యప్రబంధంబుగా
విరచింతున్ బదబంధబంధుర కళావిర్భావ వాగ్వైఖరిన్
(శ్రీ.ప పు. ఆ 1-ప 45)

అనే పద్యం సాక్ష్యం. పైగా శేషనాథార్యకవి శ్రీశైల ఖండంలో ముప్పైరెండు అధ్యాయాలున్నాయని, శ్లోకాలను లెక్కపేస్తే 12,500 ఉన్నాయని స్పష్టంచేశాడు. ఇంచుమించు ఈసంఖ్య మదరాసు ప్రతితో సరిపోతుంది. అయితే సంస్కృత స్కాందంలోని పూర్వభాగం ఉత్తర భాగం అనే నిర్దేశం శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో ఎక్కడా కనిపించదు.

పూర్వభాగంలో భ్రమరాంబికోపాఖ్యానం, అసురాసుర ఉపాఖ్యానం, పార్వతీ ప్రశ్న నిరూపణం అరుణాసుర తపోవర్ణన, అరుణాసుర దిగ్విజయం, మహిషాసుర సంవాదం అనే ఉపాఖ్యానాలున్నాయి ఒక్క భ్రమరాంబికోపాఖ్యానం తప్ప మిగిలినవన్నీ సాక్షాత్తుగా శ్రీశైల మాహాత్మ్యానికి అతకని అంశాలు. అందువల్ల కవి పూర్వ ఉత్తరవిభాగాలను వదిలిపెట్టి ఒకే విభాగంగా పురాణానిన్ని తీర్చిదిద్దాడు.

పండితారాధ్య చరిత్ర-పర్వత ప్రకరణం :

తెలుగుసాహిత్య సమీక్ష సంతరించిన ఆచార్య జి. నాగయ్య గారు, నాగలూటి శేషనాథార్యకవి శ్రీపర్వత పురాణానికి పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణం మూలమని భావించారు.

పాల్కురికి సోమనాథుడు వ్రాసిన ప్రసిద్ధ కావ్యాలలో పండితారాధ్య చరిత్ర ఒకటి. పండితారాధ్యచరిత్ర ఐదు ప్రకరణాల గ్రంథం. పర్వత ప్రకరణంలో శ్రీశైలం సూక్ష్మ సూక్ష్మాంశాలతో వర్ణించబడింది.

నాగలూటి శేషనాథార్యకవి తన గ్రంథానికి స్కాందంమూలమని స్పష్టంగా నిర్దేశించడంవల్ల (ఆ 1-ప 45) పండితారాధ్య చరిత్ర మూలమనడానికి వీలులేదు. పైగా కవి సోమనాథుని పండితారాధ్యచరిత్రను కావ్యావతారికలో ప్రస్తావించలేదు. కారణం వారు వీరశైవులవడం. శేషనాథార్యకవి సామాన్య శైవుడు కావచ్చు అయినా పండితారాధ్యచరిత్ర చదివి వుండవచ్చు. అందువల్ల స్కాందం-పండితారాధ్య చరిత్ర రెండూ కూడా నాగలూటి శేషనాథార్యకవికి ఆధార గ్రంథాలుగా భావించడంలో తప్పేమీలేదు.

5 1.1 సంస్కృత స్కాందం-శ్రీపర్వత పురాణం :

**సంస్కృత స్కాందం శ్రీ శైలఖండ ప్రారంభం.**

"ఇతః పరః ప్రవక్ష్యామి శ్రుణు గౌరి గుణోన్నతే
తీర్థం సర్వోత్తమం దివ్యం అవ్యయం ఫలదాయకం
తస్యాశ్రీశ్ర భ్రమరాంబాయాః కరణాలంబనాత్మనః
ఈశానాది శివాఖ్యాతం సేవితం మునిభిస్సరైః
దేవస్య చోత్తరే భాగే మల్లికాకుండ సంజ్ఞితం"

అని మొదలవుతుంది. కాని తెలుగు శ్రీపర్వతపురాణం ప్రారంభం "అంకితంబుగా నా రొనర్చంబూనిన శ్రీశైల మాహాత్మ్యంబునకు గదా క్రమం బెట్టిదనిన" (అ 1-ప 44) అని మొదలవుతుంది. అలాగే అధ్యాయాంతంలో "ఇతి శ్రీస్కాందే మహాపురాణే సనత్కుమార సంహితాయాం శ్రీశైలఖండే ఉమామహేశ్వర సంవాదే ఉత్తరభాగే" అని పూర్తవవుతుంది. ఈ భాగం శ్రీపర్వత పురాణంలో "సనత్కుమారుని వద్దకు వేదవ్యాసుండు వచ్చుట, శ్రీపర్వత క్షేత్రంబు తత్ప్రష్టమని సనత్కుమారుండు చెప్పుట అనే శీర్షికలతో ఉన్నాయి.

ఉత్తరభాగంలో మల్లికార్జునకుండాది తీర్థప్రశంస కథనం, జాల ప్రహ్లాదాది తీర్థచతుష్టయం, ఫల కథనం, నీలహ్రద తీర్థకథనం, లక్ష్మీ ప్రాదుర్భావం, తీర్థ ఏకాదశ కథనం, వజ్రశృంగాది శృంగత్రయ ప్రసంగం, నందిమండల వర్ణన కథనం, శ్రీశిలాద కథనం, మహానంది పూజా ప్రకరణం, అహోబిల మాహాత్మ్యం, సిద్ధవట మాహాత్మ్యం, సాలంకాయన మాహాత్మ్యం, బ్రహ్మ ఈశ్వరమాహాత్మ్యం, శివపురప్రభావ కథనం, మాహేశ్వరమాహాత్మ్యం, త్రిపురాంతక మాహాత్మ్యం, నివృత్తి సంగమేశ్వర మాహాత్మ్య (తీర్థమాహాత్మ్యకథనం) బిల్వవనే లక్ష్మీనివాస స్వరూపవ కథనం, నివృత్తి సంగమేశ్వరమాహాత్మ్యే బ్రహ్మవరప్రాప్తి కథనం, నివృత్తి సంగమేశ్వరమాహాత్మ్యే తీర్థమాహాత్మ్య కథనం,

పార్వతీ పరిణయ కథనం, బిల్వవనే తీర్థనద్యాది కథనం అనే ఉపా ఖ్యానాలున్నాయి.

శ్రీపర్వతపురాణంలో ప్రథమాశ్వాసంలో గ్రంథ ప్రశంస, కవితా ప్రశంస, కృతిపతివర్ణనము, షష్ఠ్యంతములు, కథాసంగ్రహము, సనత్కుమారుని వద్దకు వేదవ్యాసుండు వచ్చుట, వ్యాసుండు సనత్కుమారు బుణ్యక్షేత్రంబుల దెల్పుమని యడుగుట, శ్రీపర్వతక్షేత్రం బుత్కృష్ట మని సనత్కుమారుడు జెప్పుట, ద్వితీయాశ్వాసంలో శ్రీశైలంబునంగల మాహాత్మ్యంబులు దెల్పుట, కైలాసంబున నీశ్వరుడు కొలువు దీరియుండుట, శ్రీనగంబున శివుడునిల్చు కారణంబును పార్వతి యడుగుట శిలాదమౌని తపంబుచేయుట, శిలాదునకు నీశ్వరుండు ప్రత్యక్షంబగుట శిలాదుడభవుని మెప్పించి పర్వతనందీశ్వరుల బుత్రులుగా బడయుట నందీశ్వరుడు హరునిగూర్చి తపంబుచేయుట, ప్రత్యక్షంబైన ఈశ్వరుని నందీశ్వరుడు స్తుతింగుట, శివుండు నందీశ్వరుని వాహనంబుగాగొనుట పర్వరుండత్యుగ్ర తపంబు సల్పుట, మహాదేవుండు పర్వతుని భక్తికి మెచ్చి యతని యందావిర్భవించుట, హరి బ్రహ్మాదులు పర్వతలింగం బును బరివేష్టించి కొలచుట, బ్రహ్మాదులు పర్వతుని శ్లాఘించుట, తృతీయాశ్వాసంలో పర్వత శిఖరాష్టక, తత్తీర్థ, తన్నామ, తత్ఫలాదులం దెల్పుట, కార్తికమాసంబునందు శ్రీగిరికి జనిన గలుగు ఫలములు, శ్రీపర్వతలింగమునకు నుపచారములు సేయువారికి గలుగు ఫలములు శ్రీశైలతీర్థమాహాత్మ్యంబులు సనత్కుమారుండు కృష్ణద్వైపాయనునకు దెల్పుట, సర్వేశ పుష్కరనదుల మహిమ, శ్రీగిరిచతుర్ద్వారనిర్ణయము అందలి దేవతా తీర్థముల మహిమము. చతుర్థాశ్వాసంలో చంద్రవతి పర్వతేశ్వరుని బ్రస్తుతించుట, వసంతర్తు వర్ణనము, చంద్రవతీ కన్య సఖులుం దామను శివపూజార్థము పూలు గోయుట, చంద్రవతి తీర్థం

ములు దర్శించుము వానిం బ్రశంసించుట, చంద్రవతి పర్వతలింగంబు
బూజించుట, చంద్రవతి పర్వతేశ్వరుని స్తుతించుట, చంద్రవతి పర్వ
తేశ్వరుని యెదుట గానము చేయుట, చంద్రవతికి పర్వతేశ్వరుడు
ప్రత్యక్షమగుట, చంద్రవతి ప్రార్థంబున పరతేశ్వరుడు మల్లికార్జున
లింగనామంబు దాల్చుట, పంచమాశ్వాసంలో శ్రీపర్వతంనందలివిూడు
వృక్షంబుల మహిమ సభివర్ణించుట, సాధకుండ భైరవుదిం జూచుట,
సాధకండు తపస్విని జూచుట, సాధకునకు తపస్వి బిల వృత్తాంతం
బులం జెప్పుట, కరవీర వన ప్రశంస, ఈశ్వరుని కరవీరుడు స్తుతిం
చుట, తృణబిందు సరోవర ప్రశంస, శంకరి పట్టణనామ ప్రశంస,
వృషభ బిల వృత్తాంతము, శాకవృక్ష ప్రశంస, బాలబిల ప్రశంస,
శివరబిల ప్రశంస, భైరవబిల ప్రశంస, షష్ఠాశ్వాసంలో చేళికాబిల
వృత్తాంతము, కదళీవన ప్రశంస, ప్రమధ కదళీవన వృత్తాంతము,
పద్మవతీబిల ప్రశంసలున్నాయి.

విముక్త కథాంశాలు :

విముక్త కథాంశాలు రెండు రకాలు సంస్కృత స్కాందంలో,
మొంది, శ్రీపర్వత పురాణంలో తేని కథాంశాలు మొదటి వర్గంలో
చేరతాయి.

కాలహ్రదాది తీర్థ చతుష్టయ ఫలకథనం, లక్ష్మీప్రాదుర్భావం
తీర్థ ఏకాదశ కథనం, నందిమండల వర్ణన, అహోబిలమాహాత్మ్యం,
సిద్ధవట మాహాత్మ్యం, సాలంకాయన మాహాత్మ్యం, బ్రహ్మ ఈశ్వర
మాహాత్మ్యం, శివపుర ప్రభావకథనం, త్రిపురాంతక మాహాత్మ్యం,
నివృత్తి సంగమేశ్వర మాహాత్మ్యం, బిల్వవనంలో లక్ష్మీనివాస
స్వరూప నిరూపణం, నివృత్తి సంగమేశ్వరమాహాత్మ్యంలోని బ్రహ్మ

వరప్రాప్తి కథనం, నివృత్తి సంగమేశ్వర తీర్థమాహాత్మ్యాలు, పార్వతీ వరిణయం మొదలయిన కథాంశాలు తెలుగు శ్రీపర్వత పురాణంలో లేవు.

విశేషాంశాలు :

మొదటిది లక్ష్మీ ప్రాదుర్భావం, అహోబిలమాహాత్మ్యం రెండూ రెండూ వైష్ణవానికి సంబంధించినవి కావడం. కేవలం శ్రీశైలాన్ని గూర్చి మాత్రమే వ్రాయడంవల్ల వీటిని వదలడం తప్పేమీ కాదు.

రెండవది శ్రీపర్వత పురాణానికి ప్రాధాన్యం ఇవ్వడంవల్ల సంగమేశ్వరం, త్రిపురాంతకం, సిద్ధవటం వదిలిపెట్టాడు.

మూడవది మిగిలిన తీర్థాలు శ్రీశైలానికి సుదూరంగా ఉండడం వల్ల వాటిని వదలిపెట్టాడు.

అదృశ్యాంశాలు :

అదృశ్యాంశాలలో శ్రీపర్వతపురాణంలో వుండి సంస్కృతస్కాందంలో లేని కథాంశాలు పేర్కొనదగినవి.

సాధకుడు మోహినియును గజంబును జూచుట, సాధకుడు భైరవుని జూచుట, సాధకుండు తపస్విని జూచుట, సాధకునికి తపస్వి బలవృత్తాంతంబులం జెప్పుట, కరవీరవన ప్రశంస, ఈశ్వరుని కరవీరుడు స్తుతించుట, తృణబిందు సరోవర ప్రశంస, వృషభబిల వృత్తాంతము, తాళవృక్ష ప్రశంస, బాలబిలప్రశంస, ఖేచరబిలప్రశంస, భైరవబిలప్రశంస, చేటికాబిల వృత్తాంతం, పద్మవతీబిల ప్రశంస మొదలయిన కథాంశాలు సంస్కృత స్కాందపురాణంలో లేవు.

సామ్య కథాంశాలు :

మల్లికార్జునకుండాది తీర్థప్రశస్తి కథనం, చంద్రవత్యుపాఖ్యానం, మల్లికార్జునరూపప్రాప్తి కథనం, శృంగత్రయ ప్రసంగం, శ్రీశిలాద ప్రకరణం, మాహేశ్వర మాహాత్మ్యం, బిల్వవన తీర్థనద్యాది కథనం, సంస్కృత స్కాందంలోను, శ్రీపర్వతపురాణంలోను సమానంగా ఉన్నాయి.

సంస్కృతస్కాంద పురాణంలో కథకు ప్రాధాన్యం ఇస్తే శ్రీపర్వత పురాణంలో వర్ణనకు ప్రాధాన్యం ఇచ్చాడు.

## 5.2 శ్రీపర్వతపురాణం—ప్రతులు :

శ్రీపర్వతపురాణం ప్రతులు ఏడున్నాయి. ఈ ప్రతులు రెండురకాలు తాళపత్రప్రతులు, వ్రాతపతులు. ఇవి ప్రస్తుతం మదరాసు, తిరుపతి ప్రాచ్యలిఖిత పరిశోధనా గ్రంథాలయాలలో ఉన్నాయి.

### 5.2.1 మదరాసు ప్రతులు :

మదరాసు ప్రాచ్య పరిశోధనా గ్రంథాలయంలో డి. 363 తాళపత్రప్రతులు రెండున్నూ, డి. 360 కాగితపు ప్రతులు రెండున్నూ ఉన్నాయి.[1] శ్రీపర్వతపురాణాన్ని మొట్టమొదట బ్రౌన్ సేకరించాడు. వాటిలో డి 363 నంబరు కలిగిన శ్రీపర్వత పురాణాన్ని వారాణాశి రామస్వామి, కొర్రపాటి చిన్నయ్య "మొకాబిలా" చేసినారు.[2] తాళపత్ర ప్రతుల్ని క్షుణ్ణంగా పరిశీలించి నిర్దుష్టప్రతిని తయారుచేయడం మొకబిలా అవుతుంది.

బ్రౌన్‌కు శ్రీపర్వతపురాణంపై అంత మంచి అభిప్రాయం లేదు. తన ఉపోద్ఘాతంలో శ్రీపర్వత పురాణాన్ని గురించి—

This Volume contains two tales translated from the Schanda

puranam, probably that part called Sreesailakhandam, through this is not named. It is a silly, stupid book, utterly, worthless, yet written by a man of learning and in a good style of poetry The name of it is Sriparvatapuranam.

This poem the parvatapuranam is written in classical and learned style, but the story is parcel of odds and ends. In the fourth canto a new tale commences regarding a farher who is in love with his own daughter అని తెలియజేశాడు. ఇది క్రీ.శ. 1888వ సంవత్సరం చెన్నపురిలో శైవసిద్ధాంత ముద్రాక్షరశాలలో ముద్రించబడింది.

5 2.2 తిరుపతి ప్రతులు :

తిరుపతి ప్రాచ్యలిఖిత పరిశోధనా గ్రంథాలయంలో మూడు తాటాకు ప్రతులున్నాయి. (PLD 361, PLD 362, PLR 39) ప్రతుల వివరాలు క్యాటలాగులో ఈ క్రింది విధంగా ఉన్నాయి. అయితే డి. 361, డి. 362 నంబరున్న తాళపత్రప్రతులే కనిపిస్తున్నాయి.

PLD 361 :

ఈ ప్రతి పొడవు $14\frac{5}{8}$ అంగుళాలు. వెడల్పు $1\frac{1}{4}$ అంగుళాలు. ప్రతుల సంఖ్య 229 ప్రతిలో 6 వరుసలున్నాయి. ప్రతి కొంత పాతబడింది. తప్పులులేవు. ప్రతి నిర్దుష్టంగా ఉంది. శైథిల్యం కొంత ఉంది గ్రంథాంతంలో ఈ విధంగా ఉంది.

"ధాత సంవత్సర చైత్ర బ2 మ॥ సర్కి శ్రీపర్వత పురాణం పూర్వ ప్రతిక్రమాన మీదులపల్లి భవాని వ్రాసెను."

PLD 362 .

ఈ ప్రతి పొడవు $13\frac{1}{2}$ అంగుళాలు. వెడల్పు $1\frac{1}{4}$ అంగుళాలు.

ప్రతులసంఖ్య 208. ప్రతిలో 6 పరుసలున్నాయి. ప్రతి బాగుంది సంపూర్ణంగా ఉంది. వ్రాత చక్కగా ఉంది. తప్పులు లేవు. శైథిల్యం లేదు. గ్రంథాంతంలో ఈవిధంగా ఉంది.

నందన సంవత్సర మార్గశిర బ౹౹ ౨ శ౹౹ నరిక్కి యాదులపల్లి భవాని గారి ప్రతినున్న క్రమనాను శ్రీపర్వత పురాణం నందూరి కామయ్య సంపూర్ణంగా వ్రాసెను.

5.2.3 ముద్రితప్రతుల వివరాలు :

శ్రీపర్వత పురాణం మొట్టమొదట ఎపుడు ముద్రింపబడిందో తెలియదు. నాకు లభ్యమయిన శ్రీపర్వత పురాణం ముద్రితప్రతి 1970వ సంవత్సరం నాటిది. ఈ పుస్తకాన్ని గుంటూరు జూపిటర్ బుక్‌హౌస్ ముద్రించారు ఈ పుస్తకానికి విజ్ఞాపనం అనే పేరుతో రెండు పేజీల పీఠిక ఉంది. కాని ఈపుస్తకాన్ని సప్రమాణంగా పరిష్కరించినటువంటి వివరాలు ఏ మాత్రం తెలియవు. సంప్రదించిన వ్రాతప్రతుల వివరాలు కూడా కనిపించవు. అయితే ఈ విజ్ఞాపనంలోని "శ్రీపర్వత పురాణమింత కాలము అముద్రితమైయుండుటచే మేము దీనిని భక్తిశ్రద్ధలతో ముద్రించి ఆంధ్రజనులకరకమలము లందుంచుచున్నాము."అనిఅనడం వల్ల ఇదే తొలి ముద్రిత ప్రతిగా ఊహించవలసి ఉంది.

5.2.4 తాళపత్ర వ్రాతప్రతుల తులనాత్మక పరిశీలన :

తాళపత్ర, వ్రాతప్రతులకు-ముద్రిత ప్రతికి కొన్ని విభేదాలు కనిపిస్తాయి. వీటిని రెండు రకాలుగా వర్గీకరించవచ్చును.

ముద్రితప్రతిలో లేనివి :

PLD 361 :

శా. చెతః భక్తికయుండు నిల్పిక కలంకెహుళి శాస్త్రోదక

ఖ్యాతం బక్షరమూర్తి ప్రౌక్తి కము లై పర్థిల్లుండున్ సత్ప్రభు
షోతో గుణప్రయుక్తి పదలంకారంగ హారాశి గా
విలిన్ సత్కవిగూర్చ సేద్పునే బుధశ్రేణి గకాగ్రంబునన్

ఈ పద్యం ముద్రిత గ్రంథం. ప్రథమాశ్వాసంలో 34–35పద్యాల మధ్యన ఉండాలి. వ్రాతప్రతిలోని పద్యము–

సీ॥ శ్రీశైల శిఖరాగ్ర సింహాసనాసీన యని
సంస్కృతమున నభినుతింతు
పుత్కెల్ల విక్రమదర్పరావ హాయని
ప్రస్తుతింతు నిను ప్రాకృతమున
దప్పక తిరగర్వ తను సర్పవరాయని
(శౌరసేని) సూరసేని నిన్నభినుతింతు
బరిహాడి హట్టము పొకెల్ల సహాయని
పైశాచకంబున బ్రణుతింతు
మణ్యని మానసయని మాగదమున
సర్పభూషణయని మహాంబ్రరమున
భవవినిర్వాణయని యాంధ్రభావమునను
ప్రణుతి చేయుదు భావింతు పర్వతశ్రేణి

ఈ పద్యం ముద్రిత గ్రంథంలో చతుర్థాశ్వాసంలో 99–100 పద్యాల మధ్యన ఉండాలి.

ముద్రిత ప్రతిలో చివరి ఆశ్వాసంలో (గ్రంథాంతంలో) 119 పద్యాలుండగా, వ్రాతప్రతుల్లో ఇంకా మూడుపద్యాలు కనిపిస్తున్నాయి

మ॥ శిరి శైలంబునం బర్వతేశుని యుత్రసించు పుణ్యాత్ములన్
గరిద్రికక్ర కర్షరణ గోకర్ణ ప్రబల ఖోదరో

దరమోరం బృకుమార శృంగగిరిపై నిష్కంపొప్పదర్శనందికే
శ్వరుని జూచు శ్రయంబున్ గనుగొను సర్వేశ్వరుడున్నతిన్

కం॥ అహమహమికావి శంకరయో
బహుదోష పునర్భ విప్రవంచ సమంచ్ఛ
గ్గహనస్థల దిగ్భ్రమగతి
విహరింపరు శ్రీనగ ప్రవేశధురీణు

కం॥ శిరి శైలంబున నియతిం
జనియించు విశిష్ట పుణ్యచారిత్రులకున్
కలతలమున నిరుపాధిక
నిరుపమ కైవల్యలక్ష్మి నెలకొనియుండన్

PLD 362 :

శా॥ చేతః శుక్తి తయుండు నిల్పకకలంచెతూలి శాస్త్రోదక
వ్రాతం బక్షరమూర్తి మౌక్తికములై వర్ధిల్లుండన్ సత్ప్రభు
ణితోగుణప్రయుక్తిసదలంకారంగ హారాశిగా
లితిన్ సత్కవి గూర్చ నెల్పును బుధశ్రేణీ గళాగ్రంబునన్

ఈ పద్యం ముద్రిత గ్రంథం ప్రథమాశ్వాసంలో 34–35 పద్యాల మధ్యన ఉండాలి.

కం॥ హాటక భూభృచ్ఛయములను
హాటక దీర్ఘికలు నదులు
హాటక తరులును
హాటక బని భృచ్ఛయములను

ఈపద్యం ముద్రిత గ్రంథం ప్రథమాశ్వాసంలో 70-71 పద్యాల మధ్యన ఉండాలి.

సీ॥ శ్రీశైల శిఖరాగ్ర సింహాసనయుని
సంస్కృతంబున నభినుతంతు
పుక్కెల్ల విక్రమర్పితావ హయుని
ప్రస్తుతింతు నిన్ను ప్రాకృతమున
దప్పక తిరగర్వ తమ సర్వవరయుని
సూరసేని నిన్నభినుతింతు
బరిహాణిహణ్ణము పొకెల్ల సహాయుని
పైశాచికంబున బ్రణుతింతు
మణ్యని మానసయుని మాగదమున
సర్వభూషణ్ణయుని మహాంబ్బరమున
భవవినిర్వాణ యని యంధ్రభావమునను
బ్రణుతి చేయుదు భావింతు పర్వతేశా

ఈ పద్యం ముద్రిత గ్రంథం చతుర్థాశ్వాసంలో 99-100పద్యాల మధ్యన ఉండాలి.

| డి 361 తాళపత్రప్రతి | | ముద్రిత గ్రంథం |
|---|---|---|
| డి 361 తరు | — | తరు (అ 2-ప 10) |
| డి 362 తట | | |
| డి 361 ఇందుకిరణములు | — | ఇందుకిరణములు (అ2-ప23) |
| డి 362 చందసుయూకములు | | |
| డి 361 దిలకంబు | — | దిలకంబు (అ 2- ప 61) |
| డి 3 2 బంగారు | | |
| డి 361 నాగావస్వరముని | — | నాగావ్వరముని (అ 2-ప107) |
| డి 362 నాగామరము | | |
| డి 361 వివిధగతుల | — | వివిధగతుల (అ 2-వ 111) |

డి 361 విమల — విమల (అ2-వ 120)
డి 362 విపుల

డి 361 సేవక — సేవక (అ 3-వ 7)
డి 362 సేవిత

డి 361 వేష్టిత — వేష్టిత (అ 3-వ 41)
డి 362 వేషణ

డి 361 దివ్య — దివ్య (అ 3-వ 51)
డి 362 దిత్య

డి 361 ద్రువాపికూపి — ద్రువాపికూపి (అ 3-వ 92)
డి 362 ద్రువాడుకూడ

డి 361 పొందును — పొందును (అ 3-వ 108)
డి 362 చెందును

డి 361 తియ్యవిల్తుని — తియ్యవిల్తుని )అ4-వ41)
డి 362 చితజన్ముని

డి 361 అలికాంక్ష — అలికాంక్ష (అ 5-వ 39)
డి 362 అలవృక్ష

డి 361 అవ్వాడు — అవ్వాడు (అ 5-వ 53)
డి 362 చవ్వాడు

డి 361 నిజభక్తి — నిజభ_క్తి (అ 6-వ 77)
డి 362 యుద్ధండ

డి 361 సంతోషతమ — సంతోషతను (అ 6-వ 77)
డి 362 కైవల్యతను

డి 361 జవత్వా — జవత్వా (అ 6-వ 73)
డి 362 వశిత్వో

డి 361 కొంతవాగు — కొంతవాగు (అ-వ 89)
డి 362 కొంతవెగ

| | | | |
|---|---|---|---|
| డి 361 | స్థలాకగెూ | — | స్థలాకయెూ (ఆ6 - ప 89) |
| డి 362 | శలకమెూ | | |
| డి 361 | రాజానురూపయెూ | — | రాజానురూపయెూ (ఆ6 - 89) |
| డి 362 | రాజస్వరూపయెూ | | |
| డి 361 | దోర్బలయుక్తుల్ | — | దోర్బలయుక్తుల్ (ఆ6-ప99) |
| డి 362 | తొమ్మండ్రుమునుల్ | | |
| డి 361 | అతడు | — | అతడు (ఆ6 - ప 107) |
| డి 362 | జనుడు | | |
| డి 361 | శిరసాగ్రంబున | — | శిరసాగ్రంబున (ఆ6-ప110) |
| డి 362 | శిరిశైలంబునను | | |
| డి 361 | లింగానుతేజా | — | లింగానుతేజా (ఆ6 - ప 118) |
| డి 362 | విజ్ఞానతేజా | | |
| డి 362 | తాళపత్రప్రతి | | ముద్రిత గ్రంథం |
| డి 362 | సర్వేశునఘునివర్తి | — | సర్వేశునఘునివర్తి )ఆ1-ప34) |
| డి 361 | సకలకళ్యాణమూర్తికి | | |
| డి 362 | తుష్టియొనర్చి నమ్ము | — | తుష్టియొనర్చి నమ్ము (ఆ2 - ప 50) |
| డి 361 | దృష్టి ననుగ్రహించి | | |
| డి 362 | స్త్రీ | — | స్త్రీ (ఆ3 - ప 93) |
| డి 361 | సతి | | |

శ్రీపర్వత పురాణాన్ని పరిష్కరించిన వ్యక్తి D 361, 362 నంబరు గల ప్రతుల్నే చూశాడని స్పష్టం. అనాటికే PLR 39 ప్రతి క్రిమిదష్టమై ఉండవచ్చు.

### 5.3 శ్రీపర్వతపురాణం – కవి కాలాదులు :

ఒక కవికాలాన్ని నిర్ణయించడానికి ఆకవి తనకావ్య అవతారికలో చెప్పిన భాగం ప్రధానంగా ఉపకరిస్తుంది. ఒకవేళ అవతారికలలో వివరణ ఎక్కువలేకున్నా తరువాతి కవుల స్తుతినిబట్టి, ఇతర ఆధారాల బట్టి ఆ కవి కాలాన్ని నిర్ణయించడానికి వీలుంది.

నాగలూటి శేషనాచార్యకవి శ్రీపర్వత పురాణంలో పూర్వకవి స్తుతినిగాని, తన కాలందినాటి రాజులను గురించిగాని ప్రస్తావించలేదు. తన కృతికి శ్రీలింగ చక్రవర్తి కృతిపతి (ఆ1–ప 34) అని స్పష్టం చేసుకున్నాడు. పైగా తాను శివజన్ముడనని, శివగోత్రుడనని, శ్రీగిరినాథ లబ్ధకవితా ప్రజ్ఞా కళాభిజ్ఞుడనని (ఆ1–ప19) స్పష్టం చేసుకున్నాడు. ఇవన్నీ కవికాలాదులు నిర్ణయించడానికి అంతగా సహకరించని అంశాలు కాకపోతే ఇతని పద్యాన్ని పెదపాటి జగ్గన్న ప్రబంధ రత్నాకరంలో–

"తత్తఱపాటుతో నిరులు దద్దయు మాసపగజాలు తిన్నను
వ్రేత్తున వేల్పు నూరకలకు విందులు పెట్టెడు తన్నుదమ్మియుస్
మొత్తమినత్త లచ్చికిని ముక్కుగబుట్టెన పుద్దుపట్టియో
నెత్తిలజూము తన్నుగల యొద్దతి వేలుపుగొల్లు నిచ్చటన్
(ఆ1–ప5)

అని ఉదాహరించాడు పైగా భద్రకవి లింగకవి దేవాంగ కావ్య అవతారికలో శేషనాచార్యుని పూర్వకవిగా–

"శివకులాంబుధి చంద్ర శేషయోగీంద్ర
ప్రవిమల భక్తి సంభావించి కొలిచి"
(దేవాంగ పురాణం అవతారిక పుట 3)

అని స్తుతించాడు.

ఈ రెండు ఆధారాలనుబట్టి శ్రీకందుకూరి వీరేశలింగం పంతులు

గారు "ఆధునికుడేయయినను గవి యే కాలమునందు యుండినవాడో సరిగా తెలియదు. ఇతడు నూటయేబది సంవత్సరముల క్రిందట నుండి యుండవచ్చును". అని ఆంధ్రకవుల చరిత్రము తృతీయ భాగములో స్పష్టం చేశాడు.

శ్రీ చాగంటి శేషయ్యగారు "ఆంధ్రకవి తరంగిణి"లో వీరేశలింగం పంతులుగారి అభిప్రాయాన్ని బలపరుస్తూ కవి నందికొట్కూరు ప్రాంతం లోని "నాగలూటి కవి జన్మస్థానమని, "అక్కడ వీరభద్రేశ్వరాలయ మున్నది. ఆలయానున్న తూర్పు గోపురాన్ని బొంతల నాగిశెట్టి యను నతడు శా. శ. ౧౪౬౮ (1546) రక్తాక్షి సంవత్సరములో కట్టించి యున్నట్లు వ్రాయించిన యొక శాసనము నాగలూటిలో యున్నది. నాగలూటిని సంస్కృతీకరించి శాసనములో "లాంగలూటి" యని వ్రాసియున్నారు. కావున కవి యింటి పేరు సొంతవూరు "నాగలూటి" యనియే నిర్ణయించి చెప్పవచ్చును" అని స్పష్టంచేశాడు, లభ్యమవు తున్న శాసనాలు, వ్రాతప్రతుల ప్రాచీనతనుబట్టి శ్రీ నాగలూటి శేషనాథార్యుడు 16వ శతాబ్దం పూర్వపువాడని స్పష్టంగా చెప్పవచ్చు.

5.3.1 అవతారికాభాగం-విశేషాలు :

శ్రీపర్వతపురాణం అవతారికలో ప్రధానంగా నాలుగు భాగా లున్నాయి. మొదటిది ఇష్టదేవతాస్తుతి. రెండవది పూర్వకవి ప్రశంస. మూడవది కవితా ప్రశంస నాలుగవది కృతిపతి వర్ణన. ఐదవది షష్ఠ్యంతం.

ఇష్టదేవతాస్తుతి :

ఆస్తిక్యం ఆవంతమాత్రమున్న ఏ కవి అయినా కావ్యాదిలో దేవతాస్తుతి చేయడం అలవాటు శేషనాథార్యకవి ఇష్టదేవతాస్తుతిలో మూడు భాగాలున్నాయి మొదటిది ప్రధానమూర్తి కీర్తన. రెండవది పరిసరమూర్తి ప్రార్థన. మూడవది స్వగ్రామ స్వామిసేవన.

ప్రధానమూర్తి కీర్తన :

శ్రీశైలంలో నెలకొన్న ప్రధానమూర్తి శ్రీగిరి మల్లికార్జునుడు ఆ స్వామిని శేషనాథార్యకవి మల్లికార్జును (అ-ప1), శ్రీపర్వతాధీశ్వరుని (అ1-ప2), శ్రీశైలేశ్వరుని (అ1-ప3), ఉద్యన్మూర్తిని (అ1-ప4), ఎట్టిడి వేలుపు (అ1-ప5), దేవుడు (అ1-ప6), వాగ్గమాధీశ సకల వైభవుడు (అ1-ప7) అని ప్రశంసించాడు. ఈ వర్ణనలలో హాలాహల విషపానం, చంద్రకళాధరత్వం, త్రిపురాసుర సంహారం మొదలయినవి పౌరాణిక ప్రసంగాలు.

నాచన సోమన తరువాత కవుల స్తుతి పద్యాలలో శృంగారం మేళవింపు కనిపించినట్లే శేషనాథార్యకవికూడా కావ్యాది పద్యంలో—

> శా॥ "శ్రీమత్పర్వత రాజరాజ్య పదవీ సింహాసనస్థున్ జగ
> ద్ధామ గ్రామణి మల్లికార్జును సపాంగ వ్యాప్తిలోకక్రియా
> సామర్థ్యున్ దుహినాద్రిజా కుచతటీ సందీప్త కాశ్మీర సాం
> ద్రామోదాన్విత వామభాగు శివు నారాధింతు దెందంబునన్"
>
> (అ1-ప1)

శృంగారం జోడించాడు.

పరివారమూర్తి ప్రార్థన :

ఈ విభాగంలో తోట వీరభద్రుడు ప్రధానమూర్తి. ఇతన్ని తోట వీరభద్రుడని, వీరేశ్వరుడని, శ్రీనగేశపురీశ వీరేశ అని మనసారా కవి కీర్తించాడు.

స్వగ్రామ స్వామిసేవన :

నాగలూటి శేషనాథార్యుని స్వగ్రామం నాగలూటి. అక్కడ నెల కొన్న స్వామి వీరభద్రేశ్వరుడు. ఆ స్వామిని

శా॥ "ఆస్ఫోటించిన దైత్యగర్వ తిమిరం బ్రశాంతము న్ మాన్యవ
ప్రస్ఫీతాపి ధనుః కుఠార శిఖర ప్రాసాద శస్త్రప్రభా
విస్ఫూర్తుల్ కరవంక్తులన్ మెఱయగా విశ్వామరత్రాణ శౌ
ర్యస్ఫారుండగు నాగలూటి వన వీరాస్వామి గీర్తించెదన్
(ఆ1-ప11)

అని కవి కీర్తించాడు.

సాధారణంగా కవులు చేసే వినాయక ప్రార్థన గాని, సరస్వతీ ప్రార్థనగాని లేకపోవడం చిత్రం. పూర్వకవి స్తుతికూడా లేకపోవడం మరొక విశేషం.

కృతి ప్రశంస :

సాధారణంగా కృతి రచనకు ఇతరుల ప్రోత్సాహం ఉండాలి. లేదా స్వయంగా వ్రాయాలనే సంకల్పం అనేరెండు కారణాలుంటాయి శేషనాధార్యకవికి ఆ బాల్యభక్తి వుండడంవల్ల కృతిరచనకు సిద్ధమైనట్లు తెలుస్తుంది. ఈ విషయాన్నే—

మ॥ "శివచారిత్రము బీజమంకురము నీసేవా వివేకంబు స
త్కవితా శ్రేణులు పల్లవంబులు సమాఖ్యా వ్రాతముల్ పుష్పముల్
భవదీయ స్తవముల్ ఫలావళులు తద్భావజ్ఞులే కీరముల్
భువిమత్కావ్య మహీరుహంబునకు శ్రీభూభృత్పుధీశ్వరా
(ఆ1-ప15)

స్పష్టం చేస్తుంది.

కవితా ప్రశంస :

సాధారణంగా ఏ కవిగాని, తన కవిత్వాన్నిగురించి కృతిపతిచేత గాని లేదా కావ్యపాత్రలచేతగాని పరోక్షంగా చెప్పించుకోవడంఅలవాటే

కొన్ని సందర్భాలలో తనకు తానే తన కవిత్వం ఇలాంటిదని స్పష్టం చేయడం కూడా సంప్రదాయం. ఇది కవిత్రయ సంప్రదాయం. శేషనాథాచార్యకవి కవితా ప్రశంస ఇలాంటిదే. శ్రీపర్వతపురాణంలో కవితా ప్రశంసకు సంబంధించి 10 పద్యాలున్నాయి. ఈ పద్యాలలో భాషా ప్రశంసకు, కవినింద ప్రధాన విషయాలు.

భాషా ప్రశంస 1

శేషనాథాచార్యకవి సంస్కృతాంధ్రభాషా నిష్ణాతుడు. సంస్కృతాన్ని శ్లాఘించినట్లే (ఆ1-ప 27)

కం॥ తెనుగైన నేమి కవితా
జనితాలంకార చిత్రసంగత పద వ
ర్ణన వచన రచన చతురత
నిన యోగ్యంబైన కృతియు విందు కుహాత్ముల్ (ఆ1-ప25)

అని తెలుగు మరచిపోలేదు.

కుకవి నింద :

హరి వుండగా హరినామం కలిగిన కప్పలు ప్రలాపించినట్లు సత్కవులను చూసి కుకవులు ప్రలాపింతురని (ఆ1-ప30)స్పష్టంచేశాడు అకులుమేసే మేకకు చెరకురసం తెలియునా అని (ఆ1-ప31) తానే పరిహాసం చేశాడు. చంద్రుని కిరణాలకు సముద్రం పుప్పొంగుతుంది గాని బావిని నీరు పరవశిస్తుందా అని (ఆ1-ప32) ప్రశ్నవేశాడు.

కృతిపతి వర్ణన :

శేషనాథాచార్యుని కృతికి ప్రేరకుడు శ్రీగిరి మల్లికార్జునుడె అతన్ని-

శా. "నావారున్ గడు బిన్నిప్రాయమున నోనామః శులంబ్రేమతో
శివాయః శులజెప్ప నాటగొలె నేసేవింప నియ్యాన, నా
భావం బందును నిన్నునెన్నుదును నన్ బ్రాణద్భవద్భుక్తి సం
భావజ్ఞాన సుధానుభావరతుగా భావింపు మల్లీశ్వరా! (అ1-ప14)

సీ।। ఏ దేవదేవుని యిచ్చలో విహరించు
 వారి జానసుదశ్వవాహనుండు
వలగొని యేదేవు వస్త్రంబు భండార
 మింటి కాపుండుదు రింద్ర ముఖ్యు
లే మహాదేవు మహిష్ఠ భూపాలికి
 బాతాళ భువనంబు బహుళపీఠి
భాసిల్లు నే దేవతా సార్వభౌముని
 కసమ దుగ్ధాంభోధి యస్త్రశాల
యట్టిదేవుని సర్వేశు నభునివర్తి
లలిత శుభమూర్తి గరుణా కళాప్రపమూర్తి
శక్రసుత కీర్తి శ్రీలింగచక్రవర్తి
బర్వతాదీశు మత్కృతి బ్రభుమతింతు" (అ1-ప34)

అని కీర్తించినాడు.

షష్ఠ్యంతములు :

ఆంధ్రవాఙ్మయంలో కావ్య అవతారికలలో షష్ఠ్యంతాల రచన నన్నెచోడుని కుమారసంభవంతో మొదలవుతుంది. ఈపద్ధతిని తర్వాత కవులందరూ పాటిస్తూ వచ్చారు. శేషనాథార్యకవి షష్ఠ్యంతాలు వ్రాస్తూ చివర సంస్కృతమయమయిన కందపద్యం వ్రాశాడు.

కం. శర్వాయ కమలజాత సు
పర్వ ప్రముఖాను పాలపాండిత్య కళా

ఖర్వాయతే నమో నమః
దర్వా చీనాయతే నమోఽమృతవిధయే (శ్రీ బ.పు ఆ2-ప97)

5.4 కథాసారాంశం :

శ్రీనాగలూటి శివనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో ఆరు అశ్వాసా లున్నాయి. ప్రథమాశ్వాసంలో అవతారికాభాగం, కథాసంగ్రహం కని పిస్తుంది. ఆ తరువాత సనత్కుమారుని ఆశ్రమవర్ణన వుంది. ఈ ఆశ్వాసంలో కథాభాగం తక్కువ.

5.4.1 ప్రథమాశ్వాస కథ :

సనత్కుమారుడు బ్రహ్మసుతుడు వేదవేత్త. ఆధ్యాత్మికరహస్యాలు తెలిసిన మహాయోగి పైగా వేదంలోని అరుదైన శాఖలను రమ్యంగా బోధించే ఉత్తమోపదేశికుడు. అంతకుమించి నృపుల భావాల సంతోష హృదయుడు. అలాంటి ముని దగ్గరకు ఒకనాడు కృష్ణద్వైపాయనుడు శిష్యసమేతుడై వచ్చాడు. సనత్కుమారుడు వరము మునీంద్రుని కి నమస్కరించి అతిధిమర్యాదలు చేశాడు. ఆ తరువాత సనత్కుమారుడు వ్యాసాగమన కారణాన్ని ప్రశ్నించాడు.

వ్యాసుడు మూడు లోకాలలో పుణ్యభూమి నీదని చెప్పవలసిందిగా ప్రార్థించాడు. సనత్కుమారుడు సంతోషిస్తూ "నీవడిగిన అర్థము శైవా గమవేదశాస్త్రసమ్మతము. జగత్పావనకరం." పుడమిలో పుణ్యభూమి శ్రీపర్వతమే. ఈ శ్రీపర్వతపురాణ శ్రవణంవల్ల భోగమోక్షాలు రెండూ దక్కుతాయి. ఈ రహస్యాన్ని మహదేవుడంతటివాడు పార్వతికిచెప్పగా బ్రహ్మదేవుడు నాకు తెలియజేశాడు. ఈ సవిస్తరంగా చెబుతానని మొదలుపెట్టాడు.

శ్రీపర్వతం సామాన్యమయింది కాదు. ఒక్కొక్క శైలానికి

ఒక్కొక్క మాహాత్మ్యం ఉన్నప్పటికీ శ్రీశైలమాహాత్మ్యం అన్నిటికన్న మిన్న. వింధ్యాద్రిదర్పం, గోవర్ధన సౌందర్యం, కైలాసవిలాసం, మేరుపుభారం, హిమపర్వత గర్వం, అస్తాచలఔన్నత్యం, మలయ భూధర మాహాత్మ్యం, గంధమాధన సాధనం మొదలయినవన్నీ శ్రీ పర్వతంలో కనిపిస్తాయి. అది భక్తిముక్తుల త్రోవ. మోక్షంబులచేవ. తపస్సుల ఎల్లి. తీర్థంబుల వెల్లి. ఎల్లలకు ఎల్లి.

5 4.2 ద్వితీయాశ్వాస కథ :

శివుడు శ్రీశైలక్షేత్రంలో స్థానమేర్పరుచుకోవడానికి కారణాన్ని పార్వతి అడగడం, అతడు శిలాదునికథ, నందీశ్వరునివాంఛ, పర్వతుని కాంక్షలు తెలియజేయడం ద్వితీయాశ్వాసంలోని ముఖ్యాంశాలు. పర్వత స్తుతితో ఈ ఆశ్వాసం ముగుస్తుంది.

శిలాదుడొక ముని. అతడు రోజూ ఒక్కరాయి తింటూ శతకోటి సంవత్సరాలు సంతానంకోసం శివుణ్ణి ఉద్దేశించి తపస్సు చేశాడు. హఠయోగంతో స్వామిని మెప్పించాడు. తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యాడు. కులదీపకులయిన, శివధర్మ పరాయణులయిన కొడుకుల్ని ప్రసాదించమన్నాడు. అతని కోరికను మన్నించి స్వామి ఇద్దరు కుమారుల్ని ప్రసాదించాడు. వారే నందీశ్వర పర్వతులు.

నందీశ్వరుడు పెరిగి పెద్దవాడై శివుణ్ణి ఉద్దేశించి తపస్సుమొదలు పెట్టాడు. తపస్సుకు మెచ్చి స్వామి ప్రత్యక్షమయ్యాడు. శివుడు వరం కోరుకోమన్నాడు. తన్ను వాహనంగాస్వీకరించమన్నాడు నందీశ్వరుడు స్వామి సమ్మతి తెలియజేస్తూ నందీశ్వరుని వాహనంగా స్వీకరించాడు. తపస్సు చేసిన స్థలం నందిమండలంగా మారింది.

పర్వతుడు పెరిగి పెద్దవాడయ్యాడు. అతడూ ఆహారంలేకుండా కలకాలంగా నిలబడి రాత్రనక పగలనక పరమేశ్వరునిగూర్చి తపస్సు

చేశాడు. పర్వతుని తపస్సుచూచి హరి బ్రహ్మాదులు ఆశ్చర్యంచెందారు. తపస్సుకు మెచ్చి పరమశివుడు ప్రత్యక్షమయ్యాడు. పర్వతుడు పరమేశ్వరుని స్తుతించాడు. పర్వతుని వరం కోరుకోమన్నాడు శివుడు. పర్వతలింగమూర్తిగా తన శిరస్సుమీద ఉండేటట్టు వరంకోరాడు పర్వతుడు. అతని కోరికకు సమ్మతిస్తూ పర్వతలింగమూర్తిగా అవతరించాడు. అంతమాత్రంకాకుండా పర్వతునిభక్తికిమెచ్చి ఇంకా రెండు వరాలు కోరుకోమన్నాడు శివుడు.

ముల్లోకాలలోఉండే పుణ్యపర్వతాలు, పుణ్యతీర్థాలు, పుణ్యనదులు పుణ్య దేవాలయాలు ఆవిర్భవించి పుణ్య మునీంద్రుల సమేతంగా ఉండేటట్టు, ఆ తీర్థాలను దర్శించిన వారికి కోరికలు నెరవేరి స్వర్గం దక్కేటట్టు చేయమనడం ఒక వరం. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులే గాక ఇతర కులాలవారయినా శ్రీశైలందర్శిస్తే పూర్వజన్మలోని పాపాలు పోయి మోక్షం దక్కాలని, శ్రీపర్వతంలో నివసించే సమస్త జంతు పశు పక్ష్యాదులకు ముక్తి లభించాలని, శిఖరం చూసిన వారికి పునర్జన్మ లేకుండా పాపాలు పోవాలని, శిఖరదర్శనం ముక్తిసత్రం కావాలనడం రెండోవరం. పరమేశ్వరుడు అనుగ్రహించాడు. పరమేశ్వరుడు పర్వత లింగమనే పేరుతో ఆవిర్భవించాడు.

శివుడు కైలాసం వదలి శ్రీపర్వతంచేరగానే హరిబ్రహ్మాదిదేవతలు ఆప్రదేశంలో కొలువైనారు. కైలాసం,నీలాచలం, మైనాకం, మాణిక్యాది పర్వతాలు భాగీరథి, పాతాళగంగ, పంచనదతీర్థం, గాయత్రీ తీర్థం మొదలయిన తీర్థాలు. విరజానది, కౌశికనది, గాంధారనది, తుంగభద్రనది మొదలయిన మహానదులు శ్రీపర్వత ప్రాంతంలో ప్రవహించాయి.

శ్రీపర్వతలింగాన్ని నాగావర్ర మునిదేవతలు కూడా సేవించారు. ఇంద్రుడు పర్వతలింగానికి గొడుగు పట్టాడు. బ్రహ్మాదులు పర్వతుని కీర్తించారు. కశ్యపుడు దధీచికలిసి స్వామిని ప్రమథాధిపతుల భక్తులలో లింగార్చనాసక్తి పెంచారు. పురధేనువులు సురధేనువులుగా, తరులు కల్పతరులుగా మారినాయి.

శ్రీపర్వతమే క్రీడాస్థానం అని సనకాది మునులు స్తుతించారు. ఇదే ప్రత్యక్ష కైలాసమని బ్రహ్మాది దేవతలు భావించారు. పర్వతుని తపస్సువల్లే పర్వతేశ్వరుని సేవించామని గౌతముడు, అత్రి, కణ్వుడు వామదేవుడు, నారదుడు, వత్స, గర్గాది మునులు పలికారు. అంతే గాకుండా మంచి కొడుకుల్ని కన్నాడని శిలాదుని మునులు ప్రస్తుతించారు.

5.4.3 తృతీయాశ్వాస కథ :

శ్రీశైలదైవక్షేత్ర తీర్థ మాహాత్మ్యాలు చెప్పడం తృతీయాశ్వాసం లోని విశేషాలు. ఇందులో వసుమతి కథ, అక్కడ ప్రవహించే నదుల మహిమలు, తీర్థమాహాత్మ్యలు ఆయా మాసాలలో స్వామిని కొలిచే వారి ఫలాలు, శ్రీశైలద్వారాలు చెప్పడం ఈ అశ్వాసంలోనివిషయాలు.

వసుమతి ఒక మునికన్య. సుకుమారి. అందగత్తె అయినా భక్తురాలు. బ్రహ్మను ఉద్దేశించి ఘోరతపస్సు చేసింది. స్వామిప్రత్యక్ష మయ్యాడు. వరం కోరుకోమన్నాడు. తాను వసుమతి రమక శ్రీనామం ప్రసాదించవలసిందిగా కోరింది. బ్రహ్మ అనుగ్రహించాడు. వసుమతి శ్రీదేవి అయింది. శ్రీదేవి పర్వతేశ్వరుని కొలుస్తూ కాలం గడిపింది. శ్రీదేవి ఆ పర్వతంలో స్థిరనివాసం ఏర్పరచుకోవడంవల్ల శ్రీనగం అనే పేరు స్థిరపడింది.

ఏఏ మాసాలలో శ్రీపర్వతుని సేవిస్తే ఏఏ ఫలితాలు కలుగుతాయో శేషనాధార్యకవి ఈ ఆశ్వాసంలో చెప్పాడు. కార్తీకమాసంలో సేవిస్తే వాజపేయ యజ్ఞఫలం. మార్గశిరమాసంలో సేవిస్తే పౌండరీక మఖ ఫలం. పుష్యమాసంలో సేవిస్తే అతిరాత్ర యజ్ఞఫలం. మాఘమాసంలో అయితే రాజసూయయాగఫలం. ఫాల్గుణమాసంలో అయితే జ్యోతిష్టోమ ఫలం. మధుమాసంలో అయితే బహు సువర్ణయజ్ఞఫలం. వైశాఖ మాసంలో అయితే లక్షగోవుల్ని దానం చేసిన ఫలం. జ్యేష్ఠమాసంలో అయితే సువర్ణదానఫలం. ఆషాఢమాసంలో అయితే కోటిగోవుల దానం చేసిన ఫలం. శ్రావణమాసంలో అయితే పాత్రత నెరిగి దానం చేసిన ఫలం. భాద్రపదంలో అయితే కోటిగోవుల నిచ్చేఫలం. ఆశ్వయుజ మయితే బుద్ధిమంతునికి ఐదుగురు కన్యలను ఇచ్చిన ఫలితం కలుగు తుందని కవి విస్తరించి చెప్పాడు.

ఆపై శ్రీపర్వతలింగానికి ఉపచారాలు చేసేవారికి కలిగే ఫలితాలు వర్ణితం. పూలతో స్వామిని పూజించే వారికి సంపద, ధనం, గొప్పతనం లభించేఫలం. గంగలో స్నానం చేసి స్వామి ఎదుట మంగళగీతవాద్యా లతో మహిమస్తోత్రాన్ని చదివే వారికి సుఖఫలం. కపటంలేకుండా మారేడు పూలు, చెంగల్వపూలు, ద్రోణాది పుష్పాలతో మల్లికార్జున స్వామిని పూజించే వారికి ముక్తిఫలం. పంచామృతంతో స్వామికి అభి షేకం భజన చేసేవారికి రాజాభిషేక ఫలం. స్వామి గుడిని ఆవుపేడతో అలికిన వారికి స్వర్లోక దేవాంగనా సంయోగప్రాప్తి. స్వామికి రమ్యా గారం నిర్మిస్తే రుద్రగణాల మధ్య నివాస ఫలితం కలుగుతుంది.

ఆపైన నదుల మహిమలు, తీర్థమాహాత్మ్యాలు వర్ణితం. గడ్డిగబావి మల్లికాకుండంలో స్నానం చేసి స్వామిని సేవించేవారికి రుద్రచిహ్నాలతో

ప్రమథాధీశ్వరులు అయ్యే ఫలం. కుండీతీర్థంలో స్నానం చేసి సేవించే వారికి శుభఫలం. ఘంటాకుండంలో స్నానం చేసి, దానంచేసి, లింగదర్శనం చేసేవారికి కోర్కెలు నెరవేరి బ్రహ్మహత్యాపాపాలు తొలిగేఫలం. హాటకేశ్వర తీర్థం, పంచవల్లవధార తీర్థంలో స్నానంచేసి స్వామిని పూజించిన వారికి కోర్కెలు తీరేఫలం. పాతాళగంగలోస్నానం చేసి స్వామిని సేవించేవారికి పాపరాహిత్య ఫలం. "రుద్రపాదసన్నిధిలో పితృదేవతలకు శ్రాద్ధం చేస్తే వారికి సంతృప్తి కలిగేఫలం. ఈప్రాంతంలో తొమ్మిది కదళీవనాలు. తొమ్మిదిసు రభూరుహాలు, తొమ్మిది బిలాలు, తొమ్మిది అమృతవాపులు, తొమ్మిదిమంది పురాధిపతులున్నారు. శిఖరం దర్శిస్తే భయంకర యమలోకం చూడని ఫలం. శిఖరేశ్వరలింగాన్ని దర్శిస్తే పాపరాహిత్యం, ముక్తిప్రాప్తి ఫలం దక్కుతుంది.

శ్రీశైలం ఉత్తరద్వారంలోఉండే సర్వేశపుష్కర నదులమహిమ వర్ణించడానికి బ్రహ్మతరంకూడాకాదు. సర్వేశ్వ పుష్కరనదుల్లో స్నానం చేసే వారికి పాపాలుపోతాయి. వారు శుద్ధాత్ములవుతారు. ఈప్రాంతంలో నవదుర్గలు, నవ నరసింహులు, నవగిరులు. నవభైరవులు, నవలింగ స్థలాలున్నాయి. నవనంది మం లాలు, నవకుండితీర్థాలు, నవ నందికేశ్వరుల్ని సేవించే వారికి మోక్షం వస్తుంది. నందీశ్వరుడు తపస్సు చేసిన స్థలం నందిమండలంగా ప్రసిద్ధి గడించింది. ఆప్రదేశంలోజీవించే పశుపక్ష్యాదులకు మోక్షం, మానవులకు కోరికలు నెరవేరుతాయి.

మహేంద్రపర్వతం తపస్సు చేసి శివుణ్ణి "చెంచుగా" చేయ గలిగింది ఇక్కడనే. పర్వతముని చెంచుల్ని శివునిగా చేస్తున్నాడు. ఈ శ్రీగిరిలో ఏవి సాటిరావు కేదారంలో లక్షమందికి, కాశీలో రెండులక్షల మందికి, గయలో ఏడులక్షల మందికి అన్నదానం చేస్తే కలిగే ఫలం

శ్రీశైలంలో ఒక్కరికి అన్నదానం చేస్తే కలిగే ఫలితం ఒక్కటే. ఈ క్షేత్రంలో కాసంతా పుణ్యం చేసినా అది కోటిరెట్లుగా ఫలిస్తాయి. ఒకవేళ ఏ చిన్నపాపం చేసినా అది కోటిరెట్లయి ఆ వ్యక్తిని పీడిస్తుంది.

శ్రీగిరికి ఉత్తరాన ఉమామహేశ్వరం ఉంది. అక్కడ ఉమామహేశ్వరుని సేవించిన వారికి పురాణశాస్త్రాల్ని విని ఆనందంపొందిన ఫలం వస్తుంది. ఇక్కడ మహేశ్వర లింగం, ఉమాదేవి శక్తి ఉంది. రుద్రధార, పంచధార, విష్ణుధార, భైరవధారలున్నాయి. అమరావతి తీర్థం, చతుర్ముఖేశ్వర తీర్థం, పాపవినాశన తీర్థం, నందీశ్వర తీర్థా లున్నాయి. ఈ తీర్థాల్లో స్నానం చేసి స్వామిని సేవించే వారికి వేయి అశ్వమేధయాగాలు, నూరు యజ్ఞాలు చేసిన ఫలితం దక్కుతుంది.

శ్రీగిరికి పడమట అలంపురం ఉంది. అక్కడ బ్రహ్మేశ్వరస్వామిని సేవించేవారికి పరబ్రహ్మజ్ఞానం, బ్రహ్మ, స్త్రీ, గో, హత్యాపాపాలు తొలగిపోతాయి. ఇక్కడ తుంగభద్ర తీర్థం, ముక్తిరామేశ్వరతీర్థం, భోగీశ్వర తీర్థం, గుప్తా మల్లికార్జున తీర్థాలున్నాయి. ఈ తీర్థాల్లో స్నానం చేసి స్వామిని సేవించిన వారికి వేయి అశ్వమేధయాగాలు, నూరుయజ్ఞాలు చేసిన ఫలితం దక్కుతుంది.

శ్రీశైలానికి దక్షిణాన సిద్ధవటం ఉంది అక్కడ సిద్ధవటేశ్వర స్వామి, అష్టమహాసిద్ధి అనే శక్తి, జ్యోతి ఉంది. వరుడేశ్వర తీర్థం, దపితేశ్వరతీర్థం, ప్రాణేశ్వర తీర్థం, సందిమండల తీర్థాలున్నాయి. నవ నదులు, ఓంకారేశ్వరం, అహోబిలం మొదలయిన క్షేత్రాలున్నాయి' ఆ తీర్థాల్లో స్నానం చేసి స్వామిని సేవించినవారికి వేయి అశ్వమేధ యాగాలు, నూరు యజ్ఞాలు చేసిన ఫలితం దక్కుతుంది.

శ్రీగిరికి తూర్పున త్రిపురాంతకం ఉంది. ఇక్కడ త్రిపురాదేవితో త్రిపురాంతకేశ్వరస్వామి ఉన్నాడు. ఇక్కడ గంధర్వతీర్థం, లింగతీర్థం గుండిప్రభా తీర్థాలున్నాయి. ఈ తీర్థాల్లో స్నానం చేసి స్వామినిపూజించే వారికి వేయి అశ్వమేధయాగాలు, నూరు యజ్ఞాలు చేసిన ఫలితం దక్కుతుంది.

5.4.4 చతుర్థాశ్వాస కథ :

చంద్రగుప్త పట్టణాధీశుడయిన చంద్రగుప్త మహారాజు రాజ్య పాలన, ఆ మహారాజు విజయయాత్రలు, చంద్రవతి వృత్తాంతం ఈ ఆశ్వాసంలోని ముఖ్యాంశాలు.

చంద్రవతి చంద్రగుప్త మహారాజు కూతురు. చంద్రవతి బాల్యం నుండి శివభక్తురాలు. చంద్రవతి రూపవతి గుణవతి. ఆమె యుక్త వయస్కురాలైంది. భూలోకంలో చంద్రవతిని మించిన రూపవతులు లేరని చెలికత్తెలు పొగిడారు. చెలికత్తెలతో కలిసి తిరిగే చంద్రవతిని చూచి ఒకసారి తండ్రి మరులుగొన్నాడు. అతనిచూపులోని మార్పును చంద్రవతి గుర్తించింది. దీనికి కారణం తండ్రికాడని కాముడే కారకుడని భావించింది. కాముణ్ణి జయించాలని "కామారి"ని స్తుతించింది. చంద్రవతి చెలులతో పూజకోసం పూలవనం చేరుకుంది. కాశి, సింధు, సరస్వతి యమున, గంగ తీర్థాలు దర్శించింది. శ్రీపర్వతం చేరుతుంది.

చంద్రవతి శ్రీపర్వతలింగాన్ని భక్తితో సేవించింది. శివునికి ఇష్టమయిన బ్రహ్మవీణ, కైలాసవీణ, సారంగవీణ, కూర్మవీణ, అకాశ వీణ మొదలయిన వీణలతో నాదోపాసన చేసింది. శివునికి ఇష్టమైన శ్రీరాగం, సౌరరాగం, శంకరాభరణరాగం, గాంధారిరాగం, మధ్యమ గాంధారిరాగం మొదలయిన రాగాలతో మెప్పించింది. నాదశరీరు డయిన శివుడు ఆమె సంగీతానికి ముగ్ధుడయ్యాడు, వరం కోరుకో

మన్నాడు. మల్లికా పుష్పాలతో సేవించడంవల్ల మల్లికార్జున లింగ నామంతో అవతరించమని కోరింది. శ్రీపర్వతస్వామి ఆమె కోరికపై మల్లికార్జునస్వామిగా అవతరించాడు.

### 5.4.5 పంచమాశ్వాస కథ :

శ్రీపర్వతంలోని అనేకమూలవర్ణనలు. అసంఖ్యాకబిలాలమహిమలు సాధకుని వృత్తాంతం ఈ ఆశ్వాసంలోని విశేషాలు.

శ్రీగిరికి శృంగాలు మూడు. మూడు శృంగాలమధ్య మూడు చెట్లున్నాయి, వాటిని తాకినవారికి స్వర్గ, మర్త్య, పాతాళలోకవృత్తాంతాలు తెలుస్తాయి ఒక చెట్టుకాయ, ఒక చెట్టుపండు, ఒక చెట్టువిత్తనం తింటె ప్రమథులతో సమానులవుతారు.

సాధకుడు అనే భక్తుడు వృక్షాలమహిమ తెలుసుకోవాలని అనుకున్నాడు. శ్రీశైలస్వామికి అభిషేకం చేశాడు. సాంబ్రాణిధూపమిచ్చాడు చేయి నీరాజనాలిచ్చాడు. స్వామి ఎదుట పంచాక్షరిని జపించాడు.

సాధకునికి ఒక బిలం కనబడుతుంది, సాధకుడు భయపడకుండా బిలంలో ప్రవేశించాడు. ఐదుయోజనాల విస్తీర్ణంగల బిల్వవనాన్ని చూశాడు. నది, నదీతీరంలో శివలింగం కనబడుతుంది. నదిలోస్నానం చేసి లింగాన్ని సేవిస్తే కోరికలు నెరవేరుతాయని అనుకున్నాడు. అక్కడ బొరెడుకొక ముని ఉన్నాడు, వారిని దర్శించి ముందుకుపోగా క్రోసుకొక గురు తపోవనం కనబడింది. తరువాత ఒక పట్టణం ఉంది. దాన్ని దాటితే సిద్ధసాధన గంధర్వశిఖరాలు కనిపించాయి. సాధకుడు మరి ముందుకు పోగా ఛాయా వృక్షం కనబడింది.

సాధకుడు ముందుకుపోగా మరొకబిలం కనబడుతుంది. బిల ద్వారంవద్ద మోహిని అనే గజం ఘీంకారంచేస్తూ భయంకరంగాఎదుర వచ్చింది. సాధకుడు భయపడకుండా బిలప్రవేశం చేశాడు అతణ్ణి

ఏనుగు బాధించింది. అయినా ఓర్పుతో నిలిచిన సాధకునికి సర్వసిద్ధులు దక్కాయి.

సాధకుడు ముందుకుపోగా బిల్వవృక్షం కనబడింది. దానికింద బిల్వేశ్వరుడున్నాడు. స్వామిని సేవించి దివతైలాంజనం కండ్లకు పూసుకున్నాడు. సాధకునికి దివ్యదృష్టి వచ్చింది. ఆపై మూరెడు అకుల మధ్యలోని భైరవుణ్ణి చూశాడు సాధకుణ్ణి భయపెట్టాడు భైరవుడు. అపుడు సాధకుడు భయపడకుండా భైరవుణ్ణి తల ఎగిరిపడేట్టు తన్నాడు. తల మునిరూపంలో ప్రత్యక్షమవుతుంది. సాధకుని అనేకప్రశ్నలు వేసి పరీక్షలు చేయసాగాడు. వాటిని తట్టుకున్న సాధకున్ని ముని అభినందించాడు. శ్రీపర్వతంమీద ఉన్న కోట్లాది బిలాలు, తీర్థాల్ని ఆ ముని వివరించాడు. ఆ ముని ఆపై సాధకునికి కరవీరవనాన్ని చూపించాడు. శివపూజాధురంధరుడయిన కరవీరుడు శివుణ్ణి మెప్పించి సాక్షాత్కారం పొందిన వైనాన్ని ముని చెప్పాడు.

కరవీరుడు సుశ్రీకర వీరగుణాకరుడు. అతడు వీరేశ్వరుడను పేరుగల గిరి వీరేశ్వరుని కొలిచాడు. పైగా అచంచలమయిన తపస్సు చేశాడు. హరుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. ఇహమంటె ఏవగించుకున్న కరవీరుడు వరాన్ని కోరాడు. అందుకే తన్ను కరవీర వృక్షంగా పూజకుఉపయోగపడేటట్టు వరం ప్రసాదించమన్నాడు. పైగా ఈ కరవీర పుష్పాలతో హరుని పూజించే వారికి దేవేంద్ర ఐశ్వర్యం కలగాలని కోరుకున్నాడు. హరుడు ఆ వరాన్ని కూడా అనుగ్రహించి అంతర్ధానమయ్యాడు. అందుకే కరవీరపుష్పం (గన్నేరు పుష్పం) శివపూజలకు ప్రీతికరమయినదని చెబుతారు. సజ్జనులకు మాత్రం కరవీర వన దర్శనం లభిస్తుంది

సాధకుడు కరవీరవనం దాటాక తృణబిందు సరోవరం చేరుకున్నాడు. ఈ సరోవరం తాపసాశ్రమంతో సమానం. ఇది సజీవ సరోవరం చెప్పబడింది. ఆ సరోవరంనుండి పాతాళలోకానికి మార్గం ఉంది.

ఆపై సాధకునికి "శంకరి" పట్టణం కనబడుతుంది. అది పార్వతీదేవి బాల్యక్రీడల్లో కట్టినబొమ్మరిండ్లపట్టణం. సురకన్యలు, అహికన్యలు గిరికన్యలు, కిన్నెరకన్యలు అక్కడ పార్వతితో ఆటలాడారు. ఆ పట్టణం నడివీధిలో శివలింగాన్ని ప్రతిష్ఠ చేసి తపస్సుచేసింది పార్వతి. తపస్సు మెచ్చి శివుడు ఆమెను స్వీకరించాడు. శంకరి తపస్సు చేయడంవల్ల ఆ ప్రదేశానికి శంకరి అనే పేరు వచ్చింది. ఆ పట్టణంలో ప్రవేశించిన సాధకునికి ఒక కన్య ఎదురువచ్చింది. ఆ కన్య సాధకునికి పూర్వజన్మ వృత్తాంతం చెప్పింది.

పూర్వజన్మలో సాధకుడు "భోగీశుడు"అనే శివలింగాన్ని పూజించేవాడు. తుమ్మెద ఉన్న పుష్పాల్ని స్వామికి సమర్పించాడు. అందువల్ల స్వామి ఆగ్రహించాడు. మానవజన్మ వస్తుందని శపించాడు. ఆపై ఆ కన్యలు అతణ్ణి నాగలోకంలోని భగవతీ నదిలో స్నానం చేయించారు. సాధకుడు దివ్యదేహాన్ని పొందాడు. భక్తితో భోగనాథుని సేవించాడు సాధకుడు.

సాధకునికి తరువాత వృషభబిలం కనబడుతుంది. వృషభం ముందు ఒక ఋషి ఉన్నాడు. సాధకుడు వృషభేశ్వరుని తోక పట్టుకోగా అది బిలంలోకి తీసుకెడుతుంది. బిలంలోని శివుణ్ణి పూజించాడు. వృషభేశ్వరునివల్ల అతని కోరికలు నెరవేరాయి. ఆపై సాధకునికి నిర్జరారణ్యం కనబడుతుంది. అందులో సూర్య, చంద్ర, నక్షత్ర శాఖ వృక్షాలు కనిపించాయి. ఆపైసాధకుడు కొంతదూరంపోగా ఒకరమణీయ

నుయిన పట్టణం కనబడుతుంది. ఆ పట్టణ రాజవీధుల్లో పోయే సాధకునికి పురాంగనలు ఆహారంపెట్టారు వారిలో ఒక స్త్రీ సాధకున్ని తన రమ్యాకగారానికి తీసుకెళ్ళింది.

ఆపై సాధకుడు బాలబిలం ప్రవేశించాడు అక్కడ జితేంద్రియుడయిన ముని కనబడి బాలబిలం విశేషాలు చెప్పి సాధకుణ్ణి భయపెట్టాడు సాధకుడు ధైర్యంతో బిలంలో ప్రవేశించాడు అక్కడ ఒక సుందరాంగి శిశువును సాధకునికి ఇచ్చింది శిశువు సాధకుణ్ణి బాధలు పెట్టి శరీరమంతా కరిచాడు సాధకుడు చలించలేదు సాధకుని ధైర్యానికి మెచ్చి సుందరాంగి దివ్యదేహాన్ని ప్రసాదించి కోరికలు నెరవేర్చింది సాధకునికి పర్వతాకారంలో పాము కనబడింది పాము అతనికి దారినిస్తుంది సాధకునికి మరొకపాము కనిపిస్తుంది దీనిప్రభావంవల్ల అతని చేతులు తెగిపోయాయి సంధానకరణిదగ్గర మోపడంవల్ల చేతులు తిరిగి వచ్చాయి ఆపై కొంతదూరం పోగా ఏనుగులు భయపెట్టాయి వాటిని దాటాక ఆమడవిస్తీర్ణంగల బిలం కనబడుతుంది దానిముందు చెట్టుంది చెట్టు ఎక్కిన సాధకునికి కోతిరూపం వస్తుంది కోతిగా తిరుగుతూ ఒక పండు తినగా చిలుకరూపం వస్తుంది కొమ్మమీదనే చిలుకగా తట్టాడు ఉంటే అతనికి తుమ్మెదరూపం వచ్చింది తుమ్మెదగా తిరిగి తిరిగి ఒక మునిని దర్శించినాడు తన కథ అంతా మునికి చెప్పాడు ముని అనుగ్రహించి దివ్యశరీరాన్ని ప్రసాదించాడు సాధకుడు మునిదగ్గర శెలవు తీసుకొని ముందుకుపోగా ఖేచరబిలం కనబడుతుంది.

ఖేచరబిలం ప్రవేశించిన సాధకునికి పెనుమంటలు కనిపించాయి సాధకుడు మంటలు దాటాడు అక్కడ మునికి తన వృత్తాంతంతెలిపాడు

ఆపై సాధకుడు భైరవబిలం ప్రవేశించాడు భైరవుడు పులిరూపం బిలందగ్గర ఉన్నాడు సాధకుడు పులితోపోరాడాడు పులి నేలకొరిగింది

శివధర్మపరాయణులయిన (ఆ2-వ43) కొడుకుల్నే కోరుకున్నాడు. స్వామికూడా అట్లే అనుగ్రహించాడు. అంచేతనే నందీశ్వరుడుకూడా శివభక్తుడయ్యాడు (ఆ2-వ45) అలాగే పర్వతుడుకూడా పరమేశ్వరుని కృపకు పాత్రుడయ్యాడు.

మూడవ అంశం ముగ్గురుకూడా శ్రీశైలపర్వత ప్రాంతంలో తపస్సుచేసిన వారవడం. ఆ నందీశ్వరుని పేరుతోనే ఈప్రాంతం నంది మండలంగా మారింది (ఆ2-వ69) పర్వతుని పేరుతో పర్వతలింగ మూర్తిగా (ఆ2-వ89) శివుడు నిలవడం అనేవి ముఖ్యమైనవిషయాలు ఒక పట్టణానికి మొదటి మూడు వాకిళ్ళలాగా ఈ మూడు కథలు ఒకి దాని వెంబడి ఒకటి నడుస్తాయి.

మునిం, మర్త్యకన్యల ప్రాధాన్యం :

వసుమతి మునికన్య అయితే చంద్రవతి రాజకన్య శ్రీనగం అనే పేరు రావడానికి గల కారణాన్ని తెలిపే కథ వసుమతి కథ రెండవది స్వామికి మల్లికార్జునుడు అనేపేరురావడానికి ఉద్దేశించినకథ చంద్రమతి కథ.

మొదటి కథలో వసుమతి తపశ్చర్య ప్రధానమయితే, రెండో కథలో చంద్రవతి భక్తికి ప్రాధాన్యం కనిపిస్తుంది ఈ రెండు కథల ద్వారా కవి చెప్పదలచుకున్నది తపస్సుకంటె భక్తికి ప్రాధాన్యం నిరూపించడం.

హఠయోగానికి విలువఇచ్చిన కథ శిలాదునికథ అయితేసామాన్య మైన కథకు ప్రాధాన్యం ఇచ్చిన కథ వసుమతికథ అయితే భక్తికి విలువ ఇచ్చిన కథ చంద్రవతి కథ అంతేగాకుండ మొదటి విభాగంలో పురుషులకు ప్రాధాన్యం కనిపిస్తే రెండోవిభాగంలో స్త్రీలకే ప్రాధాన్యం కనిపిస్తుంది భక్తికి లింగభేదం లేదని చెప్పడం కవి ఆశయం కావచ్చు.

బిలంగుండా సరోవరం చేరుకున్నాడు. ఆపై సాధకుడు దేవతోద్యాన వనంలో ప్రవేశించాడు అక్కడ స్వర్ణశివాలయం కనబడింది. ఆ శివాలయానికి పడమర ఆదిశేషువు, తూర్పున విఘ్నేశ్వరుడున్నారు. శివాలయంలోని స్వామిని సేవించి అనుగ్రహం పొందాడు.

సాధకుడు పద్మవతీ బిలం చేరాడు. అక్కడ ఒక "నగారా" కనబడింది. దాన్నివాయిస్తే పద్మవతి కన్య కనిపించింది. పద్మవతి రూపవతి గుణవతి, సాధకుని యోగక్షేమాలు, తల్లిదండ్రుల వివరాలు అడిగింది. ఆమె ఫలరసభక్ష్యాలతో సాధకునికి విందు ఏర్పాటు చేసింది సాధకునికి దివ్యశరీరం ప్రసాదించింది. దైవత్వం పొందిన సాధకుడు ఇంద్రాదుల్ని లెక్కచేయలేదు. సాధకునికి గర్వాన్ని చూసి పద్మవతి ప్రబోధంచేసింది సాధకుడు గర్వాన్ని విడనాడి శాంతిస్వరూపుడయ్యాడు. సాధకుడు విమల విజ్ఞానవైభవ సంపన్నుడై ఆ చంద్రార్కం దివ్యభోగాలు అనుభవించాడు.

5.5 కథాసంవిధానం :

"ఇతివృత్తంతు కావ్యస్య శరీరమ్"అని ప్రసిద్ధి. శరీరానికి వివిధావయవాలు ఎలాగో సన్నివేశాలు, వర్ణనలు, పాత్రలు మొదలయినవి అంత ప్రధానమయినవి. ఇతివృత్తం ముడిసరుకు అయితే, ఆ ముడిసరుకును ఒకరూపంగా తీర్చిదిద్దడంలో చేసే తొలి ప్రయత్నమే సన్నివేశసంవిధానం.

సన్నివేశ సంవిధానం :

ఒక హారంలోని ముత్యాల్లాగా కథలోని సన్నివేశాలు రాణిస్తాయి. శ్రీపర్వతపురాణంలో వక్త సనత్కుమారుడు. శ్రోత కృష్ణద్వైపాయనుడు. శ్రీపర్వతపురాణంలోని కథలన్నిటిలోనూ శ్రీపర్వతమాహాత్మ్య కథనం పూసలలోని దారంలాగా అంతర్వాహినిగా ఉంటుంది.

శ్రీపర్వతపురాణంలో ప్రధానంగా ఆరు కథలున్నాయి. శిలాదుని కథ, నందీశ్వరునికథ, పర్వతునికథ, వసుమతి కథ, చంద్రవతి కథ, సాధకుని కథ, ఇంకా తీర్థాలు, వనాలు, బిలాలు. ప్రతిష్ఠితలింగాలు, స్తుతులు అనేవి మహిమల్ని పెంచడానికి ఉద్దేశించినవి.

శ్రీపర్వతపురాణకథలు, ఆకథల్లోని వ్యక్తుల్ని పరిశీలిస్తే శిలాదుడు నందీశ్వరుడు. పర్వతుడు దేవతావర్గానికి చెందినవారు. చంద్రవతి, చంద్రగుప్తుడు మానవమాత్రులు. సాధకుడు ఒక యాత్రికునివంటివాడు. మొదటి కథ ఊహాత్మకం. కేవలం విశ్వాసం పునాదులమీద కట్టబడిన భవనం. రెండవది వసుమతి చంద్రమతుల కథలలో మర్త్యవాసన ఎక్కువ. ఈ రెండు కథల్లోనూ మానసికవిభ్రమాలకు ఆస్కారంఎక్కువ మూడవకథలో ఒక బాటసారి లక్ష్యసిద్ధికోసం ప్రయత్నించడం, పరితపించడం, సాధించడం కనిపిస్తుంది. ఈ మూడు కథల జోడింపు త్రివేణీసంగమంలాంటిది.

పౌరాణికపాత్ర ప్రాధాన్యం :

ఈ వర్ణనలో శిలాద నందీశ్వరుల పర్వతుల కథలు కనిపిస్తాయి. శిలాదునికథ పాల్కురికి సోమన బసవపురాణంలో (ప్ర.అ. పుట7) కూడా కనిపిస్తుంది. ఈ మూడు కథల్లోనూ ప్రధానంగా మూడు అంశాలున్నాయి.

మొదటిది హఠయోగప్రాధాన్యం శిలాదుడు శతకోటిసంవత్సరాలు రాళ్ళుతిని బతకడం (ఆ2-ప25). అలాగే పర్వతుడు తలకిందులుగా రాత్రనక పగలనక తపస్సు చేయడం (ఆ2-ప73, 74) మొదలయిన హఠయోగప్రక్రియలు.

ఇక రెండవది మనస్తత్వానికి సంబంధించినది. లోకంలో తండ్రి కాను అనుకున్న రీతిలో కొడుకులుగా జనించాలని అనుకుంటాడు. శిలాదుడు

భైరవుడు ప్రత్యక్షమయ్యాడు సాధకుడుబిలంమధ్యలోకిలోగా మంటలు చుట్టుకున్నాయి అతని భక్తిని చూచి భైరవుడు వరం కోరుకోమన్నాడు శివుడే తనకు వరమిస్తాడని కదలివెళ్ళాడు అక్కడ ఒక పుణ్యనది కన బడుతుంది అందులో స్నానసంధ్యలు పూర్తి చేశాడు పంచాక్షరిని మూడు అక్షలసార్లు జపించాడు కోటిలింగాలను పూజించాడు పైగా సుంద రాంగనలు వచ్చి స్వాగతం పలికారు సాధకునికి మడుగు వస్త్రాలు, గంధమాల్యాలు, మాణిక్యభూషణాదుల్ని, దివ్యాన్నపానాదు లిచ్చి వైభవంగా సంతోషపెట్టారు.

5.4.6 షష్ఠాశ్వాస కథ :

శ్రీపర్వతపురాణంలోని చేశికాబిలం, కదళీవన ప్రశంస, సాధకుని వృత్తాంతం షష్ఠాశ్వాసంలోని విశేషాలు.

చేశికాబిల ప్రాంతంలో సాధకునికి వీరపుంగవుడొకడు సాక్షాత్క రించాడు అతడు ఒకలక్ష్యంతో జపాలు చేస్తూ శంభుని పూజించాడు ఆవ్యక్తి భానువారంబావిలోని నీరు తాగడానికి కదిలాడు అక్కడ పదకొండుమంది చెలులు సాక్షాత్కరించారు చెలికత్తెలు కూడా నీరు తాగారు చెలులు నీరు తాగడం సాధకుడు చూశాడు ఆపైవారిని అను సరించాడు బంగారు గోపురాలు, బంగారు శివలింగాలుచూచి నమ స్కరించాడు స్నేహభావం కలిగిన చెలులు కనబడ్డారు వారు సాధకుని యోగక్షేమాలు విచారించారు చెలులు బంగ రుగిన్నెలో రసాయనం ఇచ్చారు రసాయన ప్రభావంవల్ల సాధకుడు అమరుడు తాగలిగాడు వినయ వివేక విజ్ఞానం, రూపలావణ్యాలు, విలాసజీవితం సాధకుడు పొందాడు.

ఆపై సాధకునికి కదళీవనంలో అనేకమంది మునులు కనిపించారు వారిని పూజించి పడమరదిక్కు లోగా ఒక బిలం కనబడుతుంది. ఆ

వ్యక్తి ప్రాధాన్యం :

సాధన చేసే వాడు సాధకుడు సాధన దేనికోసం అయినా కావచ్చు. అయితే విద్యకోసం చేసే సాధన ఉత్తమం ఆ విద్య లౌకికం పారలౌకికం అని రెండువిధాలు కాని శ్రీపర్వతపురాణంలోని సాధకుడు చేసిన విద్య పారలౌకికవిద్య మనిషికి చివరి గమ్యం పరమార్థసాన్నిధ్యం ఈసాన్నిధ్యంకోసం పడే ప్రయాణమే జీవితం. సాధకుడు ఆ పరమార్థం చేరుకోవడానికి పడే ఇబ్బందులనేకం ఈదృష్టితో నాగలూటి శేషనాథార్య కవి సాధకుని వృత్తాంతం వ్రాశాడు.

సాధకుని ప్రయాణంలో బిలాలు, వనాలు, సరోవరాలు, కొండలు కోనలు, గుట్టలు మధ్య మధ్య కొన్ని పట్టణాలు కనిపిస్తాయి ప్రాచీన కాలంలో ప్రయాణం చేయడం కష్టం ప్రాకృతికమయిన ఇబ్బందులొక రకానివయితే, జంతువుల బాధలు మరొరకం. అతని ప్రయాణంలో దెబ్బలి అలాంటిది.

ఒక ఆశయంకోసం ప్రయత్నించినపుడు మధ్య మధ్య కొన్ని శక్తులు అడ్డుపడతాయి విష్ణువు మొదలయిన దేవతలనుకూడా లెక్క చేయని (ఆ6-ప94) శక్తులతో సాధకుడు విగ్రహీగవచ్చు కాని అది పతనానికి దారి తీస్తుంది అంచేతనే "పద్మవతి" సాధకుని విడిచిపోటును తిరస్కరించింది ప్రబోధం చేసింది (ఆ6-ప96).

అన్ని జన్మలలో మానవజన్మ గొప్పది 84 లక్షల జీవకోటికి జన్మాంతరం దక్కేది మానవజన్మ కాని మనిషి మానవజన్మలో వికృత చర్యలవల్ల మరల పతనం కావచ్చు సాధకుడు కోతిగా (ఆ5-ప99), చిలుకగా (ఆ6-ప99), తుమ్మెదగా (ఆ5-ప100) మారడం దీనికి దృష్టాంతాలు.

సాధారణంగా తపస్సుకు స్త్రీ భంగకరమైంది సాధకునికి ఆరుగురు స్త్రీలు తారసపడ్డారు. వారిలో ఐదుగురు అనామికలు ఒకతె పద్మవతి కాని ఈ ఆరుగురు అతని ఆశయసాధనకు తోడ్పడినారు సాధారణంగా పురాణాలలో ఈలాంటి కథ కనిపించదు.

మొదటి అనామికవల్ల సాధకుడు తన అపూర్వ జన్మవృత్తాంతం తెలుసుకోగలిగాడు (ఆ5-వ57).

రెండవ అనామిక సాధకునికి ఆహారం అనుగ్రహించి వెంటబడింది (ఆ5-వ86).

మూడవ అనామిక సాధకునికి దివ్యదేహాన్ని ఇచ్చింది అతని కోరికలు నెరవేర్చింది దీనివల్ల సాధకుడు మడుగు వస్త్రాలు, గంధ మాల్యాలు, మాణిక్యభూషణాలు పొందాడు ఆపై సాధకుడు దివ్యాన్న పానాదుల్ని పొందాడు. దీనివల్ల దేవతానుగ్రహానికి మరీ దగ్గరగా వున్నాడని అర్థమవుతుంది.

ఐదవ అనామిక సాధకుని యోగక్షేమాలు అడిగింది బంగారు గిన్నెలో రసాయనం ఇచ్చింది దీనివల్ల సాధకుడు అమరుడుకాగలిగాడు

ఆతవకన్య పద్మవతి ఈపై సాధకుని యోగక్షేమాలు విచారించి విందు ఏర్పాటు చేసింది. అమృతసమానమయిన రసాయనం ఇచ్చింది సాధకునికి దివ్యశరీరం ప్రసాదించింది. దైవత్వంవల్ల విర్రవీగిన సాధకునికి ప్రబోధం చేసింది సాధకుడు గర్వాన్ని వీడిశాంతవ్యరూపుడయ్యాడు సాధకుడు విమల విజ్ఞాన వైభవసంపన్నుడై ఆ చంద్రార్కం దివ్య భోగాలు అనుభవించాడు.

సాధకుడు మార్గంలో వృషభబిలం, కాలబిలం, ఖేచరబిలం, భైరవబిలం, చేతికాబిలం, పద్మవతిబిలాలను బిల్వవృక్షం, కరవీరవనం

కాళవృక్షం, కదళీవనం, ప్రమధ కదళీవనాలను శ్రీశైలస్వామిని, శివలింగాలను, బిల్వేశ్వరుడు, భోగీశ్వరుడు, సూర్యేశ్వరలింగంమూర్తుల్ని సేవించాడు ఈ కథవల్ల శ్రీశైలప్రాంతం పరిసరాలు చెప్పడానికి కవికి వీలయింది.

5.6 వర్ణనలు :

వర్ణన అనగా వర్ణించడం వర్ణస్తుతా (కొనియాడబడునది కొనియాడునది) అని గురుబాల ప్రబోధిక ఏ వస్తువు అయినా సరే దాని బాహ్య ఆకారాన్ని, దాని ఆధారంగా ఉత్పన్నమయ్యే భావాల్ని, అంతరాకారాన్ని, దానిఅధారంగా ఉత్పన్నమయ్యే భావాల్ని వర్ణించడం వర్ణన అవుతుంది. అంతరవర్ణనలు బాహ్యవర్ణనలు అన్నీ వర్ణనకిందకే వస్తాయి. వర్ణనతో కూడిందే కవిత్వమవుతుంది. కవిత్వంలో వర్ణన భాగం.

కవి-కృబ-వర్ణే (వబయోరభేదః) కవయతీతి కవిః-వర్ణించాడు కవి. కాబట్టి వర్ణన అనగా కవిత్వమని, కవిత్వమంటె వర్ణన అని స్పష్టమవుతుంది.

శ్రీపర్వతపురాణంలోని వర్ణనలు మూడురకాలుగా విభజించవచ్చు

1. కథాపరములు
2. కాలసూచకములు
3. రసానుగుణములు

5.6.1 కథాపరములు :

కథ గోడలాంటిది. సన్నివేశాలు గోడలమీద గీసే చిత్రాలవంటివి ఈ సన్నివేశాలవల్ల, వర్ణనలవల్ల కథ ముందుకు సాగుతూ వుంటుంది. కథ ముందుకు సాగడానికి పరిపుష్టికి దోహదం చేసే వర్ణనలు కథాపర,

ములు. సాధారణంగా పురవర్ణనలు, పర్వత వర్ణనలు, సరోవరవర్ణనలు యజ్ఞాలు, పుష్పలావికలు కథావర వర్ణనలవుతాయి.

శ్రీపర్వతపురాణంలోని కథావరవర్ణనలు మూడు రకాలు.

1. పురవర్ణనలు
2. పర్వతవర్ణనలు
3. సరోవరవర్ణనలు

1. పురవర్ణనలు :

ప్రసిద్ధప్రబంధాలలో కథ పురవర్ణనతో మొదలవుతుంది. ఫలానా పాత్రలు ఫలానాచోట ఉన్నవారని నిర్దేశించడానికి ఈ వర్ణనలుదోహదం చేస్తాయి, అంతేకాకుండా కవిచేసే పురవర్ణనలు ఇంచుమించు తాను తన కాలంలో దర్శించిన పురముల ప్రతిరూపంకావచ్చు లేదా కృతిపతిపురము కూడా కావచ్చు. కాని శ్రీపర్వతపురాణంలో పురవర్ణన ప్రారంభంలోలేదు చతుర్థాశ్వాసంలో "చంద్రగుప్తుని పురవర్ణన" ఉంది. అయితే కవి ఆ పురంపేరు చెప్పలేదు.

చంద్రగుప్తపుర వర్ణనలో ఇతరాంశాలకంటె అక్కడి స్త్రీలసౌందర్యానికే ప్రాధాన్యం.

సీ॥ కలుగ వాజనులందు గారిన్యగుణములు
ముదితల వక్షోజము లనెకాని
వక్రగుణంబు లెవ్వారి యందునులేవు
కుటిలాళి వేణుల కురులంగాని
చంచలత్వంబు లేజనుల యందునులేవు
పుష్పకోమలుల చూపులనెకాని
జాడ్యంబులప్పురి జనులందునులేవు
నారీమణుల గమనములగాని

లేములప్పూరి జనులందు లేవు తెరసి
అలరుబోణుల చారుమధ్యముల గాని
యుద్ధ కళ్యాణపదముల కాఠియంబు
పుడమి నీ చంద్రగుప్తికి పురమునాటి? (ఆ4-ప24)

చంద్రగుప్త మహారాజు కుమార్తె చంద్రవతి. ఆమె ఈడేరి సుందరాంగి అయింది. ఒకరోజు చెలికత్తెలతో తిరుగుతుండగా తండ్రిచూసి కుమార్తెపట్ల మరులుగొన్నాడు. దానికి ప్రధాన కారణం వెర్రిలెత్తించే చంద్రవతి సౌందర్యమే. ఆపట్టణంలోని వారంతా విలాసపతులుకావడంవల్ల ఈ విపత్కరస్థితి కలిగిందని భావి కథాసూచకంగా కవి ఈ వర్ణనచేశాడు.

2. శ్రీపర్వతవర్ణనలు :

పర్వతవర్ణనలు రెండురకాలుగా విభజించవచ్చు.

1. దృగ్గోచర పర్వతవర్ణనలు
2. ఊహాపర్వత వర్ణనలు

1. దృగ్గోచర పర్వతవర్ణనలు :

శ్రీపర్వతపురాణంలో మూడుచోట్ల శ్రీశైలవర్ణనలున్నాయి. శ్రీపర్వత వర్ణన తరువాత శ్రీనగవర్ణన అప్పై శ్రీశైల శిఖరవర్ణనలున్నాయి.

మొదటిది శ్రీపర్వతపురాణంలోని ప్రథమాశ్వాసంలోని సనత్కు-మారుడు వ్యాసునికి చెప్పే సందర్భంలో శ్రీపర్వతవర్ణన ఉంది.

ఈ వర్ణనలో శ్రీశైల పరిసరాలలోని శిఖరాలు, శివలింగాలు, మాహాత్మ్యాలు, భక్తులు, జీవకోటులకు ప్రాధాన్యం కల్పించబడింది.

సీ॥ శిఖరంబు జూచిన జేరు గైవల్యంబు
      పురమహత్వంబు బొగడవశమె
గిరి శిరోభాగంబు గిరిజేశ్వరుని మూర్తి
      పురిలింగమహిమలు బొగడవశమె
గిరి లుబ్ధకులు మూర్తి పురాధిపులు
      పురి వీరభక్తుల బొగడవశమె
గిరి జీవకోటులు గీర్వాణనివహంబు
      పురి జీవకోటుల బొగడవశమె
ప్రథిత పృథు పాప సంహారాత్రంతపాగ్ర
గండపాషాణ వాలుకా ఖండవహ్ని
సలిల పవమాన మృగ పవిత్రాంతరాది
ఫలద మహిమోన్నతంబు శ్రీపర్వతంబు (ఆ1-ప67)

రెండవది తృతీయాశ్వాసంలో పరమేశ్వరుడు పార్వతికి చెప్పిన శ్రీనగమాహాత్మ్యం.

శ్రీపర్వత విస్తృతి, చతుర్ద్వారాలు, ఉపద్వారాలు, గవాక్షాలు చెప్పడం ఈ వర్ణనలోని ప్రత్యేకత.

సీ॥ పర్వతభూమి ముప్పది యోజనంబులు
      విడలుపు నిడుపుదద్విస్తృతంబు
క్రమజనాభీష్ట కామ్యప్రదైశ్వర్య
      ధన్యంబులగు చతుర్ద్వారంబులును
గామిత ఫలసిద్ధ కారణసౌఖ్య సా
      ధ్యము లెనిమిది యుపద్వారములును
షోడశ సంఖ్యాత శోభితాలంకార
      కరణములగు గవాక్షములు గలిగి
భుక్తి ముక్తి ఫలోపేత, పుణ్యతీర్థ
శక్తి భైరవశేవకా సంయమీంద్ర

పావనాశ్రమ శివలింగ పరికరాష్ట
శిఖరకోటావిలాసంబు శ్రీనగంబు (అ3-ప4)

మూడవది పరమేశ్వరుడు పార్వతికి చెప్పిన శ్రీశైల శిఖర మాహాత్మ్యం.

శ్రీపర్వతం నలువైపులా ఉన్న ఆలయాలు రౌప్య, మొదలి, మరకత, వజ్రశృంగాలు చెప్పడం ఇందులోని ప్రత్యేకత.

సీ॥ వైడూర్యశిఖరంబు పావనసేవ్యంబు
త్రిపురాంతకంబు నాదేజరిల్లు
బశ్చిమశిఖరంబు బ్రహ్మేశ్వరం బంద్రు
పంకజాసనుడందు బరిఢవించు
మాణిక్యశిఖరంబు మర్త్యగణాకీర్ణ
మది మహేశ్వరమందు రహినుతంబు
శైళవాన్వితము ప్రవాళశృంగంబును
బుష్పశైలము మరుత్పూజితంబు
పావనాకార తాపస ప్రకరభాస్వ
నమర విద్యాధరాప్సరో యక్షసిద్ధ
కిన్నరోరగ గంధర్వ ఖేచరేంద్ర
సేవ్యమానంబు శ్రీశైలశిఖరరాజి (అ3-ప8)

సీ॥ ఉదితస్కంధ సోమేశ్వరంబును రౌప్య
శృంగంబునందువసించు గుహుడు
మొదలి శృంగంబు దేవముని గణోపాస్యంబు
నది హేమశిఖరంబునభినవంబు
మరకత శృంగంబు మధువైరి నిలయంబు
నది యహోబిలనామ మతిశయిల్లు

నానంది మండలంబది వజ్రశృంగంబు
భ్రమధులలో నంది పరిఢవించు
భావనాకార తావన ప్రకటభాస్వ
నమర విద్యాధరావ్సరో యక్షసిద్ధ
కిన్నెరోరగ గంధర్వ ఖేచరేంద్ర
సేవ్యమానంబు శ్రీశైలశిఖరరాజి (ఆ3-ప9)

2. ఊహాపర్వత వర్ణనలు :

సామాన్య మానవులకు కనిపించనిది, మర్దనేత్రాలకు అనుభూతం కానిది, భక్తివిశ్వాసాలకు ప్రతీకరమయినది, చిత్ర విచిత్ర వరిసరాలతో కూడింది. ఊహాత్మకమయిన వర్ణనల కిందికి చేరుతాయి. ఉదాహరణకు వైకుంఠం, కైలాసం, స్వర్గ మర్త్యాలు ఊహాపర్వత వర్ణనలు కిందికి వస్తాయి.

కైలాసనగ వర్ణన :

కైలాసం శివునికి నిలయమయింది. కైలాసానికి భారతదేశంలో ప్రాధాన్యం ఉంది. శ్రీపర్వత పురాణంలోని ద్వితీయాశ్వాసంలో సనత్కుమారుడు శ్రీపర్వతమాహాత్మ్యాన్ని వ్యాసునికిచెప్పేసందర్భంలో కైలాసనగం వర్ణన ఉంది.

కైలాసంలోని మాణిక్యసోపానాలు, భవనాలు,గోపురాలు,రుద్రాక్ష వృక్షాలు, కిన్నెర దేవతా స్త్రీలు మహిమలు, ఇంద్రాది దీపతలు, సంజీవనీ వృక్షాలు చెప్పడం ఇందులోని ప్రత్యేకత.

సీ॥ సురధేను గోష్ఠ సంశుద్ధ రోమాంధ్ర ప్ర
సిద్ధ పావన కన్నచ్ఛేతికలను
దత్తత్రపదీక విస్తర సుధాదీర్ఘికో

పాంత మాణిక్యసోపానములును
స్వర్ణవేది గ్రావబంధ బంధుర హర్మ్య
భవనశోభిత సాలభంజికలను
జారు చామీకర స్థాపిత నవరత్న
కుట్టిమ ప్రాకారగోపురముల
నమరు విద్రుమభద్ర రుద్రాక్ష వృక్ష
పరిచిత్రోన్నిద్ర కల్పద్రు భవనమధ్య
కిన్నరామర యువతి జేగీయమాన
లలిత మహిమోన్నతంబు కైలాసనగము (ఆ2-వ12)

మ॥ అమరేంద్రాది విశాలవైభవ పరిహాసంబు సంజీవనీ
ద్రుమ లీలావన కేకి వాసము సురస్త్రీమాన్సరః కిన్నరీ
ప్రమదాధ్యానము దత్పుధారన వరిభ్రాజత్పృపావాసమున్
బ్రమదోల్లాసము గల్పభూరుహా మనోభావంబు గైలాసమున్
(ఆ2-వ13)

3. సరోవర వర్ణనలు :

శ్రీపర్వతపురాణంలో రెండుచోట్ల సరోవర వర్ణనలున్నాయి.

1. పాతాళగంగ వర్ణన
2. తృణబిందు సరోవర వర్ణన

పాతాళగంగ వర్ణన :

తృతీయాశ్వాసంలో సనత్కుమారుడు శ్రీశైల తీర్థమాహాత్మ్యాలు వ్యాసునికి చెప్పే సందర్భంలో ఈవర్ణన ఉంది. పాతాళగంగయొన్నత్యం మాహాత్మ్యం వర్ణించడం ఇందులోని ప్రత్యేకత.

సీ॥ అనిమిషలోచన యావర్తన తనాభి
వృథురథాంగస్తన ఫేనహార

శృంగార సైకత శ్రీజఘనస్థలి
  వికచ పద్మానన విద్రుమోష్ఠి
కంబు కంధర మధుకర నీలకుంతల
  యంభోజ పుష్ప రసాంగరాగ
మహనీయ కల్లోలమాలికా కరయుగ్మ
  యభిరామ నవకలహంస యాన
తరుణికై వడి నొప్పుపాతక విభంగ
నటదోత్సంగ దురిత పన్నగ విహంగ
భవశిరస్సంగ సేవిత పావనాంగ
తరళ రంగ త్తరంగ పాతాళగంగ (ఆశ్వా-వ-24)

ఈ సందర్భంలో వ్రాయబడిన ఘంటాకుండితీర్థము, సోమన తీర్థము, హాటకేశ్వరతీర్థాదుల ప్రస్తావనలోమహిమల కీర్తనలకేప్రాధాన్య ముంది. కాని ఆలంకారిక వర్ణనలకు ఆస్కారం కల్పించలేదు.

పాతాళగంగ వర్ణనలో మాత్రం శృంగారస్పర్శ కనిపిస్తుంది. వక్త శ్రోతలిద్దరు ఋషులు. శమదమాది సద్గుణశోభితులు. అట్టిమన స్తత్వ కలిగినటువంటి వారి సంభాషణలో స్త్రీల అంగాంగన వర్ణన సముచితం కాదు. అయినా కవి ఈ వర్ణన చేయడంలో ప్రధానంగా మూడు ఉద్దేశాలు కనిపిస్తున్నాయి.

మొదటిది కవికున్న ప్రబంధవర్ణనా ప్రియత్వం. సాధారణంగా ప్రబంధాలలో స్త్రీల కచకుచాది వర్ణనలు చేయడం అనే సంప్రదాయం ఉంది. కవి ప్రబంధ రచనాప్రియుడు. అందువల్ల కవితామయెన్నుకున్న మాహాత్మ్య ప్రక్రియలో కూడా అలవోకగా స్త్రీ వర్ణన చేసివుండవచ్చు.

రెండవది శ్రోత దర్శించింది సామాన్య స్త్రీ సౌందర్యంకాకుండా

అనంతమైన ఊహాతీతమైన అమ్మవారి దర్శనంకావచ్చు. శంకరాచార్యుల లాంటి మహనీయులు కూడా అంబికా ప్రార్థనలో ఈ విధానాన్ని అవలంబించారు.

మూడవది ఈ వర్ణనలో స్త్రీ వర్ణనకు ప్రాధాన్యంలేదు. సరోవర వర్ణనకే ప్రాధాన్యం. సరోవరం రమణీయంగా ఉందని, స్త్రీలాగా ఆకర్షణీయంగా ఉందని చెప్పడంవరకే ఈ వర్ణన.

2. తృణబిందు సరోవరవర్ణన :

తృణబిందు సరోవర ప్రశంస శ్రీపర్వతపురాణంలో పంచమాశ్వాసంలో కనిపిస్తుంది. ఈ సరోవరప్రశంస చేసిన వారు ముని. శ్రోత సాధకుడు. ఈ ప్రస్తావన చేయడానికి ముందుగా "కదలకుమింక గదిలో ధన, కదలితి వేనిపుడు నుమ్ముగానగ రాకుండు" అని ఉపోద్ఘాతం చెప్పి సరోవరాన్ని వర్ణించాడు.

సీ॥ తృణబిందు కర్ద మధీవర పాలిన
  సహితమై తాపసాశ్రమము వోలె
దారుణ బకకంక ధార్తరాష్ట్రి వ్యాప్తి
  నభిమత వ్యాస కావ్యంబువోలె
జిరకాలయుత మహాజీవస్థితియందు
  వరమంత్ర సిద్ధదేవతయు బోలె
గన్పవ మకరశంఖస్ఫూల పద్మ వి
  స్ఫూర్తుల ధననాథుపురము వోలె
బుష్కరోత్ఫుల్ల హల్లక పుండరీక
ఫలిత మకరంద విభ్రమభ్రమణ నికర
గాయకోత్తమ బృందిష్టగాన ఘోష
రూఢసుఖదంబు పుణ్యసరోరుహంబు (ఆ5-ప42)

ఈపద్యంలోని ఉపమలు విశిష్టమైనవి. సరోవరాన్ని తాపస ఆశ్రమంగా, వ్యాస కావ్యంగా, సిద్ధదేవతగా, ధననాథుపురంగా, గానసంహితగా పర్ణించడంలో ప్రత్యేకతలున్నాయి.

సాధారణంగా మునీశ్వరులు తపస్సుకోసం జలస్థావరప్రాంతాన్ని ఎన్నుకుంటారు. కనుక సాధకుడు తృణబిందు సరోవర ప్రాంతంలో ఉండవచ్చని సూచించడానికి "తాపసాశ్రమం వోలె" అని వివరణ.

ఇక తెలుగువారికి ప్రియమైంది భారతం. భారతంలో లెక్క లేనన్ని పాత్రలున్నాయి. ఆ పాత్రల మనస్తత్వాలు చాల విచిత్రమయి నవి. ఒక్కొక్క పాత్రచిత్రణ సుందరమేకాకుండా విశిష్ట ప్రయోజనాలు కలిగింది. అలాగే ఈ సరోవర ప్రాంతంలో విశిష్టమయిన అనుభూతులు కలగడానికి అవకాశం ఉందని చెప్పడానికే వ్యాసకావ్యమని ఉపమానం అంతేకాకుండా కవికున్న భారతానురక్తి ఇందులో స్పష్టమవుతుంది.

ఇక మంత్రంవల్ల దేవతలు ఆహ్వానించబడతారు. నిరంతరజపం వల్ల దేవతలు సాక్షాత్కరించి అభీష్టం చేకూరుస్తారు. అభీష్టసిద్ధికి అనేక చోట్ల అనేకవిధాల ఆటంకాలున్నాయి. కాని ఈ ప్రాంతంలో ఆటంకాలకు ఏ మాత్రం అవకాశంలేదని చెప్పడానికే "మంత్రసిద్ధదేవతలను బోలె" అని ఉపమానం.

ఇక "ధననాథుపురము వోలె" అనడంలోకూడ ఔచిత్యం ఉంది. ఈ సరోవరం పాతాళలోకానికి మార్గం. ఈ మార్గంలోనే శంకరి పట్టణం ఉంది. శంకరునికి నెచ్చెలికాడు కుబేరుడు. స్నేహితులు కలిసి మెలిసి ఉండడం, కనుచూపుమేరల్లో నివాసం ఏర్పాటు చేసుకోవడం సహజం. ధననాథుని పట్టణం అలకాపురం. అలకాపురంలో సంపదలకు కొదువలేదు అలాగే ఈ సరోవరప్రాంతంలో ఏలాంటి సంపదలకు కొదువలేదని చెప్ప డం. క్రమంగా శివకారుణ్యంకూడా లభిస్తుందని సూచన.

శివుడు నాదప్రియుడు తృణబిందు సరోవర ప్రాంతంలో రమ్య వనాలున్నాయి. అక్కడి పూలతోటలో తుమ్మెదలు విన్నలవిడిగా తిరుగు తున్నాయి. మకరందంకోసం వచ్చారుతూ వీనులవిందుగా రొద చేస్తు న్నాయి. ఈ సవ్వడి తమ గానంతో శివుని అర్చిస్తున్నట్లుగా ప్రేక్షకులకు భావకులకు కవి ఇచ్చిన సూచన.

5.6.2 కాలసూచకములు :

ప్రబంధాలలో సాధారణంగా సూర్యోదయం, చంద్రోదయం, వసంతర్తు వర్ణనలు కాలాన్ని సూచించేవి. ఇతర కావ్యాలకంటె ప్రబంధా లలో ఈ వర్ణనకు ప్రాధాన్యం ఎక్కువ. శ్రీపర్వతపురాణంలోని పంచమా శ్వాసంలో సూర్యోదయవర్ణన భంగ్యంతరంగా ఉంది.

సూర్యోదయవర్ణన :

కాశవృక్షవర్ణన ప్రధానాంశం. సూర్యోదయవర్ణనద్వితీయాంశం

సీ॥ తుదల నర్కాంశులు దోపంగ నీకాడి
తుదయాకులును మొట్టతుదలదోచె
మొదయాదిదీధితు లొదవంగ నీద్రుమాను
మొదయాద్రిద్రుమాగులు వ ద్దమించె
మొదల మయూఖముల్ మొలవనీ వృక్షంబు
మొదలి పత్రంబుల మోసులేసె
కొదమ సూనూగు పేగొనలు దేవులు సాగ
దుది మోసులాకులు దొంగలించె
కొదలి భానుండు సుదయింప భూరుహంబు
పేర్చి యంతంత నుప్పన బెరిగి దివికి
వినుత లింగార్చన క్రియాపేళ భక్తి
రీతి నుండిని నిష్ఠాగరిష్ఠమునను (ఆ5-ప72)

ఈ పద్యంలో నాలుగు అంశాలున్నాయి.

మొదటిది సూర్యోదయ వర్ణన సూర్యోదయానికి పూర్వం ఎర్రదనం ఆకాశంలో కనిపించడం, కిరణాలు పటురించుకొని వ్యాపించడం కిరణాలలో కాంతి పుంజుకోవడం, ఆ తరువాత తీక్ష్ణత నిలదొక్కుకోవడం అనే అంశాలున్నాయి.

ఇక రెండవది వృక్షవర్ణన. చెట్టుగాని, మొక్కగాని పెట్టిన కొద్దికాలానికి తొలిఆకులు కనబడడం తరువాత పక్కఆకులు, మొదలిఆకులు రావడం చెప్పబడింది. కవికున్న ప్రకృతి పరిశీలనాశక్తి వ్యవసాయ ప్రియత్వం దీనివల్ల ఋజువవుతుంది.

మూడవది శ్రీశైలప్రాంతంలో ఆనాటికి తాళవృక్షాలు ఎక్కువగా ఉన్నాయని చెప్పడం.

నాలుగవది తాళవృక్షం ఏపుగా దివి తాకునట్లు పెరిగిందని చెప్పడంవల్ల సాధకుని లక్ష్యసాధనలో అతని ఔన్నత్యం సూచించబడింది.

వసంతర్తు వర్ణన :

శ్రీపర్వతపురాణంలో చతుర్థాశ్వాసంలో వసంతర్తు వర్ణన ఉంది. చంద్రవతి సఖులతోకూడి శివపూజకోసం పూలవనం చేరింది. ఆ సమయంలో కవి–

సీ॥ బాలాళి నివహంబు బాలాళి భంగిని
　　లతలపై నిల్చి యూరడుల సేయ
కోయిల జవ్వనులల్ కూడి కుహూకార
　　కాహళధ్వనులు చొక్కముగ బూన
రాయంచలేములు రహినిల్వబొగడంగ
　　రాచిల్క జవరాలు రామనంగ

పులయానిలుందును మందమార్గంబున
　　　నలతాళికుని భంగి నటనజూప
సంభ్రమంబున మంజరీ ప్తవము లొరయ
వైభవంబున గరపల్లవముల సాచి
తరులతాంగన చెలగి నర్తనము సలుప
నంతకంతకు వనలక్ష్మి యతిశయిల్లె (అ4-ప39)

అని వసంతర్తు వర్ణన చేశాడు.

స్వాగతం చెప్పడం హైందవసంప్రదాయం, స్వాగతసమయంలో స్త్రీలు హారతులు పట్టడం, మంగళతూర్య నాదాలు మోగించడం, పొగుడుతూ పాటలు పాడడం, సంతోష పారవశ్యంతో నటించడం సంప్రదాయం. వనలక్ష్మి ఆగమనానికి తుమ్మెదలు, కోయిలలు, రాయంచలు, పిల్లగాలి, పూలగుత్తులు, చిగురులు సంతోషం వ్యక్తం చేస్తాయి. ఈ రెండుభావాలను ఏకంచేసి కవి వసంతర్తు వర్ణనచేశాడు.

ఋతువులలో వసంతం శుభ్రవదం. శోభావంతం. సంవత్సరానికి ఆది వసంతఋతువే. ఆ ఋతువనర్ణపల్ల కవి వ్యక్తం చేయదలచుకొన్న విశేషాలు మూడు.

మొదటిది గెర్ర గీసుకొన్న ఒక వాతావరణంనుండి చంద్రవతి బయటపడింది. ఈ వసంతంతో ఆవిడ జీవితంలో నూతన అధ్యాయం మొదలయిందని కవి సూచన.

రెండవది చంద్రవతి ఒక రాజకన్య. లక్ష్మిలాగే సౌందర్యవతి. ఆమె సంపదలకు కొదువలేదు. వనంలో తిరిగే లక్ష్మిలాగ చంద్రవతి తిరిగింది. నగరంలో రాజకన్యచుట్టూ పరివారమున్నట్లే వనంలోకూడా చెలికత్తెలు, జవ్వనులు, ఉన్నతాంగనలు, జవరాండ్రు వినోదాలతో

మరిపించేవారు, స్వాగతం పలికేవారున్నారని పైపద్యంవల్ల కవి సూచింపచేశాడు.

మూడవది ఈ కథలో చంద్రవతి శ్రీశైలేశ్వరునికి చేసే హారతి పూజ, వాద్యవినోదాలు, సంగీత సమారాధన మొదలయినవి కూడా ఈ పద్యంవల్ల సూచితం.

5.6.3 రసానుగుణములు :

వస్తువు ముడిసరుకులాంటిది. నిపుణుడయిన వ్యక్తి వస్తువును రమ్యంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నానికి శిల్పమనిపేరు. ఈ శిల్పంలో రసానుగుణవర్ణనలు ఒకభాగం. ప్రకృతిలోని కొన్ని వస్తుసముదాయాల్ని చూచినపుడు మానసికంగా చలనం కలగవచ్చు. ఈ వికారం అకస్మికంగా కలిగేదికాదు. వాసనరూపంలో అంతస్సత్వంలో నిగూఢంగా దాగి వుండేది. ఈలాంటిది కావ్యవర్ణనలోను ఉంటుంది. కథ చదివినపుడు ప్రేమ, రతి, ప్రణయం, హాసం, జుగుప్స అనే పేర్లతో చెప్పబడే మధురమయిన భావనలన్నీ ఈలాంటివి. ఈ మధురమయిన భావనలు హృదయక్షేత్రంలో అంతర్గంగా ఉన్నా కావ్యపఠనం లేదా దర్శనం అనే వాతావరణం ప్రభావంచేత మొలకెత్తుతాయి శ్రీపర్వతపురాణంలో మాత్రం రసానుగుణవర్ణనలు కనిపిస్తాయి.

శృంగారరస వర్ణన :

శృంగమనగా "మన్మథోద్భేదము". భోజుడు "శృంగార ఏవ ఏకో రసః" (శృంగారమొక్కటే రసం) అని సిద్ధాంతీకరించాడు. శృంగారరసానికే "అభిమానరసం, అహంకారరసం" అనే పేర్లున్నాయి "రతి ప్రభావః శృంగారః" (రతివలన శృంగారంపుట్టును)అని కొందరి అభిప్రాయం.

శుభ్రంగా, పవిత్రంగా, ఉజ్జ్వలంగా, చూడ ముచ్చటయిన వస్తువును శృంగారంతో పోలుస్తారు. హృదయంగమంగా, ఉజ్జ్వలమయంగా ఉండడంవల్ల శృంగారరసంగా పేరుపొందింది. శృంగార రసం నిండు యౌవ్వనంలో ఉండే స్త్రీ-పురుషులకు సంబంధించి ఉంటుంది.

శ్రీపర్వతపురాణంలో పురుషుల శృంగారం ఆకారవర్ణనలు లేవు. స్త్రీల వర్ణనలు మాత్రమున్నాయి.

1. రాజకన్య వర్ణన
2. దేవభామిని వర్ణన

రాజకన్య వర్ణన :

శ్రీపర్వతపురాణంలోని చతుర్థాశ్వాసంలో చంద్రవతి వర్ణన ఉంది. చంద్రవతి చంద్రగుప్త మహారాజు కూతురు. చంద్రవతి బాల్యంనుండి శివభక్తురాలు. చంద్రవతి రూపవతి గుణవతి. ఆమె యుక్తవయస్కురాలయింది.

చంద్రవతి ఈడేరి రూపవతిగా రాణించే సందర్భంలో కవి చంద్రవతి రూపవర్ణనలను నాలుగు పద్యాలలో చేశాడు. సాధారణంగా ప్రబంధాలలో స్త్రీల అంగాంగవర్ణన ఉంటుంది. కాని నాగలూటి శేషనాథార్య కవి సంగ్రహముగా చంద్రవతి వర్ణన చేశాడు. దీనికి ప్రధానంగా మూడు కారణాలూహించవచ్చు.

మొదటిది కవి పురాణశైలికి అలవాటుపడినవాడు కావడం,

రెండవది ప్రబంధ రచనే పరమార్థంగా నడుం కట్టినవారు కాకపోవడం.

మూడవది ఇతర్రతాకుండా కథకు, పాత్రకు అవసరమైనంత వర్ణనలు చేయడమే లక్ష్యంగా కలిగినవారు కావడం.

చంద్రవతి రూపవర్ణనలు రెండురకాలు మొదటిది అంగవర్ణనకు సంబంధించింది. ఒక స్త్రీ అంగాంగవర్ణన చేయడం ఈ వర్ణనలో చేరు తుంది. కవి చంద్రవతి మాటల్ని, చూపుల్ని వర్ణిస్తూ ఆపై కుచవర్ణనలు చేశాడు. ఇతరాంగాల వర్ణనలులేవు.

కం॥ చెలిబోలను పలుసుమాటలు
పలుకకు మగమీలు కనుగవకు సరియగునే
పులికుట్టు మాటలేటికి
కలకంఠి కుచోపమలకె కనకఘటంబుల్ (ఆ4-వ11)

ఇక రెండవది సంపూర్ణఆకారానికి సంబంధించినది. మిగతావాటిలో కాంతికే ప్రాధాన్యం ఇచ్చాడు. విద్యుత్కాంతి (ఆ1-వ9), ఘనకాంతి, రత్నప్రదీపం (ఆ4-వ12) మొదలయినవి కాంతికి సంబంధించినవి. అతిలోకమైన కాంతి, శబ్దం రెండూ మనుష్యుల్ని తొందరగా తనవైపు లాక్కుంటుంది. ఈ ఆకర్షణస్వభావాన్ని కవి లోకజ్ఞతను గుర్తించి వ్రాశాడు. అంతేకాకుండా ఈ వర్ణనలో మరో రెండు అంశాలున్నాయి.

మొదటిది చంద్రవతి అపుడపుడే యౌవనంలో అడుగుపెట్టిన స్త్రీ. ఆ ప్రథమదశ వర్ణనలో సంపూర్ణతకు అవకాశంలేదు కనుక కవి సంగ్రహంగా వర్ణించవలసి వచ్చింది.

రెండవది తండ్రి అయిన చంద్రగుప్తుడు యౌవనదశలో అడుగు పెట్టిన చంద్రవతిని చూచి తబ్బిబ్బుపడ్డాడు. పరిచితమయిన వస్తువు వింతకాంతులతో ప్రకాశించేటపుడు అది విలాసానికి దారితీస్తుంది. అదిగాక మన్మథునికి స్త్రీ పురుషులనే రెండువర్గాలుమాత్రం తెలుసు. అతనికి

వావివరుసలతో పనిలేదు. ఆ మన్మథుడే–సరస్వతీ చతుర్ముఖులనుకూడా క్షణకాలం తబ్బిబ్బుల్లో పడవేసినాడు. అందువల్ల చంద్రగుప్తునంతటి వాడుకూడా చంద్రవతిపట్ల ఆకర్షితుడు కాగలగడం విడ్డూరంకాదు.

చంద్రవతీ చంద్రగుప్తుల శృంగారం నీతిబాహ్యం. నిందార్హం. పైగా చంద్రవతి విసీమిరా ఒప్పుకోలేదు. అందువల్ల ఇది రసాభాస వర్ణన.

2. దేవభామిని వర్ణన :

శ్రీపర్వతపురాణంలోని షష్ఠాశ్వాసంలో పద్మవతి కాంత వర్ణన ఉంది.

సాధకుడు పద్మవతిబిలం చేరాడు. అక్కడ ఒక "నగారా" కన బడుతుంది. దాన్ని వాయిస్తే పద్మవతి కన్య ప్రత్యక్షమయింది. ఈ సందర్భంలో కవి పద్మవతి వర్ణన సంగ్రహంగా చేశాడు.

సీ॥ మరువంపుదిమ్మెయో, మావి పూగొమ్మయో
మత్తచకోరమో, మదనుకరమొ
కందర్పుదంతియో, కల్పపూబంతియో
కనకంపుదిగెయో కాంతబాగు
హాలతియో పచ్చకప్పురపు శలాకయో
కోమలమో కారు క్రొమ్మెఱుంగో
రాజానురూపమో రత్నప్రదీపమో
యనయనంగ నల్లన యభినుతింప
గనక కంకణ ఝణఝణత్కారములును
రత్నకలిత నూపురారావములును
దంతకాంతులు చెక్కుటద్దముఁదీప్తు
లంతకంతకు నొండొంత నతిశయిల్ల (ఆ౬-ప90)

పద్మావతి సాధకుని యోగక్షేమాలు, కల్లిదండ్రుల వివరాలు అడిగింది. ఆమె ఫలరసభక్ష్యాలతో సాధకునికి విందు ఏర్పాటు చేసింది, సాధకునికి అమృతంతో సమానమయిన రసాయనం ఇచ్చింది. దివ్య శరీరాన్ని ప్రసాదించింది. దైవత్వం పొందిన సాధకుడు ఇంద్రాదుల్ని లెక్క చేయలేదు. సాధకుని గర్వాన్ని చూసి పద్మావతి ప్రబోధం చేసింది. సాధకుడు గర్వాన్ని విడనాడి శాంతస్వరూపుడయ్యాడు. విమల విజ్ఞాన వైభవసంపన్నుడై ఆ చంద్రార్కం దివ్యభోగాలు అనుభవించాడు.

చంద్రవతి వర్ణనకు, పద్మావతి వర్ణనకు చాలా తేడాలున్నాయి.

చంద్రవతి మానవకన్య పద్మావతి దేవకన్య. చంద్రవతి యౌవన ప్రథమదశలో అడుగుపెట్టిన స్త్రీ పద్మావతి నిండుయౌవన చంద్రవతిని దర్శించినవాడు కాముకుడయిన తండ్రి పద్మావతిని దర్శించినవాడు సాధకుడు చంద్రవతి చంద్రగుప్తుని కోరిక తీర్చలేదు మందలించింది. పద్మావతి అడగకుండగనే రసాయనం అందించింది, ఇంద్రాదుల్ని తూలనాడడం తప్పని ప్రబోధించింది. ఆరాధ్య అయిన స్త్రీని తేరిపార చూడడం తప్పు అందుకే కవి ఇక్కడ అందులో వర్ణన చేయలేదు. సామాన్యులకంటె దేవతలు ఆకారంచేత, వర్ణనచేత భిన్నమయినవారు అందువల్ల వారి అతిలోకసౌందర్యం చెప్పడమే కవి ఆశయం.

రౌద్రరస వర్ణన :

రౌద్రరసం క్రోధం అనే స్థాయిభావంనుండి పుడుతుంది.

"శత్రుకృతాప చారేణ మనః
ప్రజ్వలనం క్రోధః"

శత్రువులు చేసిన అపచారముచే మనస్సులో ప్రజ్వలించేది క్రోధము అని ప్రతాపరుద్రీయం.

రౌద్రరసం రాక్షసుల దానవుల, ఉద్ధతమనుష్యుల ప్రకృతులకు సంబంధించి ఉంటుంది. అయితే ఇదిమాత్రం జంతువుల్లోస్వాభావికంగా ఉండవచ్చు. సింహం, పులి, ఏనుగు మొదలయిన జంతువులు మానవులపై ఎగబడి రావడంలో రౌద్రం స్పష్టం.

శ్రీపర్వతపురాణంలో పంచమాశ్వాసంలో బెబ్బులి వర్ణన ఉంది. సాధకుడు భైరవబిలం ప్రవేశించాడు. భైరవుడు పులిరూపంలో బిలం దగ్గర ఉన్న సందర్భంలో బెబ్బులి వర్ణన కవి చేశాడు.

సీ॥ జిత దైత్య కరవాల జిహ్వాసొగగ నిల్పి
    యాయూత వదన గహ్వరము దెఱల
బ్రహ్మాండకర్పర గ్రాసకబుద్ధిని
    భీకరాకృతిని నేచి బిట్టులాడు
గండ మహేంద్ర సంఘాతంబు లూటాడ
    నిశ్వాస పవనంబు నిండనిగుడ
ఘుట ఘుట ధ్వని శైలగుహాలు చిల్లులు వోవ
    నింగినాకవ కద్రువంగ రొప్ప
నెడద కొనిచూచు కన్నులురుల మెఱయ
బద్ధమాత్సర్య విక్రమోపాక్రమాత్మ
భగ్ననిర్భర విభ్రమ భృకుటవేళ
ఘూనధో వ్యాప్తి శార్దూల పుంగవుడు (అ5-ప111)

చ॥ కరులమదంబు కేసరి నికాయము కోపమశేష వృశ్చికో
త్కర విషకాలముల్ శిఖి శిఖాతతి వేడిమి వాయుతీవ్రముల్
సురరిపురాజు తీవ్రతయు బొక్కముగా నొకరూపు దాల్చిని
ర్భరగతి నిల్చి బెబ్బులి యభంగురదర్పమహోగ్రమూర్తియై
(అ5-ప112)

ఉ॥ హొంఛదుచు బుగ్గలింపుచు వఖోగతి దాటుచు మీఁటిపొటిచున్
ద్రెవ్వొగుచు నావులింపుచును మూల్గుచు మీసము లోరగించి తా
నంగముసాచి నిల్చి యలిశాగ్రము సుక్కడ వారమార్చున్
ముంగల జిహ్వసాగుడి మూతులు నాకుచు హ త్తరింపుచున్
(ఆ5-ప113)

సాధకుడు పులితో పోరాడాడు. పులి నేలకొరిగింది భైరవుడు ప్రత్యక్షమయ్యాడు ఈ వర్ణనలో రెండు అంశాలున్నాయి. మొదటిది ఇది సామాన్యమయిన పులికాదు భైరవుడే పులి కావడం.

రెండవది రూపాంతరంపొందినపుడు ఆకారంలో తేడా ఉండవచ్చు కాని స్వభావంలో తేడా వుండదు. అయినా ద్విగుణీకృతం అవుతుంది.

క్రోధ ప్రదర్శనలో రెండు దశలున్నాయి.

మొదటిదశలో అవయవిక, సంచలనం, నాలుక చాచడం భీకరాకృతితో దూకడం, బుసలుకొట్టి నిట్టూర్పులు, జీవరాశుల్ని భయకంపితుల్ని చేసే గర్జన మొదలయినవి క్రోధానికి తొలిమెట్టు.

రెండవదశలో ఎదుటివారిపై కలియబడడం, బుగ్గలించడం, ఆకాశం దద్దరిల్లేటట్టు తిరగడం, ఆవులించడం, మూల్గడం, మీసాలు సరిచేయడం, మూతినాక్కోవడం క్రోధానికి రెండోమెట్టు.

నాగలూటి శేషనాథార్యకవి బెబ్బులి వర్ణనచేయడానికి కారణాలు మూడు.

మొదటిది శైవంలో వ్యాఘ్రానికున్న ప్రాధాన్యం చెప్పడం- వ్యాఘ్రేశ్వరుడు లాంటిపేర్లు శివునికి ఉండడం, శివుడు వ్యాఘ్రాసనాసీనుడు కావడం మొదలయినవి.

రెండవది కవికున్న ప్రకృతివర్ణన ప్రియత్వం. ఇందులోనే శ్రీశైల పర్వతవర్ణన, వ్యాఘ్రమన్వఖావాదులు చేరుతాయి.

మూడవది ఇటువంటి బెబ్బులితో పోరాడంవల్ల సాధకుని చిత్తశుద్ధి, దృఢదీక్ష వ్యక్తమవుతుంది శ్రీశైలాన్ని చేరుకోవడంలో ఏర్పడే అవరోధాలు చెప్పడంకూడా ఇందులోని ప్రధానాంశాలు.

5 7 పాత్రచిత్రణ :

ఒకకవి పాత్రచిత్రణ తెలుసుకోవడంలో మూడు అంశాలున్నాయి మొదటిది కావ్యంలోని పాత్రల వర్గీకరణ రెండవది పాత్రలు ఏ లక్ష్య సిద్ధికోసం పాటుపడుతున్నాయో విశ్లేషించడం మూడవది కవి ఏపద్ధతు లతో పాత్రచిత్రణ చేస్తున్నాడని పరిశీలించడం.

5.7.1 శ్రీపర్వతపురాణంలోని పాత్రలు :

శ్రీపర్వతపురాణంలోని పాత్రల్ని అనేకరకాలుగా వర్గీకరించవచ్చు లైంగికవిభేదదృష్ట్యా స్త్రీ పాత్రలు, పురుషపాత్రలు, వసుమతి, చంద్రవతి, పద్మవతి మొదలయినవారు స్త్రీ పాత్రలుకాగా, సనత్కుమారుడు, వేదవ్యాసుడు, శిలాదుడు, నందీశ్వరుడు, పర్వతుడు, చంద్రగుప్తుడు తపస్వికరవీరుడు, సాధకుడు పురుషపాత్రలు.

శ్రీపర్వతపురాణంలోని పాత్రలు వర్ణవిభేదదృష్ట్యాకూడా వర్గీకరించవచ్చు చంద్రగుప్తుడు చంద్రవతి క్షత్రియపాత్రలు. మిగిలిన వారు క్షత్రియేతరులు.

5.7 2 పాత్రలలక్ష్యం :

ప్రతిపాత్రకు ఒకలక్ష్యం ఉంటుంది ఆ లక్ష్యసాధనకు సన్నివేశాలు సహకరిస్తుంటాయి.

శ్రీపర్వతపురాణంలోని పాత్రసృష్టి శ్రీనగమాహాత్మ్య ప్రకటనకో లేదా శ్రీశైవానుని ఆధిక్యతా నిరూపణకో ఎన్నుకోబడిన పాత్రలుగా చెప్పవచ్చు. కథాగతికి బట్టిపాత్రచిత్రణ సాగుతుంటుంది

శ్రీపర్వతపురాణంలోని కథాచక్రంలో ప్రధానంగా నాలుగు చక్రాలున్నాయి మొదటి చక్రం పురాణ ప్రశంస కారణాలు నిరూపించే చక్రం శ్రీపర్వతపురాణ శ్రోత వేదవ్యాసుడు వక్త సనత్కుమారుడు సనత్కుమారుడు బ్రహ్మసుతుడు వేదవేత్త ఆధ్యాత్మికరహస్యాలు తెలిసిన మహామౌని అలాంటి మునిదగ్గరకు ఒకనాడు కృష్ణద్వైపాయనుడు శిష్యసమేతుడై వచ్చాడు వ్యాసుడు మూడు లోకాలలో పుణ్యభూమి ఏదో చెప్పవలసిందిగా ప్రార్థించాడు సనత్కుమారుడు సంతోషిస్తూ "నీవడిగిన అర్థము శైవాగమ వేదశాస్త్ర సమ్మతం జగత్పావనకరం (ఆ1-వ62) పుడమిలో పుణ్యభూమి శ్రీపర్వతమే శ్రీపర్వతపురాణశ్రవణం వల్లభోగమోక్షాలు రెండుదక్కుతాయి. శ్రీపర్వతం సామాన్యమయింది. కాదు ఒక్కొక్క శైలానికి ఒక్కొక్క మాహాత్మ్యం ఉన్నప్పటికీ శ్రీశైల మాహాత్మ్యం అన్నిటికన్నా మిన్న అని సనత్కుమారుడు వేదవ్యాసునికి వివరించాడు వక్తశ్రోతల ప్రశ్నోత్తరాలద్వారా శ్రీనగ శ్రీశైలవాస సంకీర్తన జరిగిందని ఫలితార్థం.

ఇక రెండవచక్రంలో శిలాద పర్వత నందీశ్వరులున్నారు శిలాదుడొక ముని అతడు రోజూ ఒక్కరాయి తింటూ శతకోటి సంవత్సరాలు హరయోగంతో శివుణ్ణి ఉద్దేశించి తపస్సు చేశాడు శిలాదుడు సంతాన కాంక్షాపరుడు ఇతని సంతానం పర్వత నందీశ్వరులు.

పర్వత నందీశ్వరులు కూడా శివుణ్ణి ఉద్దేశించి ఘోర తపస్సు చేశారు నందీశ్వరుడు శివునికి వాహనంగా ఉండాలని, శివునికి చేరువ

రావాలని ప్రయత్నించి సఫలీకృతుడయ్యాడు అలాగే పర్వతుడుకూడా శివుడు తన శిరస్సుపై నిలవాలని ప్రయత్నించి కృతకృతుడయ్యాడు శిలాదుని సంతానమంతా శివసాన్నిధ్యం కోరుకోవడం ఇందులోని విశేషం.

ఇక మూడవ చట్టంలో వసుమతి చంద్రవతి పాత్రలున్నాయి వసుమతి మునికన్య సుకుమారిఅందగత్తె అయినా భర్తురాలు బ్రహ్మను ఉద్దేశించి ఘోర తపస్సు చేసింది స్వామి ప్రత్యక్షమయ్యాడు వరం కోరుకోమన్నాడు తాను వసుమతి కనుక శ్రీనామం ప్రసాదించవల సిందిగా కోరింది బ్రహ్మ అనుగ్రహించాడు వసుమతి శ్రీదేవి అయింది శ్రీదేవి పర్వతేశ్వరుని కొలుస్తూ కాలం గడిపింది శ్రీదేవి ఆ పర్వతంలో స్థిరనివాసంఏర్పరచుకోవడంవల్ల శ్రీనగం అనేపేరు రావడానికి వసుమతి కారణమయింది.

చంద్రమతి చంద్రగుప్త మహారాజు కూతురు చంద్రవతి బాల్యం నుండి శివభక్తురాలు చంద్రవతి రూపవతి గుణవతి ఆమె యుక్త వయస్కురాలయింది భూలోకంలో చంద్రవతిని మించిన రూపవతులు లేరని చెలికత్తెలు పొగిడారు చెలికత్తెలతో కలిసి తిరిగే చంద్రవతిని చూచి ఆమె తండ్రి మరులుగొన్నాడు అతని చూపులోని మార్పును చంద్రవతి గుర్తించింది దీనికి కారణం తండ్రికాదని కాముడే కారకుడని భావించింది కాముణ్ణి జయించాలని "కామారి"ని స్తుతించింది చంద్రవతి శ్రీపర్వతలింగాన్ని భక్తితో సేవించింది శివుడు ప్రత్యక్షంకాగా "మల్లి కార్జునుడు" అనేపేరుతో అవతరించమని స్వామిని కోరింది. స్వామి అనుగ్రహించాడు ఈ విధంగా శ్రీగిరి మల్లికార్జునుడని విఖ్యాతిరావడానికి కారకురాలు చంద్రవతి.

ఒకవ్యక్తి విఖ్యాతికి భక్తులు దోహదకారులు. శ్రీనగ ప్రశస్తికి

శ్రీగిరి మల్లికార్జున విఖ్యాతికి వసుమతి, చంద్రవతివంటి స్త్రీలే కారకులు కావడం ఇందులోని విశేషం.

ఇక శ్రీపర్వతపురాణంలోని నాలుగవచట్రంలోసాధకునికథచెప్పేకొ దగిగింది సాధకుడు అనే భక్తుడు మూడువృక్షాలమహిమ తెలుసుకోవాలని అనుకున్నాడు సాధకుని ప్రయాణంలో తారసపడిన వారు మూడురకాల వారు.

1 వన్యజంతువులు :

వనంలోని జంతువులు వన్యజంతువులు ఏనుగు పులి లాంటివి.

2 తాపసులు :

వీరుకూడా రెండురకాలవారు మాయామునులు సహజ తపస్సంపన్నులు మాయామునులు తపస్సుదారి పట్టించేవారు కాగా, సహజ తపసంపన్నులు సాధకుని ప్రయాణానికి ఆశీస్సులందించారు. వీరందరి సహాయాలతో సాధకుడు విచిత్ర భూరుహ సందర్శనం చేశాడు.

దేవాంగనలు :

సాధకుని ప్రయాణంలో ఆరుగురు స్త్రీలు తారసపడ్డారు వారిలో ఐదుగురు అనామికలు ఒకతె పద్మవతి.

మొదటి అనామికవల్ల పూర్వజన్మవృత్తాంతం తెలుసుకోగలిగాడు

రెండవ అనామిక సాధకునికి ఆహారం అనుగ్రహించి వెంటబడింది

మూడవ అనామిక సాధకునికి దివ్యదేహాన్ని ఇచ్చింది. ఇతని కోరికలు నెరవేర్చింది.

నాలుగవ అనామికవల్ల సాధకుడు మధుగువస్త్రాలు, గంధ మాల్యాలు, మాణిక్యభూషణాలు పొందాడు.

ఐదవ అనామిక సాధకుని యోగక్షేమాలు అడిగింది బంగారు గిన్నెలో రసాయనం ఇచ్చింది.

ఆరవకన్య పద్మవతి ఈమె సాధకుని యోగక్షేమాలు విచారించి అమృతతుల్యమయిన రసాయనంఇచ్చింది దివ్యశరీరం ప్రసాదించింది దైవత్వంవల్ల విరబీగిన సాధకునికి ప్రబోధం చేసింది. సాధకుడు గర్వాన్ని వీడి, విమల విజ్ఞాన వైభవసంపన్నుడై ఆ చంద్రార్కం దివ్యభోగాలు అనుభవించాడు.

5.7.3 పాత్రచిత్రణా పద్ధతులు :

పాత్రచిత్రణ అనేకరకాలు. శ్రీపర్వతపురాణంలో మాహాత్మ్యకథనం ముఖ్యం అందువల్ల ఇందలి పాత్రచిత్రణలో స్వరూపచిత్రణ, స్వభావ చిత్రణ అనే రెండు భాగాలే కనిపిస్తాయి.

5.7.3.1 స్వరూపచిత్రణ :

స్వరూప చిత్రణ అంటే శారీరకవర్ణన.

నాటకంలో అయితే పాత్ర రంగప్రవేశం చేయగానే అతని ఆకారం ప్రేక్షకులకు అవగతం అవుతుంది శ్రవ్యకావ్యాలలో కవి పాత్రల శారీరక వర్ణన చేయక తప్పదు ఒకరాజు సభాప్రవేశం చేరబోతుండగా వందిమాగాధులు అతన్ని కీర్తించడంలాంటిదే ఈ స్వరూప చిత్రణ శేషనాథార్యకవి వేదవ్యాసుని వేషాన్ని, శిలాదునికి ఈశ్వరుడుప్రత్యక్షం కావడాన్ని, చంద్రవతి రూపవర్ణనను ఈ పద్ధతిలోనే చేశాడు వీటిలో సాధారణంగా విశేషణాల జోడింపు ఉంటుంది. అరుదుగా అలంకార ప్రయోగం ఉండవచ్చు.

సీ॥ ప్రస్తుతాలంకార భసిత త్రిపుండ్రముల్
ఫాలభాగంబుల బ్రజ్వరిల్ల
రుచిరమంత్రప్రోక్త రుద్రాక్ష మాలికా
నివహంబు మేనుల నిండదాల్చి
భాస్వజ్జటాజూట పటలీ భరంబుల
య్యవటు స్థలంబుల నత్తమిల్ల
గటి తటంబుల నీరుకావి దోవతులూన్చి
సజ్జల శివలింగ సమితిదాల్చి
ముదముదేజంబు మెరయుంగ మునిజనంబు
ఉభయ పార్శ్వంబులను విశేషోక్తులందు
జీవ పరమాత్మ తత్త్వైకసిద్ధమైన
తత్త్వమస్యాది సూత్రులందఱు వరించి (ఆ1-ప50)

త్రిపుండ్రధారణ, రుద్రాక్షమాలికాధారణ, నీరుకావి దోవతుల జోడింపు మొదలయినవి భక్తుల వేషాల్ని విశదపరిచే అంశాలు.

కవి చంద్రవతి చేసిన యౌవనోదయాన్ని వర్ణించే సందర్భంలో చేసిన—

కం॥ వలరాజు రాణివాసము
తలిరాకుప్ బోణి చక్కదనమును నొఱపున్
గిలుమూడి యొప్పులన్నియు
నిలిపి ప్రయత్నమున నజుఁడు నెలతుకజేసెన్ (ఆ4-ప10)

కం॥ చెలివాలను వలసుమాటలు
పలుకకు మగమీలు కనుగవకు సరియగునే
పులిటుట్టు మాటలేటికి
కంకంరి కుచోపములె కనకఘటంబుల్ (ఆ4-ప11)

సీ॥ ఘనకాంతి మెలగెడు కనకంపు దీగయో
కాదు, కంతుని భద్రగజముగాని
కాంతయో? కస్తూరికావశ్యరూపమో?
కాదు, నిర్జరకంబు కంఠిగాని
రాజాస్యరూపమో? రత్నప్రదీపమో?
కాదు కాముని దీపకాంతిగాని
చిరుసౌనబట్టిన చిత్తజుబాణమో
బాణమె మన్మథ త్రాణగాక
కలరె యీరీతి మానవాంగనలు ధరణి
ననుచు బుధులెల్లను నభినుతింప
గంతు సామ్రాజ్య పట్టంబు గట్టదగిన
రమణి విలసిల్లె విభ్రమారంభములను (ఆ4-ప12)
పద్యాలు శారీరక వర్ణనకు సంబంధించినవే.

5.7.3.2 స్వభావచిత్రణ :

స్వభావచిత్రణ అంటే మానసికవర్ణన అని అర్థం. కొన్ని సందర్భాలలో శారీరకస్థితి మానసికభావాల్ని వ్యక్తం చేయవచ్చు. కొన్ని సందర్భాలలో మనోభావాలు శరీరంలో కనిపించకనూ పోవచ్చు. మానసికభావాలు వాక్కులలో ఒక్కొక్కసారి ప్రతిఫలించనూవచ్చు. మానసిక స్వభావప్రకటనలో స్త్రీ పురుషులనే తేడా తప్పక వుంటుంది.

5.7.3.2.1 పురుషపాత్రలు :

శ్రీపర్వతపురాణంలోని పురుషపాత్రలు రెండు రకాలు. మొదటి రకం వారు ప్రధానపాత్రలు రెండవరకం వారు ప్రాస్తావిక పాత్రలు.

5 7.3.2.1.1 ప్రధానపాత్రలు :

శ్రీపర్వతపురాణంలోని సన్నివేశాలలో తమకంటూ ఒక స్థానం

సంపాదించుకొని కథను ముందుకు నడిపే పాత్రలు ప్రధానపాత్రలు. శిలాదుడు, నందీశ్వరుడు, పర్వతుడు, సాధకుడు, అట్టివారు వీరిలో శిలాద, నందీశ్వర పర్వతులపాత్రలు ద్వితీయాశ్వాసంతో పూర్తవుతాయి వీరందరు వీరి సంపూర్ణ జీవనచిత్రణగాని, లేదా వీరి జీవితానికి సంబంధించిన అనేక సన్నివేశాలు గాని కవి వర్ణించలేదు. శిలాద నందీశ్వర పర్వతులలోని ఒకానొక భక్తిభావాన్ని మాత్రం కవి ఉద్దీపితం చేశాడు.

శిలాదుడు పరమేశ్వర భక్తుడు. హరయోగి, శివధర్మపరాయణు లయిన సంతానం కావాలని తపశ్చర్య మొదలుపెట్టినవాడు. కనుకనే శివుడు ప్రత్యక్షంకాగా–

కం॥ నీపాదభక్తి యుక్తుల
నో పరమేశ్వర కృపాబ్ధినొనగుము సుతులన్
నీపాద భక్తియందును
ఏపాటి గొఱంతయైననేవరమొల్లన్ (ఆ2-ప41)

అని కోరుకున్నాడు. అట్టి శివభక్తి పరాయణుడయిన కొడుకే కులానికి కీర్తి తెస్తాడనిభావించాడు. పుత్రోదయకాంక్షప్రధానఫలమయినా శివభక్తి పరమఫలం.

శిలాదుని కొడుకు నందీశ్వరుడు. ఇతడు అయోని సంభవుడు. బాల్యంనుండి శివధర్మ వర్తనుడు. శివమంత్ర పఠనరతుడు. పరమ యోగి. అట్టివాడు పరమశివుని ఉద్దేశించి తపస్సుచేసి–

కం॥ ఆ పద్మజాండ బుద్బుద
రూపములు జనించు నీదు రూపాంబుధిద
ద్రూపంబును ధరియింపంగ
నోపిన సత్వంబు నాకు నొసగగవలయున్ (ఆ2-ప67)

కం॥ నాదేహము నిత్యంబును
నీదేహము గడిసి బెరసి నిను భరియింపన్
నీదివ్యవాహనముగా
నాదేవాధీశ వరము నొసగుము నాకున్ (ఆ2-ప68)

అని అడిగాడు. ఇందులో కీర్తికాంక్ష ఉన్నా, దాస్యభక్తి పరమ ఫలంగా కనిపిస్తుంది.

పర్వతుడు నందీశ్వరునిలాంటివాడే. నందీశ్వరునికంటె భిన్నంగా హఠయోగంతో స్వామిని అర్చించినవాడు, అందువల్లనే శిలాదుని తపస్సులోను, నందీశ్వరుని తపస్సులోను కనిపించని ప్రకృతి వైపరీత్యాన్ని—

శా॥ ఢుల్లెన్‌దారలు చంద్ర భాస్కరులు బిట్టుల్లాడగా బ్రహ్మభీ
భిల్లెన్ దిక్కరులెల్ల మ్రొగ్గె దివిజాధీశుల్ దలంకంగ ని
ట్లల్లాడెన్ ధర తల్లడిల్లె హరి బ్రహ్మాండంబు కంపింప శో
భిల్లెన్ శంకరుడాదిదేవుడు కృపాభీష్టప్రదస్వాంతుడై (ఆ2-ప77)

అనే పద్యంలో స్పష్టం చేశాడు.

కం॥ మందర కైలాసావల
కందరముల సకల దేవగణమౌని మనో
మందిర పుణ్యస్థానము
లొందక నాశిరమునందు యుడగవలయున్ (ఆ2-ప88)

అని కోరుకోవడంలో మూడు ప్రయోజనాలు కనిపిస్తాయి. భక్తి కంటెను ముక్తికి వేరేసాధనంలేదనిచెప్పడం (ఆ2-ప87),ఇక రెండవది కైంకర్యభక్తినిరూపణ చేయడం. మూడవది "నిన్ను దర్శన స్పర్శన పూజావిధానంబుల నర్చించువారికి ఐహికాముష్మిక సౌఖ్యంబులు, నిత్య కైవల్యభోగంబుల ననుగ్రహింపవలయుననికోరుకోవడం. అందువల్లనే

శివుడుకూడా "నీవిపుడు మమ్ము వేడిన వరము పరోపకార హేతువు (అ2-ప90) అని ప్రశంసించాడు. ఈ ముగ్గురి కోరికల్లోను శివసేవారతి రూపకమయిన మానసిక భక్తి ప్రస్ఫుటం.

శ్రీశైల పర్వతపురాణంలోని సాధకుని పాత్ర చిత్రమయింది. కవి సాధకుని పేరు ప్రస్తావించలేదు. కనుక ఇది "సంకేత" నామంగా గ్రహించవచ్చు. సాధన చేసే వారందరు సాధకులే సాధనలో కలిగే యాతనలు, ప్రలోభాలు, దీక్షావిధి, ఆత్మపరిశీలనలు అనేవి సాధకునిలో కనిపిస్తాయి ప్రధానంగా సాధకునిలో రెండు అంశాలున్నాయి మొదటిది వ్రతదీక్ష రెండవది అహంకారప్రవృత్తి.

వ్రతదీక్ష :

శ్రీశైలంలోని విచిత్ర తరుమహిమలు తెలియగనే చూడాలను కోవడం తొలిదశ మొదట ఎదురైన "మోహినీ" గణాన్ని రూపుమాపడం రెండవమజిలీ పులి ఆకారంలో వచ్చిన భైరవునితో తలపడడం మూడవ మజిలీ తపస్విద్వార బిలవృత్తాంతం తెలుసుకోవడం నాలుగవమజిలీ శాంకరి నట్టింలోని చెలికత్తెలు రసాయనమివ్వడం ఐదవమజిలీ వృషభ బిలంలో వనితతో నాలుగురోజులు గడపడం ఆరవమజిలీ కాలబిలంలో సుందరాంగన దివ్యదేహాన్ని ప్రసాదించడం ఏడవమజిలీ ఖేచరబిలంలో మునికి తన వృత్తాంతం తెలుపడం ఎనిమిదవమజిలీ భైరవబిలంలో దేవాంగనలు మధుగువస్త్రాలు, గంధమాల్యాలు, మాణిక్యభూషణాలు, దివ్యాన్నపానాదులిచ్చి సంతోషపెట్టడం తొమ్మిదవ మజిలీ చేటికాబిలంలో సుందరాంగనలు రసాయనం ఇచ్చి సంతోషపెట్టడం పదవ మజిలీ పద్మవతీబిలంలో పద్మవతి ఫలరసభక్ష్యాలతో విందు ఏర్పాటుచేసి దివ్య శరీరం ప్రసాదించడం పదకొండవ మజిలీ.

ఏనుగుతో తలపడడంలో, పులితో పోరాడడంలో సాధకుని ధైర్య ప్రవృత్తి విశదం తపస్వీమాటలు వినడంలో గౌరవం, ఇక ఇబ్బందులన్నీ ఎదుర్కోవడంలో దీక్ష సువ్యక్తం.

అహంకార ప్రవృత్తి :

సాధకుడు భేచరబిలం ప్రవేశించాడు అపై భైరవబిలం ప్రవేశించాడు భైరవుడు సాధకుని శక్తికి మెచ్చి వరం కోరుకోమన్నపుడు—

సీ॥ నీవిచ్చు వరమేమి నేను గోరెడిదేమి
యీ భాగ్యమేలు నాకిటులుండ
ననఘ నీ సారూప్యమనిన లజ్జాశూన్య
కటిభాగమున భయంకరపు రూపు
సాలోక్యమనిన నిచ్చలు రక్తశవసురా
మాంససంఘాత నిమాతులంబు
సామీప్యమేని పిశాచోగ్ర భేతాళ
గాల భూతాది సంకరమతంబు
నీవొసంగిన వరము నేనిచ్చగించ
వాంఛ తోడుత బదివేల వరములిచ్చు
నట్టిదరయఁగాదె వక్రగుణంబు విడువు
వలదు వైష్యముబుద్ధి యెవ్వారియందు (అ5-ప124)

అని ఆక్షేపించినవాడు.

అలాగే చేశికాబిలం దగ్గర రసాయనం ఇవ్వన వారితో—

శా॥ నీరే శాసనుడెంత నేర్పరి జయోపేంద్రుడ వైవస్వతుం
డా రాత్రించరుడే బలాన్వితుడు శ్రీవాంతుడు తేజస్వియే
తూరుండే యనిలుండు పాశధరుడన్ సుత్రాముడే భోగి వి
స్తారప్రక్రియ నేనెగా కనిగదా దండంబుచేద్రివ్వాచుప్(అ6-ప18)

అని ప్రగల్భాలు పలికినాడు.

కదళీవన ప్రాంతంలో సాధకుడు గర్వించగా దేవాంగన అసహ్యించుకుంది. తోటివారిని హేళనచేసే ప్రవృత్తిని తిరస్కరించింది.

కం॥ "అధముడ యిటు నిలువుము నీ
విధమెక్కడ శివుని కీర్తివిధమెక్కడ దు
ర్విధులకు మెచ్చడు శంభుడు
బుధులకు నీనగరి పొంతపోరాదు సుమీ (అ6-ప68)

అని అధిక్షేపించింది. అపై భుజగాధీశ్వరుడు కూడా

కం॥ బలుబలు నెక్కడికెగెదు
కలికరి యిటు నిల్వవట్టి గర్వించేలా
కెలిమాటలకును మెచ్చడు
గలకంఠుడు సహజభక్తి గతులకు దక్కన్ (అ6-ప79)

అని ఊసడించుకున్నాడు.

ఆపై పద్మవతితో కూడ సాధకుడు–

ఉ॥ ఎక్కడి పాకశాసనుడు నెక్కడి వహ్నిపరేతరాజు నీ
డెక్కడి రాక్షసేశ్వరుడు నెక్కడిపాశధరాది నాథులిం
కెక్కడి యక్షనాయకుడు నిన్ని జగంబులు చేయంబ్రోవగా
నిక్కము నేనె కర్తనని....(అ6-ప96)

గర్వోక్తులాడినాడు సాధకుని గర్వాన్ని చూసి పద్మవతి ప్రబోధం చేసింది ఆపై సాధకుడు గర్వాన్ని విడనాడి విమల విజ్ఞాన వైభవసంపన్నుడై ఆ చంద్రార్కం దివ్యభోగాలు అనుభవించాడు. ఎంతగర్వితు డయినా చివరకు వినయసంపన్నుడు కాగలిగాడు.

5.7.3.2.1.2 ప్రాస్తావిక పాత్రలు :

ప్రాస్తావిక పాత్రలలో కర్వ్రుడొకడు తపస్వి సాధకునికి కరవీర వన ప్రశంసచేస్తూ అతని చరిత్ర చెప్పాడు ఇది సాధకుని కథలోని ఉపకథ. కరవీరుని గురించి శేషనాథార్యకవి-

కం॥ కరవీరుడనగ మత్రి
కరవీరగుణాకరుండు కడుభయభక్తిన్
గరవీరేశ్వరుడన నీ
గిరి వీరేశ్వరుని నిల్పె గ్రియదొలుకాడన్ (ఆ5-31)

అని వ్రాశాడు. కరవీరుడు ఈశ్వరుని, తన ఈశ్వరభక్తిని సంస్కృత సమ్మిశ్రితమయిన "శాశవృత్తాలతో" సువ్యక్తం చేశాడు. ప్రత్యక్షమయిన పరమశివుని చూచి

తే॥ భర్గ నన్నిట్లు వృక్షరూపంబు జేసి
అథవయందుల పుష్పంబు లవధరింపు
శివలోకేశ శివ జగద్ధిత చరిత్ర
పరమపావన భవ పరబ్రహ్మరూప (ఆ5-ప38)

కం॥ అలికాక్ష తత్ప్రసూనపు
దళముల బూజించునట్టి ధన్యులకెల్లన్
జలభేది విభవ మొసంగుము
అలరులం బూజింప నొసంగు నపవర్గంబున్ (ఆ5-ప39)
అని కోరుకున్నాడు.

5 7.3.2.2 స్త్రీ పాత్రలు :

శ్రీపర్వతపురాణంలోని స్త్రీ పాత్రలు రెండురకాలు. మొదటిరకం వారు ప్రధాన పాత్రలు రెండవరకం వారు ప్రాస్తావిక పాత్రలు.

5.7.3.2.2.1 ప్రధాన పాత్రలు :

శ్రీపర్వత పురాణంలోని సన్నివేశాలలో తమకంటూ ఒకస్థానం సంపాదించుకొని కథను ముందరకు నడిపే పాత్రలు ప్రధాన పాత్రలు. శ్రీపర్వతపురాణంలోని ప్రధాన పాత్ర చంద్రవతి. చంద్రవతి పాత్ర చతుర్థాశ్వాసంలో పూర్తవుతుంది. శ్రీపర్వతపురాణంలోని చంద్రవతి పాత్ర మానసిక సంఘర్షణలమధ్య నలిగిన పాత్ర. ఆమె తండ్రి చంద్రగుప్తుడు సద్గుణుడు. అయినా చెలికత్తెలతో కలిసి తిరిగే చంద్రవతి ఆటపాటలను చూసి మరులుగొన్న మూఢుడు. తండ్రీ కూతుళ్ల ప్రణయం నింద్యార్హమైంది. చంద్రవతితండ్రి వికారచేష్టలను గుర్తించి-

కం॥ మదమందు పాపకర్ముడు
మొదలన దర్పకుడుగాన మూఢుడుగా డే
మదనారిని డెందంబున
బదిలింబుగ నిలిపి తండ్రి వగ సాధింతున్ (ఆ4-ప18)

అని తన్ను తాను చంద్రవతి శివునికి అర్పించుకుంది. ఈకథలో చంద్రగుప్తుడు ఏమయ్యాడో కవి చెప్పలేదు.

చంద్రవతిలో గమనించదగ్గ మరొకఅంశం స్నేహభావం. ఆమె వసంతర్తు సమయంలో చెలికత్తెలతో తోటలలో విహరించే వర్ణనలు ఇందుకు సాక్ష్యాలు.

సీ॥ మాధవీ నవపుష్పమంజరి చూచితే
యభిరామ నవకలహంసయాన॥
యభిరామ నవకల హంసాళి జూచితే
ఖేలాభినవ రాజకీరవాణి

శిలాభినవ రాజకీరాళి జూచితే
నీలకంఠ కలావ నిభ శిరోజ
నీలకంఠ కలావ నిచయంబు జూచితే
కలమృదు స్వర కలకంఠనాదః
కలమృదుస్వర కలకంఠంబు జూచితే
నిబిడ కోమలాళి నీలవేణిః
నిబిడ కోమలాళి నికరంబు జూచితే
యనుచు గ్రీడసల్పి రతివలంత (అ4–వ43)

అని పలకరించుకోవడం, చెలికత్తె అకుకూడా తన తండ్రి వ్యవహారం చెప్పకపోవడం విశేషం. కాకపోతే చంద్రవతి తీర్థక్షేత్ర దర్శన లాలసయై అడవులకు పోయిందని, చివరకు శ్రీగిరి మల్లికార్జునుని సేవలో నిమగ్నమయిందని ఊహించడానికి వీలుంది.

"నిఖిల కైవల్య సౌఖ్యంబు నెలత కొసగ
దేవసంయములెల్ల మతించి రంత" (అ4–వ103)

అని కవి ముగించినాడు.

5.7.3 2.2.2 ప్రాస్తావిక పాత్రలు :

వసుమతి–సాధకుని ప్రయాణంలో కారణవడిన స్త్రీలు ప్రాస్తావిక పాత్రలుగానే చెప్పాలి. కారణం వారి సంపూర్ణ రేఖాచిత్రణ శ్రీపర్వత పురాణంలో కనబడకపోవడమే.

వసుమతి భక్తురాలు. శ్రీనగం అని పేరు రావడానికి కారకురాలు, ఆమె వరమ ుపునికోసం తపస్సు చేయగా–

"పంకజాననుడంత ప్రత్యక్షమై నిల్చి
యంబుజాననః వరంబడుగుమనిన

వసుమతి నాపేరు వినుమానమిదియెల్ల
శ్రీనామ మొసంగు మీప్సితము నాకు (ఆ3-ప11)

అని కోరుకుంది.

సాధకుని ప్రయాణంలో కనిపించే స్త్రీలు రెండురకాల వారు సాధకుని సంతృప్తి పరచిన మానినిఒకరు. ఈమె సాధకునిపట్లమమకారం పెంచుకున్న మానిని కనుకనే "భిక్ష" అడగవచ్చిన సాధకుని సరాసరి తన పురానికి పిలుచుకొనివెళ్ళింది. అతిధిసత్కారం చేసింది. "కర్పూర తాంబూలమిచ్చి వరియించింది. పైగా "సౌఖ్యాంబుధి"లో తలమునక లయ్యేటట్లు చేసింది. అందువల్లనే సాధకుడు-

"నిక్కంబు నాకు నీసతి
దక్కెగదా" (ఆ5-ప87) అని పరవశించాడు.

5.7.4 శ్రీపర్వతపురాణం-భ్రమరాంబిక :

శ్రీశైలంలోని అమ్మవారు భ్రమరాంబిక ఆమె పార్వతి. శంకరి కూడా.

శ్రీపర్వతపురాణంలో పార్వతికి ప్రాధాన్యం చాలతక్కువ శ్రీపర్వత ప్రాశస్త్యాన్ని శివుణ్ణి అడిగిన మొదటి వ్యక్తి పార్వతి కనుకనే "సాత్య వశేయుండిట్టి మహత్త్వంబు పర్వతునకు గలుగుజెట్టనిన మహాదేవుండు పార్వతీదేవి కానతిచ్చిన విధంబుజెప్పెదనాకర్ణింపుమని నసత్కుమారుడు (ఆ2-ప11) అని శేషనాధార్యుడు మొదలుపెట్టినాడు. ఈ కావ్యంలో పార్వతి ఒక భక్తురాలిగా శివుని అంతికంలో పంచరించే వ్యక్తిగానే కనిపిస్తుంది.

తే॥ గిరిశునకు మ్రొక్కి యెదురగెంగేలు యొగిచి
విశ్వనాథున కిట్లని విన్నవించె

నరుణ పల్లవపాటి నీలాళిపేటి
సకలకల్యాణ శుకవాటి శంభురాటి (ఆ2_ప20)
సీ॥ "వడకు గుబ్బలి రాచవారి కన్నెమ మేన
మచ్చిన గతి మండనిచ్చివాడు" (ఆ2-ప36)

అనే వాక్యాలు పార్వతి ప్రాధాన్యాన్ని స్పష్టం చేస్తాయి.

శ్రీగిరి మల్లికార్జునుని స్తుతించిన నందీశ్వర, పర్వత, చంద్రవతి స్తోత్రాలలో ఎక్కడా పార్వతి ప్రశంస లేకపోవడం విచిత్రం. అయితే కవి ప్రతి ఆశ్వాసాదిలో పార్వతిని త్రిభువనేశ్వరిగా వర్ణించాడు.

కం॥ శ్రీశైల పుణ్యమహిమలు
నాశైల తనూజ వినుచు జ్ఞానందసుధా
రాశి రసకేళి దేలుచు
నీశానుని జూచి త్రిభువనేశ్వరి పల్కెన్

ఇక రెండవపేరు శంకరి. శం అంటె సుఖం అని అభిప్రాయం. సుఖాన్ని కలిగించేవాడు శంకరుడు. సుఖాన్ని స ఎకూర్చేది కనుక శంకరికూడా శంకరుని వత్ని, కాబట్టి శాంకరిఅని పేరు. పంచమాశ్వాసంలో తృణబిందు సరోవరం ప్రశంస తరువాత శంకరి పట్టణ ప్రశంసను కవి చేశాడు ఈ పట్టణ నామసార్థక్యాన్ని-

ఉ॥ బాలకియై భవాని హిమపర్వత పుత్రికయై
శ్రీలలితాంగి బొమ్మలకు జిత్రపు వన్నెల బొమ్మ
చాలగగొంచు రమ్మనుచు పమ్మదలీలనెగి ఉ
కూల పవిత్రదేశమున గొమ్మట తోడుత ॥

అని విస్తృతం చేశాడ

పైగా గంగానది తీరంలో ఒక పట్టణాన్ని నిర్మించి మధ్యవీధిలో పరమేశ్వరుని ప్రతిష్ఠచేసి పార్వతి తపశ్చర్యకు మొదలెట్టింది. ఆ తపస్సుకు మెచ్చి పరమేశ్వరుడు ఆమెను పరిగ్రహించాడు. ఆ సామ సస్యంతో—

కం॥ జలజాయతాక్షి యప్పురి
దలచిన శివుడెటింగి నీవు దలచిన పురియున్
నెలకొలిపితి నీపురిగా
దలచిన సితతాపురంబు తామరసాక్షి (ఆ5–వ48)

అని శివుడు అనుగ్రహించాడు.

మూడవపేరు భ్రమరాంబిక. శ్రీశైలంలో స్వామిపేరు శ్రీగిరి మల్లికార్జునుడు. అక్కడ అమ్మవారి పేరు భ్రమరాంబిక శ్రీగిరి మల్లికార్జున భ్రమరాంబికల ప్రణయుంవంటివి ఏవీలేవు భ్రమరాంబిక నామౌచిత్య కథ కనిపించదు కాని భ్రమరాంబిక పేరు మాత్రం కని పిస్తుంది. తృతీయాశ్వాసంలో శ్రీపర్వతలింగానికి ఉపచారాలు చేస్తే కలిగే ఫలాలను చెప్పే సందర్భంలో భ్రమరాంబిక ప్రశంస ఉంది.

కం॥ యుక్తులు నిగమము లావృత
శక్తులు గంధర్వ దివిజ సారసనయనల్
భక్తులు దివ్యామృతములు
భక్తులు బ్రహ్మాది సురలు భ్రమరాంబికకున్ (ఆ2–వ34)

ఆపై శ్రీశైల తీర్థమాహాత్మ్యాలు సనత్కుమారుడు కృష్ణద్వైపా యనునికి తెలిపే సందర్భంలోకూడా భ్రమరాంబిక ప్రస్తావన ఉంది.

వ॥ అర్ధనారీదేవియును భ్రమరాంబికయును శ్రీశైలమునకు నాదిశక్తి స్థానంబులు తదీయ మందిరంబుల నిశ్చలచిత్తులై

తవంబు సేయువారికి సకల మనోరథార్థ సిద్ధులు సిద్ధించు
(ఆ3-ప35)

సీ॥ ఏ దేవునకు శిఖరేశ్వరం బ్రకాంత
లాలిత క్రీడావల స్థలంబు
రేవనేల్పు క్రీడించుకేళాకూళి
తరళతరంగ పాతాళగంగ
యే దేవునకు గూర్మి హేళా కళాకృతి
భ్రమరాంబ భవ్య ప్రభాకరంబు
భైరవాది క్షేత్రపాలక ప్రవరుల
ప్రహరిజరింతు రే భవ్యమూర్తి
నట్టి శ్రీమన్మహా దేవునకుగు పురము
గూఢ సంజీవనీ వని, కుంజపుంజ
వర్ధితోన్నిద్ర కల్పద్రుమాపి కూప
భర్మ హర్మ్యోన్నతంబు శ్రీపర్వతంబు (ఆ3-ప91)

అని భ్రమరాంబిక ప్రసక్తి ఉంది.

5.8 శైలీవిశేషాలు :

ఒక రచయిత రచనా విధానాన్ని శైలి అనడం పరిపాటి. శైలి అన్నది వ్యక్తిగతం. పైగా ప్రయోజనంబట్టి శైలి మారుతుంది. ప్రతి వ్యక్తికి ఒక జీవనవిధానమున్నట్లే ప్రతి కవికి ఒక శైలి ఉంటుంది.

శైలిని అనేకరకాలుగా వర్గీకరించవచ్చు. వాటిలో భాషాశైలి, అలంకారికశైలి, కథనాత్మకశైలి, వర్ణనాత్మక శైలి, రసాత్మకశైలి, సంభాషణాత్మకశైలి అనేవి ముఖ్యమయినవి.

5.8.1 భాషా శైలి :

కవికి భాషాప్రయోగంపట్ల ఉన్న అనురక్తిని సూచించేది భాషా

తైలి శేషనాధార్యునికి సంస్కృతాంధ్రాలు రెండూ సమానమయినవే అంతేగాక అతడు అష్టభాషావిశారదుడు. శ్రీపర్వతపురాణంలోని శిలాదుని దండకం, నందీశ్వరదండకం, కాళవృత్తాలు అతనికిగల సంస్కృతాను రక్తిని స్పష్టం చేస్తాయి. అలాగే కవికి ఉన్న తత్సమ పదబాహుళ్య ప్రయోగానురక్తి కి.

మ॥ కలరా రంభ మనోరథాంబువులు రాగద్వేషఫేనంబులున్
మలమాయామయ జంతు సంఘములు గ్రామకోధకల్లోలముల్
కలుషావర్తము లింగభోగతటముల్ కల్పించు జన్మాంబుధిన్
జలబిందుక్రియదాటు మానవుడు శ్రీశైలసలస్థాయియై(అ3-ప83)

పద్యమొక చక్కని ఉదాహరణ.

శేషనాధార్యకవి తద్భవపదాల ప్రయోగంలోను, అచ్చ తెనుగు పదాల ప్రయోగంలోను సిద్ధహస్తుడే.

ఉ॥ నిండిన కుండబొజ్జ కళ నిగ్గులుదేర గురారధారయున్
దుండము ముందటన్ నూల్కొననేనుగుమోము దమ్మితో
మెండుగ నెల్కవారువము మీదను రౌతుదనంబు జూపుచున్
గొండ యమంగుటల్లునికి గుంజరవక్త్రుడు ముద్దు సల్పగన్
(అ2.ప17)

ఈ పద్యంలో కురారధార, కుంజర వక్త్ర పదాలను వదలిపెడితే మిగిలినవి అన్ని తద్భవాలు. కొన్ని దేశ్యాలు. మరికొన్ని ఉదా॥

కం॥ చెలిపొలసు పలను మాటలు
పలుకకు మగమీలు కనుగవకు సరియగునే
పులికుట్టు మాటలేటికి
కుచోపములె కనకఘటంబుల్ (అ4-ప11)

కం॥ నిగనిగ మేరల వేదిమి
జగి దొలకెడు తనదు ఎఱ్ఱచిచ్ఛుకంటన్
జగురుగ్గైదువ జోడుమ
దెగజూచిన ధీరుదేవదేవున్ గొలుతున్ (ఆ4-ప19)

కం॥ తెలినీరుమ దలిరాకుమ
బరిక్రొవ్విరి తేనెదోగు పొడినెత్తావుల్
చిలికింపమ్మ తెమ్మెర
లలరులపై దీటిదాటులానిన సరసిన్ (ఆ6-ప37)

కవితున్న తెలుగుపద ప్రయోగానురక్తి సుస్పష్టం.

### 5.8.2 అలంకారికశైలి :

శైలిని అలంకారికమని, నిరలంకారికమనికూడా వర్గీకరించవచ్చు ప్రబంధకవులకు అలంకారికశైలిపై మక్కువ, కథాకథనశీలురకు నిరలంకారిక శైలి ప్రీతికరం. శేషనాథార్యకవి ప్రధానంగా నిరలంకారికశైలి వైపు మొగ్గుచూపినవాడు. కాని అవసరమయిన చోట్ల "అలంకారాలకు" ప్రాధాన్యమిచ్చినవాడే. అలంకారాలను పదాడంబరంతో వ్రాయడమొక పద్ధతి. పొడి పొడి మాటలతో వ్రాయడమొక పద్ధతి. పదాడంబరానికి ఉదాహరణ.

శా॥ విద్యుత్కాంతి జటాకలాపః యుభవాః విశ్వేశః నీ పూజచే
సద్యోముక్తములో నఘంబులు మరుత్సంఘంబుచే బాయునే
ప్రద్యోద ప్రబల ప్రతాపమగు నా భానుప్రభన్గాక యా
ఖద్యోతద్యుతి వాయ నేర్చునె మహాఘరోర్వరధ్వాంతముల్
(ఆ4-ప80)

పొడి పొడి మాటలకు ఉదాహరణ.

కం॥ పసిడికి గమ్మని వాసన
ప్రసవము మలయుచు జమునకును, ఫలమిడునటున్
ప్రసవించిన చందంబున
వసుమతి జనియించి తమ్మ వనజనదళాక్షి (అ4–ప24)

5.8.3 కథనాత్మక శైలి :

కవికి కథ చెప్పడంవల్ల ఉన్న అనురక్తిని సూచించేది కథనాత్మక నాత్మకశైలి. తాను చెప్పదలచుకున్న విషయాన్ని కవి సూటిగా చెప్పడం కథనాత్మకం. విషయస్పష్టత, వ్యక్తీకరణలో సౌరళ్యం ఈ శైలిలో ప్రధానాంశాలు. మచ్చుకు-

సీ॥ పూర్వజన్మంబున భోగికుడను లింగ
మునకు బూజాబంధములు రచింప
నొక్క పుష్పంబులో నొకకీటిదగిలిన
తప్పున నై నీవు ధరజనింప
నలసెను నవ్వులవాడవుగాన ని
న్ను భవుడు కరుణించు ననుచు జెప్పి
నాతుల గొనిపోయి నాకలోకంబున
భోగవతీనది పులినతలమున
నందు నిలిపి దివ్యదేహము నొంపె (అ5–ప57)

అనే పద్యంలో సాధకుని పూర్వజన్మవృత్తాంతం కథనాత్మకశైలిలో సాగింది.

ఉ॥ అక్కడ నూరులేదు మరి యిల్లుమగాదిది యేమిచోద్యమో
అక్కజమంత నొక్కశిలనక్కడ నిక్కువగా నొనర్చి యా
జక్కన గొంత దవ్వరిగి శౌచముసేయ దొలగునంతలో
నక్కడ నిట్లు వల్కినను నక్కడ నిక్కడ రాల నిల్పినన్
(అ5–ప81)

పైపద్యం కథనాత్మక శైలిలో సాగడం విశేషంగా చెప్పవచ్చు.

5.3.4 వర్ణనాత్మక శైలి :

ఒక వ్యక్తి నిగాని, వస్తువునుగాని, సన్నివేశాన్నిగాని ప్రతిభతో జోడించి వ్యక్తీకరించడం వర్ణనాత్మక శైలి. ఈవర్ణనాత్మక శైలిలో అనేక విషయాలను గుదిగ్రుచ్చి ఒకచోట చెప్పడం లేదా కవి కొన్నిచోట్ల వదాడంబరానికి ప్రాధాన్యమిస్తూ వ్రాయడం ప్రధానాంశాలు.

శా॥ శాకోటార్జున మాతులుంగ ఫలినీజంబీర జంబూవనీ
మాకందార్క కదంబ నింబ కదళీ మల్లీమతల్లి లతా
శేశానోకహ వల్లవాంకుర తలోన్మీలత్ప్రసూనోద్గమా
నీకశ్రీకళలాటుకోత్కర ఫలోన్నిద్రాటవిన్ జూచుచున్ (ఆ1-వ53)

ఈ పద్యంలో రకరకాల ఫలవృక్షాల పట్టికతో రూపొందించడం వర్ణనాత్మక శైలి.

మ॥ ఘనియొన్వ్యాసుడు వాగ్విలాసుడు సమగ్రప్రీతిముందాకినిన్
ఘనపారీనధులిలుత త్కమత నక్రానీకిన్ నిత్య భో
లన దేవేంద్ర పురాంగనా కుచ తటాలంకార కర్పూర చం
దనలుంటాకిని జక్రవాకిని విశుద్ధవ్యాయత శ్లోకినిన్ (ఆ1-వ57)

అనే పద్యం వదాడంబర వర్ణనాత్మక శైలికి ఉదాహరణ.

5 3.5 రసాత్మక శైలి :

రసానుభూతి హృదయానికి సంబంధించింది. కవి వర్ణించిన వద్యం సహృదయునిలో ఆ రసానుభూతి కలిగించినట్లయితే కవిలక్ష్యం నెరవేరినట్లే కవి రసానుగుణంగా శైలిని నడిపిస్తాడు. ఒకరివట్ల విహ్వ భావం కలిగినవేళ మాడి మాడి మాటలతో హేళనా పదకాలం వెలువడు తుంది ఈ శైలిలో శేషనాథార్యుడు వ్రాసిన వద్యం.

శా॥ నీరేజాసనుఁడెంత నేర్పరి జయోన్నిం(ద్రుడ వైవస్వతుం
డారాధించరు డే బలాన్వితుడు శీతాంశుండు తేజస్వియే
శూరుండే యనిలుండు పాశధరుండున్ సుత్రాముడే భోగి వి
స్తారప్రక్రియ నీనెగాకనిగదా దండంబుచే (దివ్యుచున్(ఆ6-వ18)

ఒకరిని దట్టించి అడిగేవేళ మాటలలో నొక్కి చెప్పే గుణం ఉంటుంది. ఈ భూమికమీద వ్రాసిన పద్యాలు రసాత్మక శైలికి ఉదాహరణలు.

తే॥ అధముడ యిటు నిలుపుము నీ
విధమెక్కడ శివుని భక్తివిధమెక్కడ దు
ర్విధులకు మెచ్చదు శంభుడు
బుధులకు నీనగరి పొంతం బోరాదు సుమీ (ఆ6-వ68)

ఉ॥ ఎక్కడి పాకశాసనుడు నెక్కడి వహ్నివరేరాజు వీ
డెక్కడి రాక్షసేశ్వరుడు నెక్కడి పాశధరాధినాధు లిం
కెక్కడి యక్షనాయకుడు నిన్ని జగంబులు చేయం(బోవగా
నిక్కము నీనెకర్తవని నిష్ఠురవృత్తినహంకరింపుచున్(ఆ6-వ96)

శా॥ కర్ణాలంకృత కుండలీశ్వర వియద్గంగా తరంగావళీ
తూర్ణాఖేందు కళాకలాప విలసత్కోటీర! పాటీర వా
గ్వర్ణడంబర దివ్యదేహ! యని నావాక్కాయ కర్మంబులన్
వర్ణింతున్ నుతియింతు నిన్ను శివ! దేవా! దైవచూడామణీ!
(ఆ4-వ32)

అనే పద్యంలో భక్త్యావేశముంది. ఆవేశంలో సాధారణంగా తీవ్రత ఉంటుంది. ఆ తీవ్రత మాటల్లో చేతుల్లో ప్రతిఫలించవచ్చు. ఆవేశానికి తగినట్టుగా మాటలు దొరలవచ్చు. ఒక ఆవేశంలో తీవ్రతకు తగినట్టుగా పదాల కోడింపు జరగడం పైపద్యంలోని ప్రత్యేకత.

5.8.6 సంభాషణాత్మక శైలి :

కావ్యంలోని పాత్రలు సహృదయులకు చదువరులకు నడయాడే విధంగా నిరూపించడంలో కవి చేసే ప్రయత్నమే సంభాషణాత్మకశైలి. ఈ శైలి ప్రధానంగా నాలుగు రకాలు.

మొదటిది మాటలు ఒకరివి కాగా ఎదుటి వ్యక్తి శ్రోతగా నిలిచి పోవడం. వ్యాసుడు పుణ్యక్షేత్రమహిమలను చెప్పమని సనత్కుమారుని అడిగాడు. అపుడు సనత్కుమారుడు—

కం॥ నీవడిగిన యీ యర్థము
శైవాగమ వేదశాస్త్ర సమ్మతము జగ
త్పావనకరమగు శుభమును
గావించును భోగమోక్షకారణమనఘా (ఆ1-వ62)

అని చెప్పినాడు. ఇక్కడ మాటలుసనత్కుమారునివి కాగా శ్రోత వేదవ్యాసుడు.

అలాగే శిలాదుడు సంతానంకోసం శివుణ్ణి ఉద్దేశించి తపస్సు చేశాడు. హఠయోగంతో స్వామిని మెప్పించాడు. శిలాదుని తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యాడు. ప్రత్యక్షమైన శివుని స్తుతించాడు. అపై-

కం॥ నీపాద భక్తియుక్తుల
నోవరమేశ్వర కృపాబ్ధి నొసంగుము సుతులన్
నీపాద భక్తియందును
ఏపాటి కొఱంతయైన నేవరమొల్లన్ (ఆ2-వ41)

అని వేడుకొన్నాడు. ఇక్కడ వక్త శిలాదుడయితే శ్రోత శివుడు

శిలాదునికొడుకు నందీశ్వరుడు. నందీశ్వరుడు పెరిగి పెద్దవాడై

శివుణ్ణి ఉద్దేశించి తపస్సు చేశాడు. స్వామి ప్రత్యక్షమై వరం కోరుకో మన్నాడు. ప్రత్యక్షమైన స్వామిని నందీశ్వరుడు స్తుతించాడు. ఆపై-

కం॥ నాదేహము నిత్యంబును
నీదేహము గదిసి వెలసి నిను ధరియింపన్
నీ దివ్యవాహనముగా
నోదేవాధీశ వరము నొసగుము నాకున్ (ఆ2-ప68)

అని వేడినాడు. ఇక్కడ మాట్లాడేది నందీశ్వరుడైతే శ్రోత ఈశ్వరుడు.

రెండవది వక్త శ్రోతగా శ్రోత వక్తగా ఇరువురి మాటలు కొన సాగడం. ముని నట్టడవిలో తపస్సు చేస్తున్నాడు. అతని దగ్గరికి ఒక అనామకుడు భయపడుతూ వచ్చాడు. అపుడు ముని, అనామకుని సంభాషణ ఇలా సాగింది.

సీ॥ "ఓరోరి భీతాత్మ యెక్కడనుండి నీ
వేతెంచితివి యిది యేమి తపము
ఏపురమున నుండు దెవ్వాడ వెవ్వడ
వచుచు నాతని జేర యడుగ మౌని
వినుత వినవయ్య పులినుండి వేగుజాము
గదలి పుష్పంబులకు బోవ గడుపుగదల
సరగనది తీరమున జేరి వజ్జపెట్టి
కొంతదవ్వేగి కూర్చుండి కుతుకమునను (ఆ5-ప78)

అనే పద్యంలో మొదటి రెండు పాదాలలో వక్తమునికాగా శ్రోత అనామకుడు. చివరి నాలుగుపాదాలలో అనామకుడు వక్తకాగా శ్రోత ముని.

మూడవది అనేకవ్యక్తులు ఒకచోట చేరినపుడు మాట్లాడేవిధానం కూడ సంభాషణాత్మక శైలి. చంద్రవతి చెలికత్తెలతో కలిసి శివపూజా పూలు కోస్తున్నారు. వారు పరస్పరం పలకరించుకొన్న విధం ఇలా ఉంది.

సీ॥ మాధవీ నవపుష్పమంజరి చూచితే
యభిరామ నవకలహంస యాన!
యభిరామ నవకలహంసాళి జూచితే
ఖేలాభినవరాజ కీరవాణి!
ఖేలాభినవరాజ కీరాళిజూచితే
నీలకంఠ కలాపనిభ శిరోజ!
నీలకంఠ కలాపనిచయంబు జూచితే
కలమృదుస్వర కలకంఠనాద!
కలమృదుస్వర కలకంఠంబు జూచితే
నిబిడ కోమలాళి నీలవేణి!
నిబిడ కోమలాళి నికరంబు జూచితే
యనుచు గ్రీడ సల్పి రతివలంత (ఆ -ప43)

క॥ రావే విలాసినీ మణి
రావే వనితాలలామ! రావే రమణీ
రావే చకోరలోచన!
రావే కలహంసగమన రాజీవముఖీ (ఆ4-ప60)

నాలుగవది నాటకాలలో ఒకవ్యక్తిరంగంమీదచేసేచేతలుఅభినయానికి సంబంధించినట్లే నద్యశిల్పంలోకూడా నిరూపించడం శేషనాధార్య కవి శ్రీపర్వతపురాణంలో కనిపిస్తుంది. సాధకునికి అడవిలో బిల్వవృక్షం కనబడింది. దానికింద విశ్వేశ్వరుడున్నాడు. స్వామిని సేవించి దివ్య తైలాంజనం కళ్ళకు పూసుకొన్నాడు. సాధకునికి దివ్యదృష్టి వచ్చింది.

అపై మారేడు అక్షులమధ్య భైరవుణ్ణిచూశాడు. సాధకుని భయపెట్టాడు భైరవుడు. అప్పటి సాధకుని స్థితిని కవి వర్ణించిన తీరు--

ఉ॥ ఉబ్బుచు సాధకుడు కదనుబ్బున బొంగుచు సంతసిల్లుచు
బొబ్బలుపెట్టి తిట్టు బొరబొచ్చములాడుచు భీతిలేక తా
గొబ్బున నేగి యాప్రతిమగొట్టి శిరంబును ద్రెవ్వి దమ్ముడుస్
నిబ్బరమట్లు మిట్టిపడి నిల్చియు మూర్ధము నవ్వునిట్లనున్
(ఆ5-ప20)

అనే పద్యంలో ఉబ్బుచు, బొంగుచు, సంతసిల్లుచు బొబ్బలుపెట్టి తిట్టుచు, బొరబొచ్చములాడుచు ఆనేచేతలునాటకంలో అయితే సాధకుని అభినయానికి సంబంధించినవే.

5.9 మహాకవుల అనుకరణలు :

"పూర్వ కవీశ్వర వాక్ప్రయోగదక్షుడు కరుణామతి యెవ్వడతడు కవియన బరుగన్" (ఆ1-ప44) అని అప్పకవి నిర్వచనం. ఈనిర్వచ నానుసారం నాగలూటి శేషనాథార్య కవి వ్రాసిన శ్రీపర్వతపురాణంలో ఎన్నో పూర్వకవుల శైలులను స్ఫురింపజేసేపద్యాలు, పదప్రయోగాలు పలుకుబడులు కనిపిస్తున్నాయి.

పూర్వకవీశ్వరులు అన్నపుడు తెలుగుసాహిత్యంలో ప్రసిద్ధులయిన పూర్వకవులను మాత్రమే ఇక్కడ పరిశీలించడం జరుగుతుంది. శ్రీపర్వత పురాణం ప్రధానంగా క్షేత్రమాహాత్మ్య కావ్యం. ప్రాచీనకవులు తమ కావ్యాలలో క్షేత్రాలను వర్ణించే సందర్భంలో ఎటువంటి శైలిని అవ లంబించారో, అటువంటి శైలినే శేషనాథార్యుడు పుణికిపుచ్చుకున్నాడు. శేషనాథార్యుడు ప్రధానంగా నన్నయ్య, తిక్కన, శ్రీనాథుడు, పోతన ధూర్జటి, శ్రీకృష్ణదేవరాయలు మొదలయిన ప్రాచీనాంధ్ర కవుల

కవితా హృదయాన్ని చక్కగా ఆకళించుకొన్నట్టు ఆయన రచనా విధానాన్నిబట్టి చెప్పవచ్చు.

నన్నయ్య :

సీ॥ దక్షిణగంగనాదద్దయు నొప్పిన గోదావరియుజగదాదియైన
భీమేశ్వరంబును బెడగగుచున్నశ్రీపర్వతంబును చూచియుర్విలోన
ననఘమైనశిష్టాగ్రహారభూయిష్ఠమైధరణీసురోత్తమాధ్వరనిదాన
పుణ్యసమృద్ధమైపొలుచు వేంగిదేశవిభవంబుజూచుచువిభుడుదక్షి

గీ॥ ణాంబురాశి తీరంబును కరిగి దురితహారియైన కావేరి
మహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమతార్థ దానంబు చేసి
కృతార్థుడగుచు (ఆది. ఆ8-వ139)

నన్నయ్య ఆంధ్రమహాభారతంలో అర్జునుని తీర్థయాత్రా వర్ణన సందర్భంలో వివిధక్షేత్రాల ప్రస్తావన ఉంది. ఇది అమూలకం. ఈ పద్యం క్షేత్రమాహాత్మ్య వర్ణనలో తరువాతి కవులకు మార్గదర్శకం. శ్రీపర్వతపురాణంలోని—

కం॥ వందారు దేవతాముని
సందోహము లబ్బురంబు శాశ్వతసదనం
బిందుధరునకును శ్రీనగ
మందిర నిలయునకు బశ్చిమద్వారమగున్ (ఆ3-వ1००)

కం॥ సిద్ధవటేశ్వరు గామిత
సిద్ధి ప్రదుదర్శనంబు చేసిన ముక్తుల్
సిద్ధించు క్రీడసల్పును
సిద్ధామర కిన్నరేంద్ర సేవాన్వితుడై (ఆ3-వ104)

పైపద్యన నన్నయ క్రింది పద్యాలను పోలివుంది.

కం॥ గంగాధర పింగ జటా
సంగమమంగళ విశాలవటుల తరంగన్
గంగానది సేవించెను
గంగాద్వారమున విగత కల్మషుడగుచున్ (ఆది. వ. ఆ8-ప126)

కం॥ విలావన రమ్యములగు
వేలావనములను బవన విచలద్వీచీ
లాలిత సముద్ర విద్రుమ
మాలాపులిన స్థలముల మసలుచు లీలన్ (ఆది. వ. ఆ3-ప137)

ఛందస్సామ్యంతోపాటు శైలీసామ్యాన్నికూడా శేషనాథార్యుడు అనుసరించడం గమనింపదగింది.

తిక్కన :

భారతకవులలో రెండవవాడు తిక్కన. పలుకుబడులప్రయోగంలో అతనికి సాటిరాదగిన కవి మరెవ్వరులేరు. అతని బాటలో నడచిన కవి శేషనాథార్యుడు. సీసపద్య నడకలో, సంభాషణాత్మక శైలిలో, పలుకుబడిలో శేషనాథార్యుడు తిక్కనను అనుసరించాడు.

శేషనాథార్యుడు శ్రీపర్వతపురాణంలో చంద్రగుప్తు నివర్ణించిన తీరు

సీ॥ చేయించెనెవ్వాడు సేవితోర్వీశుల
రాజ్యంబు లక్ష్మీ విరాజితముగ
ప్రేయించె నెవ్వడుర్వర సర్వదిగ్గజ
స్తంభంబులను జయశాసనములు
మాయించె నెవ్వండు మార్తాండ విక్రమో
ద్ధతి జనాకించన ధ్వాంతములను
కాయించె నెవ్వడుత్కట కీర్తిచంద్రికల్

చక్రవాళాంత భూచక్రములను
నతడు జలరాశి పరివేష్టితావనీశ
తాజరాజీవషండ మార్తాండమూర్తి
చంద్ర చంద్రాత పామృతరుచాకీర్తి
గుప్త వంశోద్భవుండు చంద్రగుప్త నృపతి (అ4-ప7)

ఈ పద్యం తిక్కన విరాటపర్వంలో ద్రౌపది భీమునితో ధర్మరాజు గొప్పతనాన్ని గూర్చి చెప్పె పద్యాన్ని తలపిస్తుంది.

సీ॥ ఎవ్వని వాకిట నిభమద పంకంబు
    రాజభూషణ రజోరాజి నడగు
నెవ్వాని చరిత్ర మెల్లలోకములకు
    నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
నెవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
    మానితసంపద లీనుచుండు
నెవ్వని గుణలత లేడు వారాసుల
    కడపటి కొండ పైఁ గలయఁ బ్రాకు
నతడు భూరి ప్రతాప మహాప్రదీప
దూర విఘటిత గర్వాంధకార వైరి
వీరకోటీరమణి ఘృణి వేష్టితాంఘ్రి
తలుడు దేవలమర్త్యుడై ధర్మసుతుడు (వి.ప. అ2—ప191)

వ్యక్తియొక్క గుణగణవర్ణనలో తిక్కన గారి పైసీసపద్య శైలి తరువాతి కవులకు ఒజ్జబంతి అయింది.

సంభాషణలలో అధిక్షేపం చేసే ఘట్టాలలోకూడా శేషనాథారుడు తిక్కననే అనుసరించాడు.

శ్రీపర్వతపురాణం :

కం॥ అధముడ యిటు నిలువుము నీ
విధమెక్కడ శివుని భక్తి విధమెక్కడ దు
ర్విధులకు మెచ్చుడు శంభుడు
బుధులకు నీనగరి పొంతబోరాదు సుమీ (ఆ6–ప68)

పైపద్యం తిక్కన కర్ణపర్వంలో భీముడు రణరంగంలో దుశ్శాసనుణ్ణి వెంటబడిస్తూ చెప్పిన పద్యాన్ని స్ఫురింపజేస్తుంది.

కం॥ ఏమిరః వసులని యార్చవుః నీ
మాటలు నిలువబడియెనేః పసరమః మి
మ్మేము మగుడనిదె యార్చెద
మీమాటకు మాఱు వల్కరెవ్వరు గంటే (కర్ణ ప. ఆ3–ప221)

శేషణాచార్యుడు తిక్కన పలుకుబడులను అనేకంప్రయోగించాడు ఉదాహరణకు-

శ్రీపర్వతపురాణం :

పలుసుమాటలు (ఆ4–ప11)
పులికుట్టుమాటలు (ఆ4–ప11)
సుమాళము (ఆ4–ప37)
చిచ్చఱకోల (ఆ4–ప41)
బొమ్మపొత్తికలు (ఆ5–45)
జాతిత్తి (ఆ5–ప121)
కట్టాణిముత్యాలు (ఆ6–ప15)
కరకంఠుడు (ఆ6–ప73)

శ్రీనాథుడు :

తెలుగులో క్షేత్రమాహాత్మ్య కావ్యాలకు శ్రీకారం చుట్టినవాడు కవి సార్వభౌముడయిన శ్రీనాథుడు. ఇతని భీమేశ్వరపురాణం, కాశీఖండం, శివరాత్రిమాహాత్మ్యం, స్థలపురాణాలను కావ్యీకరించడంలో ప్రథమోదాహరణాలు అవుతున్నాయి. ఎఱ్ఱన నృసింహపురాణము ఈ కోవకు చెందిన ప్రథమ కావ్యమయినా ఈ ప్రక్రియను తెలుగుసాహిత్యంలో విస్తృతం చేసినవాడు శ్రీనాథుడే ఆబాటలో నడచినవాడు శేషనాథార్య కవి. సీసపద్య నడకలోను, పలుకుబడులలోను శేషనాథార్యకవిపై శ్రీనాథుని ప్రభావం కనిపిస్తుంది. సీసపద్యాన్ని చిత్రవిచిత్రంగా నడిపించడంలో శ్రీనాథుడు దిట్ట. తెలుగుసాహిత్యంలో దేశిఛందమయిన సీసపద్యం విలక్షణమయింది. అతిప్రాచీనమయిందికూడా.

శ్రీపర్వతపురాణం :

సీ॥ మందరం చేదేవు మకుటాగ్ర వీధికి
        రాజత్కమద్వతీ రమణఖండ
యేదేవునకు వేల్పుటేఱు జటాజూటా
        పుష్పిత విచకిలస్ఫురిత కళిక
తరళ సహస్రరత్న ప్రభారించోళి
        పాదాంగదం బదే ప్రభువునకును
ఏదేవు గళమున హేలాకలాపంబు
        కాలాగ్ని చీలిమి కాళిమంబు
అట్టిదేవుని నిజదరహాసలబ్ధ
సతత కళ్యాణ కారణోత్సవ సమగ్ర
వాగ్రమాదిక సకలపై భవుని భవుని
భక్తి సేవింతు భావింతు బ్రస్తుతింతు (ఆ1-ప7)

శ్రీనాథుడు భీమేశ్వరపురాణం అవతారికలో బెండపూడి అన్నయను వర్ణించే సందర్భంలోని సీసపద్యం ఇలాంటిదే.

సీ॥ ఏ మంత్రికులదైవ మిందుశేఖరుడు ద
    క్షారామ భీమేశుడఖిలకర్త
యే మంత్రి యేలిక యిక్ష్వాకు మాంధాతృ
    రామనన్నిభుడైన వేమవిభుడు
యేమంత్రి సితకీర్తి యేడు వారాసుల
    కడకొండ యోల చీకటికి గొంగ
యేమంత్రి సౌభాగ్య మిగురుగైదువుజోదు
    లాలిత్య లీలకు మేలుబంతి
యతడు కర్ణాటలాట భోటాంగ వంగ
కురు కుకురు కుంత లావంతి ఘూర్జరాది
నృపసభాస్థాన బుధవర్ణనీయు సుగుణ
మండనుడు బెండపూడన్న మంత్రివరుడు (భీ. పు. అ1-ప19)

శ్రీపర్వతపురాణం :

కం॥ ఎక్కడ జూచిన సురనదు
లెక్కడ జూచినను శంఖహేమ గృహంబుల్
ఎక్కడ జూచిన దీర్ఘము
లెక్కడ శ్రీనగము సాటియే పేనగముల్ (అ2-వ8)

అనే పద్యం శ్రీనాథుని

ఉ॥ ఎక్కడ జూచిన న్సరసి యెక్కడ జూచినదే మందిరంబు
లెక్కడ జూచిన్నది మహీవలయంబున భీమమండలం
బెక్కడ జూచినందటిని యెక్కడ జూచిన బుష్పవాటికం

ఎక్కడ యన్నమండలము లెక్కడ భావనచేసి చూచినన్
(బీ. పు. ఆ3-ప23)

పద్యాన్ని తలపిస్తుంది.

రచనా విధానంలోనేగాక శ్రీనాథుని పలుకుబడులను కూడా శేషనాథాచార్యుడు అనుసరించాడు. ఉదాహరణకు—

శ్రీపర్వతపురాణం :

చిరుసానబట్టు (ఆ4-ప12)
తాటంకిలిలలామాలు (ఆ4 ప74)
మక్కళించు (ఆ4-ప63)
కర్పూర దీపకళి (ఆ4-ప77)
సిరిశైలంబు (ఆ6-ప113)

వంటి ప్రయోగాలు ఎన్నో కనబడతాయి. జననిసమస్తభాషలకు సంస్కృతభాషధరాతలంబునన్(ఆ1-ప28) అనే వాక్యం, శేషనాథాచార్యుడు శ్రీనాథుని భావనతో ఏకీభవిస్తున్నాడనడానికి చక్కని ఉదాహరణ.

పోతన :

అంత్యప్రాసలకు పోతన పెట్టింది పేరు. పోతన పద్యంలో "అర్థం కంటె శబ్దం, ఆ శబ్దరూపంకంటె అది పలికించే నాదం ముఖ్యమైనది. లాక్షణికదృష్టికి భూషణములు తోషణములు ఇత్యాది ప్రాసస్థానాలు త్రిప్రాసస్థానాలు త్రిప్రాసకో క్రిందికో చతురప్రాసం క్రిందికో వస్తాయి కాని అవి ఒకరకంగా వాక్యం చివర వుండే అంత్యప్రాసస్థానంలోవున్నా అంత్యప్రాసల దరువుల్లాగా శ్రవణసుఖాన్ని కూర్చే కూర్పులు" అని డా॥ సి. నారాయణరెడ్డి మందార మకరందాలు పుట 40, 41) అనే గ్రంథంలో వ్యాఖ్యానించారు.

శ్రీపర్వతపురాణం :

కం॥ యోగములు భక్తిరస సం
భోగములు పురాణ శాస్త్ర శ్రవణో
ద్యోగముల జనులకును నను
రాగములన్ వెలుగు మత్తరస్థానముల్ (అ3-ప98)

పైపద్యం రుక్మిణీకళ్యాణఘట్టంలోని ఈక్రింది పద్యాన్ని స్ఫురింపజేస్తుంది.

కం॥ భూషణములకు సెవులకు, బుధ
తోషణము, లనేక జన్మ దురితౌఘ విని
శ్శోషణములు మంగళకర
ఘోషణములు గరుడగమను గుణభాషణముల్ (భాం. మ. ప40)

ధూర్జటి :

శేషనాథార్యుడు శ్రీపర్వతపురాణ రచనలో ధూర్జటిని ఒరవడిగా గ్రహించి వర్ణించిన సందర్భాలు అనేకం కనబడుతున్నాయి.

శేషనాథార్యుడు కావ్య అవతారికలో "మల్లీశ్వరా అనేమకుటంతో వ్రాసిన పద్యాలు ధూర్జటి "శ్రీకాళహస్తీశ్వరా!" అనే మకుటంతో వ్రాసిన శతకశైలిని తలపింపజేస్తుంది.

శ్రీపర్వతపురాణం :

శా॥ నావారున్ గడు జిన్నిప్రాయమున నోనామః శులంబ్రేమతో
శివాయః శులంజెప్పి నాటగొలె నేసేవింప వియ్యాన నా
భావంబందును నిష్కళంకమదు నన్ బ్రోచెదప్పదప్పక్తి సం
భావజ్ఞాన సుధాను భావరతుగా భావింపు మల్లీశ్వరా! (అ1-ప14)

శా॥ నీకుంగాని కవిత్వ మెవ్వరికిని నేనీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబు కంకణము ముంజేఁ గట్టితిన్ బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు నాకదువు కీటిన్ వేర్వులుంగావు
చీ కాలంబుల రీతి దప్పెడు జుమీ శ్రీకాళహస్తీశ్వరా॥
(శ్రీకా. శ. ప. 114)

అలాగే ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యానికి శేషనాథార్యునిశ్రీపర్వత పురాణానికి పద్యరచనా శైలిలో అనేక సామ్యాలు కనబడుతున్నాయి ఉదాహరణకు ఈ క్రింది రెండు పద్యాలు పరిశీలించవచ్చు.

శ్రీపర్వతపురాణం :

మ॥ శివచరిత్రము బీజమంకురము నీసేవావివేకంబు స
త్కవితాశ్రేణులు పల్లవంబులు సమాఖ్యవ్రాతముల్ పుష్పముల్
భవదీయ స్తవముల్ ఫలావలులు తదాస్వాదవ్రజ్ఞులే కీరముల్
ధువికుత్కావ్య మహీరుహంబునకు శ్రీభూభృత్సునాధీశ్వరా॥
(ఆ1–ప15)

మ॥ పురుషార్థంబులు పాదముల్ శుభము తత్పుచ్ఛంబు
తచ్ఛృంగముస్
గిరి శృంగంబులు రోమరాజి తరువుల్ గ్రీవుల్ ది దృష్టావరుల్
వరపుణ్యంబులు దుగ్ధధారలు చతుర్ద్వారస్థ లింగంబులు
ద్ధుర వక్షోజము లీనగంబు నుతులొందున్ గామధేనుక్రియన్
(ఆ2–ప5)

మ॥ ఉదయగ్రావము పానవట్ట, మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి, ధరాధ్వాంతము దూపధూమము, జ్వలద్దీపప్రభారాజికా
ముది, తారా నివహంబులర్పిత సుమంబుల్గా దమోదూరసా

ఖ్యదమై శీతగ భక్తిబింబ శివలింగ చొప్పెప్రాచీదిశన్
(కా. మా. ఆ2–ప13)

మ॥ ఎలదోటల్వనము, ల్వదూకుచము లద్రీందంబు, లాకంటికి
స్థలము ల్వాతెర, లంగజాగము కళాబంధంబు, లిచ్ఛాపసం నం
ఖులు కోవంబున బాయుటల్ తపము సంభోగంబు కైవల్యమం
దుల లీలాగతి నుండు మానవులకెందుంగాన మీచిత్రముల్
(కా. మా. ఆ1–ప21)

అతులిత మాధురీ మహిమకు పేరొందిన ధూర్జటి శైలిని శేష నాథాచార్యుడు తన శ్రీపర్వతపురాణంలో కవితా ప్రశంసలో ఈ క్రింది పద్యభాగంలోకూడా స్ఫురింపజేశాడు.

"వారిజగర్భపత్ని పదవారిజ సన్మధుమాధురీధురీ
స్ఫురకవిత్వ తత్త్వమును.... .... (ఆ1–ప32)

అనే ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యంలో శివుడు నత్కీరుని అధిక్షేపిస్తూ చెప్పిన పద్యాన్ని తలంపింపజేస్తుంది.

"ఈరాజన్యుని మీదనే గవిత సాహిత్య స్ఫురణ్మాధురీ
ధారు ప్రౌఢిమ జెప్పి నంపవిని.... .... (కా. మా. ఆ3–ప166)

శ్రీకృష్ణదేవరాయలు :

వస్తుస్వరూపాన్ని సూక్ష్మంగా భావించి వర్ణించడంలో ఆముక్త మాల్యదాకారుడయిన శ్రీకృష్ణదేవరాయలు అందెవేసిన చేయి.

శేషనాథాచార్యుడు పంచమాశ్వాసంలో భైరవబిల ప్రశంసఘట్టంలో సాధకుడు దర్శించిన బెబ్బులి వర్ణన చేశాడు.

సీ॥ జితదైత్య కరవాల జిహ్వాసాగగ నిల్చి
యాయూతవదన గహ్వరము దెఱల
బ్రహ్మాండ కర్పర గ్రాసక బుద్ధిని
భీకరాకృతిని నేచి బిట్టులాడు
గండమహేంద్ర సంఘాతంబులూటాడ
నిశ్వాసపవనంబు నిండనిగుడ
ముటఘుట ధ్వనిశైలగుహలు చిల్లులువోవ
నింగినా కస కద్రువంగ రొప్ప
నెడదకొనిచూచు కన్నులురుల మెఱయు
బద్ధమాత్సర్య విక్రమోపాక్రమాత్మ
భగ్ననిర్భర విక్రముభ్రుకుటవేళ
భూనభోవ్యాప్తిశార్దూల పుంగవుడు (ఆ5-ప111)

చ॥ కరులపదంబు కేసరి నికాయము కోపమశేష వృశ్చికో
త్కర విషజాలముల్ శిఖిశిఖాతతి వేడిమి వాయుతీవ్రముల్
సురరిపురాజు తీవ్రతయు జొక్కముగా నొకరూపు దాల్చిని
ర్భరగతి నిల్చి బెబ్బులి యభంగుర దర్పమహోగ్రమూర్తియై
(ఆ5-ప113)

ఉ॥ హొందుచు బుగ్గలింపుచు నభోగతి దాటుచు మీటిపొటుచున్
ద్రెవోగుచు నావులింపుచును మూల్గుచు మీసము లొరగించి తా
నంగము సొచి నిల్చి యలిక్రాగ్రము ద్రుక్కడ వారమార్చుచున్
ముంగల జిహ్వసాగనిడ మూతులు నాకుచు హత్తరింపుచున్
(ఆ5-ప113)

ఇది ఖాండిక్య, కేశిధ్వజసంవాదఘట్టంలో యజ్ఞధేనువును బెబ్బులి చంపి తనగుహలోకి ఈడ్చుకొనిపోయిన సన్నివేశాన్ని స్ఫురింపజేస్తుంది.

చ॥ పులుమఖశాలికా నికట భూముల మేయుచునేటి వెంట బె
ల్లలమెడు నీఱు ముందటెసి యామ్యవతాకన ఘర్మధేను వా
కెళవుననాడు వాల భుజగింగని గోంద్రని యంగలార్చుచున్
గళగతఘంట మ్రోయ సుఖకం బిడుగుంబలె దాకి యుద్ధతిన్
(ఆ. మా. ఆ3-ప19)

ఉ॥ గబ్బునమక్షికంబయి మొగంబడువద్దరు పర్ణముల్పడన్
ద్రొబ్బుచు, గార్మొగిళ్ళ రొదతో బురణించెడు బొబ్బరింతగా
డ్పుబ్బి విసంజ్ఞగాగ జెవులాదిన వల్లవుడుర్విగూంగా
బెబ్బులి గొంతు క్రోల్గబట్టి పెల్లున మార్మెడద్రెళ్ళదాటుచున్
(ఆ. మా. ఆ3-ప20)

ఆ॥ తనువు గొన్ము గొరిజ గొనతుండ మబపుచు
బప్పడెసగ దోక నప్పళించి
కొణితంబు గ్రోలుచునే నేర్పుడ్డై ఘర్మ
గవిని గవికి నీడ్పు నవసరమున (ఆ. మా. ఆ3-ప21)

చ॥ పొలమరులందు గూతలిడభూసురులన్నది వార్చివార్చిమ్రా
కుల తుదలెక్కి చపటలు గొట్టి యదల్పగ సాహిణీల మా
వుల బలు పంగ వైచి నెలవుల్వెస నాకుచుబోయె వృక్షమం
డలికలు తూలుచు స్ఫుటఘుట ధ్వనిసొరె ముఅంగి చూచుచున్
(ఆ. మా. ఆ3-ప22)

రాయల కవితాశక్తిని వ్యాఖ్యానిస్తూ కవిసామ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వంలో "జంతు స్వభావమింత వింతగా వ్రాయువారు రాయలకు మించి వుండరు ఇట్లు కనులకు గట్టునట్లు చిత్రించగల్గుట యొక మహాశక్తి" (ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం,

Vol. 4 పు. 705) అని పేర్కొన్నాడు. శేషనాథాచార్యుని విషయంలో కూడా పైమాటలు చక్కగా సరిపోతున్నాయి.

కొన్ని విలక్షణ పదప్రయోగాలు :

1. శలాక :

రాయలు చిగురాకును వర్ణిస్తూ వ్రాసిన సీసపద్యం ఎత్తుగీతలో

"ఘనమణి శలాక చిగురాకు కలయమొలిచె (ఆ మా. 5-110)

శేషనాథాచార్యుడు శలాక శబ్దాన్ని రెండురకాలుగాప్రయోగించాడు

1. సువర్ణ సలాకలను బోలు వారి జనయువర్ (ఆ6-ప87)

2. బొలతియో పచ్చకప్పురపు శలాకయో (ఆ6-ప90)

ఈనాడు సలకా, శలాక అని ఇంటిపేరు కలిగిన వారున్నారు. ప్రాచీన పండితులలో శలాకా పరీక్ష అనేది ప్రసిద్ధమయినది. శలాకా పరీక్ష అంటె "తప్పు బరీక్షింపుడని తాను జదివిన శాస్త్రము, లభింప బడిన తాళపత్ర గ్రంథము చేతికియ పరీక్షకుడొక శలాకను (సళాకు-లోహపుకడ్డీ లేదా పుల్లగాని) ఆ గ్రంథమున నెందో గ్రుచ్చి గ్రంథము విప్పి రెండువైపులా పుటలలోని విషయమును తడవుకొనకుండ పూర్వ పదములకవిరోధముంగ జెప్పునగా సుసన్యసించి జయముగొనుట" (చూ. శలాక రఘునాథశర్మ "భారతి ధ్వని దర్శనమువకు వెంపరాల సూర్యనారాయణశర్మ గారి అభిప్రాయం.)

2. అల్లొనేరేడు :

ఈ పదం వివాదగ్రస్తమయిన పదంగా తెలుగుసాహిత్యంలో

కనబడుతుంది. ఈపదాన్ని మొట్టమొదట ప్రయోగించినవాడు భాస్కర రామాయణకర్త.

కం|| "ఎల్లసుఖంబులు చేకొన
బెల్లుట యౌవనము నందచిక్కిన మరిపో
చెల్లునె? వెన్నెల దినముల
నల్లోనేరేళ్ళుగాక యావలగలవే? (భా.రా.సుం.కాండ. ప. 108)

గడచిన కాలం తిరిగిరాదు. "హుళక్కి" అనే అర్థంలో ప్రయోగింపబడింది. ఈ పదాన్ని వ్యాఖ్యానిస్తూ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు "ఆరుయుగాల ఆంధ్రకవిత" అనే గ్రంథంలో, సీతా! నీఅందమైన యౌవనం వృథాగా గడచిపోతున్నది. పరుగెత్తిపోయే నీటి ప్రవాహం మళ్ళీ వెనక్కురాదుగదా! పరుగెత్తే నీటివాగు మళ్ళా వెనక్కురాదనడం సర్వసాధారణమయిన ఉపమానం. దీనిని తెలుగు హృదయానికి దగ్గరగా తేవాలంటే వారి మాటల్లోనే చెప్పాలి. సుందరకాండలో కవి ఆ ఒడుపు చూపాడు. సీతా! ఏ సుఖమైన యౌవనంలోనే అనుభవించాలి. వెన్నెలరాత్రులలో అల్లో నేరేళ్ళుగాని తర్వాత ఏముంది? అల్లోనేరేళ్లు అంటె ఇక్కడ పండ్లుకావు. ఆడపిల్లలు వెన్నెలరాత్రులలో గంతులువేస్తూ పాడుకునే పాటలు (అల్లోనేరేళ్లు-పండ్లుగావు. రామడుగు వేంకటేశ్వరశర్మ. తెలుగు పరిశోధన 1989 పుట 118-119). తెలుగు జానపదగేయాల్లో అల్లోనేరేళ్ళు అంటె పాడుకునేపాటలు అని ఇంద్రగంటి వారి అభిప్రాయం.

కాని శ్రీపర్వతపురాణంలో శేషనాథార్యకవి "అల్లోనేరెడువోలె" అని స్పష్టంగా ప్రయోగించాడు.

"అల్లోనేరెడుపండువోలె నరచే నత్యుగ్రకాకోలమున్
ద్రోల్లాసంబున నిల్పి గ్రుక్కగొని.... .... (ఆ1-ప4)

శివుడు కాలకూటవిషాన్ని "అల్లోనేరేడు" పండులాగా అరచేతిలో, ఇముడ్చుకొని మ్రింగాడు. కష్టసాధ్యమయిన ఒక పనిని అవలీలగా చేయడానికి "కరతలామలకం", కొట్టినపిండి, అనే అర్థంలో వాడడం ప్రసిద్ధమయింది. కరతలం అనగా అరచేయి. అమలకం అనగా ఉసిరి కాయ. అరచేతిలో ఉసిరికాయ ఎలా ఇముడుతుందో క్లిష్టమయినపనిని సాధించినవారిని ప్రశంసిస్తూ కరతలామలకం అనివాడడం తెలుగువారి సంప్రదాయం. శేషనాథార్యుడు అరచేతిలో ఉసిరికాయ (కరతలా మలకం) అని ప్రసిద్ధమయిన పైజాతీయాన్ని ప్రయోగించకుండా "అరచేతిలో అల్లోనేరెడు పండు" అని ప్రయోగించాడు. శివుడు అంత అవలీలగా కాలకూటవిషాన్ని గ్రహించి మ్రింగినాడని చెప్పడం కవి హృదయం.

అల్లోనేరెడు అనేపదానికి మరొక అర్థభేదం ప్రాచీననిఘంటువులలో కనబడుతుంది. అమలాపురపు సన్యాసి కవి వ్రాసిన "సర్వాంధ్రసార సంగ్రహము" అనే పద్యరూప నిఘంటువులలో-

"మ్రొక్కు, దండము, వెలుమోడ్పుజుగుడు నాగ
నతికి బేళ్లగు జెంగనాలు, జెంక
జాలు జోహార్లుజోడాఅల్లోనేరేళ్లు
అని దద్విశేష సమాఖ్యలగును"

అల్లోనేరేళ్లు అనే పదాన్ని ఈనిఘంటువుకర్త "నమస్కారమందలి భేదంగా గుర్తించాడు. ఇన్ని అర్థభేదాలు కలిగి వివాదగ్రస్తమయిన ఈ పదాన్ని శేషనాథార్యుడు "కరతలామలకం" అనే అర్థంలో ప్రయోగించి వుండడం విశేషించి గమనించదగినది.

3. కర్మారీశ్వరము :

శ్రీపర్వతపురాణం ప్రధానంగా శైవమాహాత్మ్య కావ్యం, వీరశైవ

మతంలో భక్తులు పాటించే కొన్ని విలక్షణమయిన ఆచారాలున్నాయి. సాధారణంగా జీవితంపై విరక్తి కలిగినవాడు కొండకొమ్ము ఎక్కి కిందికి దూకి ప్రాణత్యాగం చేయడాన్ని "భృగుపాతనం" అంటారు. తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యం అయుత, నియుతో పాఖ్యానంలోని ఒక పద్యం ఇలా వుంది.

"శ్రీధరంబు లెక్కి యురుకనే
శుచకుంభ యుగళి శానొల్లననిన (పాం. మా. ఆ5-ప184)

ఈవిధంగా కొండలెక్కి ఉరకడం అనేది ప్రాచీనసంప్రదాయంలో ఉన్నా, వీరశైవసంప్రదాయంలో విరక్తుడయిన భక్తుడు మోక్షాన్ని కోరి శ్రీశైలశిఖరాన్ని ఎక్కి కిందికి దూకి ప్రాణ పరిత్యాగం చేయడం ఒక విలక్షణమత సంప్రదాయంగా కనబడుతుంది. దీనికి ప్రబలోదాహరణం పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర.

"కరమర్థిచేసి యా కర్మారి నురుకు
ననఘుల భవ పరిత్యక్తమానసుల
నజిమజి నవలి కర్మారీశ్వరమున
సురుకు పుణ్యులంజూచి
పడియెడు దేహంబు
నడిమిడిదేహంబులెన్నంగజెక్కాడు (పం. చ. పుట)

ఈ పద్యభాగాన్ని "గ్రంథగ్రంథులు" అనే శీర్షిక కింద వేటూరి ప్రభాకరశాస్త్రి గారు "శ్రీశైలము పై కర్మారీశ్వరమని యొక పుణ్యస్థల మున్నది. అది కొండకొమ్ము అక్కడినుండి భక్తులు పుణ్యలోకప్రాప్త్యర్థమై నేలకుఱికి ప్రాణత్యాగము చేయుదురు. క్రింద బడుచున్నవాడు, అంతరాళమున నున్నవాడు ఉఱుకనున్నవాడు అన్న క్రమమున ఎడ తెగకుండ శివరాత్రి నాడక్కడ భక్తులు ఉఱుకుచునేయుండెడివారు. ఈ కర్మారియే తెనుగున కనుమూరియయినది" అని స్పష్టం చేశారు.

శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో కర్మారీశ్వర తీర్థ ప్రశంస మూడుచోట్ల కనబడుతుంది.

కం॥ దుర్మద బహు జన్మాంతర
కర్మోర్ఘ్వ దురిత పాతఖండ కలనా
నిర్మాణ పుణ్యఫలదము
కర్మారీశ్వర మభీష్టకారణమనఘా (ఆ3-ప48)

కం॥ నిర్మల పుణ్యోన్నతి చే
శర్మ ద పలఫల విశేష సామర్థ్యములన్
నిర్మింపజాలు తీర్థము
కార్మారీశ్వరము సాటిగలదె జగతిన్ (ఆ3-ప49)

పాపములను నశింపజేయడమేకాక పుణ్యములను సంపాదించి పెట్టునట. ఈ కర్మారీశ్వరక్షేత్రంలో ప్రాణత్యాగంవల్ల సిద్ధించునని వీరశైవభక్తుల విశ్వాసంఅంటె కొండకొమ్ముమీద నుండి కిందికి ఉరికినవాడు సూటిగా కైలాసానికి పోతాడనివారి భావన. దీనికి ప్రోదల్భమయిన వాక్యం శ్రీపర్వతపురాణంలోనే కవి ఇట్లు చెప్పినాడు.

"సర్గాపవర్గాది సారసౌఖ్య ప్రదా
శ్రమము కర్మారీశ్వర స్థలంబు (ఆ4-ప72)

అనే పద్యభాగంలో వీరశైవమత విశ్వాసం స్పష్టం చేయబడింది. కర్మారీశ్వరస్థలంలో ఉరికి ప్రాణత్యాగం చేసిన మోక్షగామి అవుతాడనడం ఒక మతసంప్రదాయంగా గుర్తింపదగ్గ విషయం.

**4. చిద్గగనము :**

ఇది యోగ పరిభాషకు సంబంధించిన పదం. "చిద్గగనచంద్రిక"

అనే తాంత్రిక గ్రంథం. కాళిదాసుడనే నామాంతరం కలిగిన శ్రీవత్సుడు (క్రీ.శ. 7వ శతాబ్దం) వ్రాశాడు తెలుగుసాహిత్యంలోని ప్రాచీనకవులలో పిల్లలమర్రి పినవీరభద్రుని శృంగార శాకుంతలంలోనూ, ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోనూ, అధునికకవులలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి రామాయణ కల్పవృక్షంలోనూ చిగ్గనన శబ్దం ప్రయుక్తమయింది.

శా॥ లీలన్మత్యమనాడిగా జమిలిగాలిం జొన్పలావెక్కియు
క్కలంబై యోగభ్రాశి చిద్గగనవీథిం జెంది.... (ఆ2-ప114)

"చిద్గగనేశ్వరంబగు గగనేశ్వరంబును" (కా. మా. ఆ3-ప187)

"....శవన్మయుమైన పూర్ణ చి
ద్గగనములో మమ్ముంగలసి క్రమ్మఱ బుట్టెడు బాధ మాన్పవే
(కా. మా. ఆ2-ప124)

"శ్రీమంజూషిక శక్తరక్షణ కళా శ్రీచుమంచు వానంద స
ల్లీమంజు ప్రసవంబు చిద్గగన ప్రాలేయాంశువున్
(రామాయణ కల్పవృక్షం, బాలకాండ, పద్యం 1)

శేషనాథార్యుడు శ్రీపర్వతపురాణంలో యోగరహస్యాలు అనేకం చెప్పాడు. అందులో కీలకమయింది చిద్గగనము అనే పరిభాషావదం. యోగసాధకుడు సహస్రారకమలంనుండి స్రవించేఅమృతాన్ని ఆహారంగా గ్రహించి యోగసిద్ధిని పొందుతాడని యోగశాస్త్రం చెబుతుంది. కాబట్టి చిద్గగనమనే పదం యోగ పరిభాషకు సంబంధించిన పదంగా గుర్తింపబడింది. చిదంబరం అన్నా చిద్గగనన్నామ రెండూ ఒక్కటే.

శ్రీపర్వతపురాణంలో సిద్ధగన శబ్దాన్ని కవి ఈ క్రింది పద్యంలో ప్రయోగించాడు.

చ॥ ఒడికముగాగ నెన్నడిమియుగ్గులు మానిపి శంభుమూర్తికిన్
విడిదలకై దళద్వయ నవీన పయోజనము నిల్పి యందుపై
మృడుగని సౌఖ్యమంది యటుమించిన పశ్చిమనాడిచేతమై
వడి గరగించె సిద్ధగనవాటిక యందు బ్రమోద చంద్రునిన్
(ఆ2-ప28)

చంద్రునినుండి అమృతం స్రవించడం కవితా సంప్రదాయం ఉంది. అందుకే చంద్రునికి సుధాకరుడని పేరు. యోగి చంద్రబింబం నుండి స్రవించు అమృతధారచే యోగసిద్ధిని పొందడం అంతరార్థం. ఇది సాంకేతికమయిన విషయం, రహస్యాంశంతోకూడి ఉంది.

శేషనాథార్యుడు 'పేయిన్నార్పూటు స్వరంబులంటి (ఆ2-ప30) అని ప్రయోగించాడు. ఇక్కడ స్వరమనగా సంగీతశాస్త్రంలోని స్వరం కాదు స్వరయోగం అన్నది యోగశాస్త్రానికి సంబంధించింది. తొలి తెలుగు స్వరయోగి గణపవారాధ్యుడు (క్రీ. శ. 1267-1386) స్వర శాస్త్రమంజరి అనే గ్రంథాన్ని వ్రాశాడు. సుప్రసిద్ధుడయిన వీర బ్రహ్మేంద్ర యోగి క్రీ శ. 1608-1693) కూడా స్వరయోగ ప్రవక్తలే. శేషనాథార్యుడు యోగశాస్త్రసంబంధమయిన స్వరయోగాన్ని ప్రస్తావించి ఉండడం విశేషించి పేర్కొనదగింది.

శేషనాథార్యకవి నన్నయ్య, తిక్కన, శ్రీనాథుడు, పోతన, ధూర్జటి, శ్రీకృష్ణదేవరాయలను అనుసరించాడని ఫలితార్థం.

తరువాతి ప్రకరణం శేషనాథార్యకవి వైదుష్యం.

కం॥ "లాలాట నయన హుత భు
క్కీలా నిష్పిత మీనకేతునకు స
త్కీలాలజ సంభవముని
పాలన కర్తకును శైలభర్తకు జేజే" (ఆ2-ప.96)

సంఖ్యాసూచిక

1. బ్రౌను తెలుగు కావ్యసముద్ధరణము, పుట 310.
2. బ్రౌను తెలుగుకావ్య సముద్ధరణము, పుట 300.



# 6. శేషనాథార్యకవి వైదుష్యం

వైదుష్యం అంటే పాండిత్యమని అర్థం. పాండిత్యం అనేది బహుగ్రంథ పరిచయానికి నిదర్శనం. ప్రత్యేకించి శాస్త్ర పరిచయాన్ని వైదుష్యంగా వెలగట్టడం విమర్శకుల సంప్రదాయం. కనుకనే సోమన వైదుష్యం, శ్రీనాథుని వైదుష్యం అనేమాటలు ప్రచారంలోకి వచ్చాయి. కవి ఏగ్రంథాన్నయితే వ్రాస్తున్నాడో, ఆగ్రంథానికి పునాదిరూపమయిన శాస్త్ర పరిచయం పెంచుకోవడం అవసరం. ప్రాచీనకవులందరు విభిన్న శాస్త్రవేత్తలు. వారు తమరచనలలో ప్రాస్తావికంగా తమ పాండిత్యాన్ని ప్రదర్శించటం అలవాటు. బహుభాషా పరిచయం, అనేకానేక గ్రంథ పరిచయం, గుహ్యాంశముల అవగాహన, పండితజనసమ్మాన్యత అనేవి వైదుష్యానికి గీటురాళ్ళు. ఈ దృష్టితోచూస్తే శేషనాథార్యునిలో వైదుష్యం ఉన్నట్లు కనిపిస్తుంది. ఆ వైదుష్యం ఏడురకాలుగా విశ్లేషించి పరిశీలించడానికి వీలుంది.

6.1 భాషావైదుష్యం :

తెలుగు కవులందరూ సంస్కృతభాషా ప్రవీణులే. శేషనాచార్య కవికి సంస్కృతమంటే ఎంత గౌరవమో తెలుగన్నా అంత అభిమానం. అందువల్లనే కావ్యాదిలో–

"జనని సమస్త భాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘన లలితార్థ గౌరవవిలాసి తెనుంగభిరమ్యము" (ఆ1-ప28)

అని శ్లాఘించాడు. తెలుగును తక్కువ చూచే సంస్కృత దురభిమానుల్ని–

కం॥ "తెనుగైన నేమి కవితా
జనితాలంకార చిత్రసంగత పద వ
ర్ణన వచన రచన చతురత
విని యోగ్యంబైన కృతియు వింద్రుమాహాత్మ్యల్ (ఆ1-ప25)

అని సహృదయులకే నిర్ణయం వదిలిపెట్టాడు.

6.2 వైదికవైదుష్యం :

శేషనాచార్య కవికి వేదోపనిషత్ పురాణేతిహాస పరిచయముందనడానికి శ్రీవర తపురాణమొక సాక్ష్యం. సనత్కుమారుని ఆశ్రమవర్ణన చేస్తూ శేషనాచార్యకవి–

సీ॥ మైత్రాయణీయంబు మండూక శౌక్లీయ
సామాయణీయాది శాఖలందు
వాగ్దాంతపేయంబు వైవేయ శౌనక
శ్చాటపాయ నీయాది శాఖలందు
గాపాలి వారాహ గర్గా సురాణీయ

చరక కాత్యాయన శాఖలందు
పైథేయ ముద్గల వారా సురాజాది
శాలీయ బాష్కల శాఖలందు
దధుపశాఖాది సూక్త ప్రధానవచన
బరగి వేదాంత సూక్తులువన్యసించ
ఖండనా ఖండనోద్దండ గరిమ మెఱసి
వేదభాష్యంబులజెప్పుచు విధిసుతుండు (ఆ1-వ48)

అనే పద్యం వ్రాశాడు.

ఋగ్వేదానికి 21 శాఖలుండేవని ప్రసిద్ధి. వీటిలో శాకల-బాష్కల-ఆశ్వలాయన-శాంఖాయన-మాండుకేయ శాఖలు ప్రచారంలో వుండేవని చరణవ్యూహం చెబుతుంది. వీటిలో ఆశ్వలాయన, శాంఖాయనశాఖలు "శాకల" శాఖకంటె పెద్దగా భిన్నమయినవి కావు. అందువల్లనే శేషనాథార్యకవి మండూక-బాష్కల శాఖలనే ప్రస్తావించాడు.

వేదవ్యాసునిద్వారా ఋగ్వేదాన్ని అధ్యయనంచేసినవాడు పైలుడు పైలుడు ఋగ్వేదాన్ని ఇంద్రప్రమతికి, బాష్కలునికి ఉపదేశించాడు. ఇంద్రప్రమతి మాండుకేయునికి అధ్యాపనం చేశాడు. దీనినే శేషనాథార్య కవి "మండూక" అని ప్రస్తావించాడు.

వేదవ్యాసుని ద్వారా ఋగ్వేదాన్ని అధ్యయనం చేసిన వాడు బాష్కలుడు. ఇవి అంతగా విస్తరించలేదు అయినా శేషనాథార్యునికి ఈ భాగం పరిచయమున్నట్లు తెలుస్తుంది.

శాకల్యుని శిష్యులలో ముద్గల-గాలవ-గ్వాలీయ-వాత్స్య-శైశిరులనే వారు ప్రసిద్ధులు. వీరిలో ముద్గల శాఖా పరంపర బీహార్ ప్రాంతంలో ఉండని ప్రసిద్ధి. శేషనాథార్యకవి "ముద్గల" పరంపరను ప్రస్తావించాడు.

కృష్ణయజుర్వేదానికి 80 శాఖలున్నాయి. అయితే ప్రచారకులను బట్టి ఉత్తరదేశీయులు, మధ్యదేశీయులు, ప్రాచ్యదేశీయులనే భేదం వుంది. ఉత్తరదేశీయ ఆచార్యులలో "శ్యామాయని" ముఖ్యుడు. అరుణి మధ్యదేశీయుడు. శేషనాథార్యకవి"సామాయణీయాది"శాఖలను ప్రస్తావించాడు.

శుక్ల యజుర్వేదంలో 12 భాగాలను చరకశాఖలంటారు. వైశంపాయనుని మరోపేరు చరకుడు. చరక, ఆహ్వరక, కంఠ-ప్రాచ్యకఠ-కపిష్ఠలకఠ-అష్టలకఠ-చరాయణీయ-వారాయణీయ - వార్తాంతరీయ-శ్వేతాశ్వతర-ఔపమన్యవ-మైత్రాయణీయ శాఖలే చరకశాఖలు, వీటిలో శేషనాథార్యకవి మైత్రాయణీయం-వార్తాంతపేయములనుస్మరించాడు,

కృష్ణయజుస్సంహితలలో 17 శాఖలున్నాయి. వైధేయ-శాపేయ కౌణ్యాయన-వైనేయ శాఖలను శేషనాథార్యకవి స్పష్టం చేశాడు.

అధర్వణ వేదానికి 9 శాఖలుండగా వీటిలో "శౌనక" శాఖను చెప్పాడు. శాగాశ్రీపర్వతపురాణంలో కాపాల-వారాహ-గర్గ-అసురణీయ శాఖల ప్రస్తావన వుంది, వీటిని గురించి వివరాలుతెలియవు. ఉదాహరణాల వల్ల శేషనాథార్యకవికి వేదశాఖలపట్ల సంపూర్ణ అవగాహన వున్నట్లు స్పష్టం.

సీ॥ తరుణేందు ధరు బృహదారణ్య కరహం
 సోపనిషద్వచస్తుతుల దలచు
సమ్మతించును శివసంకల్ప సూక్తుల
 శ్రీరుద్రసూక్తుల శివుని మహిమ
రతిపతిధ్వంసు నారాయణ బ్రహ్మోప
 నిషదక్తులను సహర్షితము పొగడు
గైవల్య జాబాలకాలాగ్ని రుద్రోప

నిషదర్థములు నీవు నియుతిదలచు
వేదపాదస్తవంబుల విశ్వనాథుడు
సమ్మతించుచు సేవించు సంభ్రమమున
నచలితంబును దుష్కరమైన తపము
సలుప ప్రత్యక్షమై నిల్చె శంభుడంత (ఆ2-ప60)

అనే పద్యంబట్టి ఈ కవికి అరణ్యక-ఉపనిషత్ పరిజ్ఞానంకూడా ఉన్నట్టు స్పష్టం.

63 యోగవైదుష్యం :

చిత్తవృత్తుల్ని నిరోధించడమే యోగంతో దేహం వదలిపెట్టడం ప్రాచీన సంప్రదాయం. భగవత్సాక్షాత్కారానికి "యోగం" ఒకమార్గం శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో చాలచోట్ల "అష్టాంగయోగాన్ని" ప్రస్తావించాడు.

"అష్టాంగయోగ భక్తి వి
శిష్టాచార ప్రసిద్ధ" (ఆ2-ప45)

"చతురంతర యోగములన్
జతురామ్నా యాగ మోక్షసమ్మతులందున్ (ఆ2-ప51)

"అష్టాంగ భక్తిరతుడై
యష్టవిధార్చనములందు నతికుశలుండై" (ఆ2-ప55)

శ్రీపర్వతపురాణంలో సామాన్యయోగం, హఠయోగం కూడా వర్ణితం. పర్వతుని నిరాహారవ్రతం (ఆ2-ప71), పంచాగ్నిమధ్యవ్రతం (ఆ2-ప74), పరోపరమధ్యవ్రతం (ఆ2-ప75) మొదలయినవి పేర్కొనదగినవి.

శిలాదుని తపస్సు, పర్వతుని తపస్సుకంటె భిన్నముయింది. ఇందులో సర్వశాస్త్ర ప్రమేయం కనిపిస్తుంది.

"పశ్చిమనాడిచేత పైపడి గరగించె" (ఆ2-ప28), "ఇరువది యొక్క వేయిన్నూర్లు శ్వాసంబులంబై దిన పక్షమాసఋతువులు నడచు దినవార నక్షత్రయోగ కరణగ్రహణ పురోగమ కాలచక్ర స్వరచక్రంబు లనేక ప్రకారంబుల జంద్ర సూర్య పక్షంబులు, చంద్రసూర్యతిథులును జంద్ర సూర్యయామంబులు, చంద్ర సూర్య ఘటికలు, చంద్ర సూర్య గ్రహంబులై నాడికా మార్గంబుల వర్తిల్లునందు విషామృత స్వరఫలం బులవలన హృదయ పద్మోపకంఠ దీప్తాష్టదళ జీవహంస సంధాన ఫలంబులు నాత్మోదయం బంద గాంచుచుందు" (ఆ2-ప30)

పూజాఫలం :

పూజా విధానానికి సంబంధించినవి, వ్రతపాలనకు సంబంధించినవన్నీ ఆచార వైదుష్యంలోకి వస్తాయి.

శ్రీపర్వతలింగానికి షోడశోపచారాలు చేసే వారికిలిగే ఫలితాలు కవి స్పష్టం చేశాడు. పూలతో స్వామిని పూజించే వారికి విభవములు అందుతాయి (ఆ3-ప25). గంగలో స్నానం చేసి స్వామి ఎదుట మంగళగీత వాద్యాలతో మహిమస్తోత్రాన్ని చదివే వారికి సుఖఫలం (ఆ3-ప26) కపటంలేకుండా మారేడుపూలు, దెంగల్పపూలు ద్రోణాది పుష్పాలతో మల్లికార్జునస్వామిని పూజించేవారికి ముక్తిఫలం (ఆ3-ప27) పంచామృతంతో స్వామికి అభిషేకం, భజనచేసే వారికి రాజాభిషేకఫలం (ఆ3-ప28) స్వామి గుడిని ఆవుపేడతో అలికిన వారికి స్వర్లోక దివాంగనా సంయోగప్రాప్తి (ఆ3-ప29) స్వామికి రమ్యాగారం నిర్మిస్తే రుద్రగణాలమధ్య నివాసఫలితం (ఆ3-ప30) కలుగుతుందని స్పష్టం చేశాడు.

గడ్డిగబావి మల్లికాకుండాలలో స్నానంచేసి స్వామిని సేవించే వారికి రుద్రచిహ్నాలతో ప్రమథాధీశ్వరులు అయ్యేఫలం (అ3-వ37, 38, 39), కుండితీర్థంలో స్నానం చేసి స్వామిని సేవించే వారికి శుభ ఫలం (అ3-వ40). ఘంటికాకుండంలో స్నానంచేసి దానంచేసి లింగ దర్శనం చేసే వారికి కోర్కెలు నెరవేరి బ్రహ్మహత్యాపాపాలు తొలిగే ఫలం (అ3-వ43) హాటకేశ్వర తీర్థం, పంచపల్లవధార తీర్థాలలో స్నానంచేసి స్వామిని పూజించిన వారికి కోర్కెలు తీరేఫలం (అ3-వ51) భోగవతీ, సరస్వతీ, శ్రీకోటి లింగాచలం, మందాకిని, కిన్నరేశ్వరం, గంగాచలం, శిరరేశ్వరం దర్శించిన మానవులకు శుభఫలం కోర్కెలు నెరవేరే ఫలం (అ3-వ52), పాతాళగంగలో స్నానంచేసి ధర్మంచేసే వారికి పాపరాహిత్యఫలం (అ3-వ55), రుద్రపాదసన్నిధిలో పితృ దేవతలకు శ్రాద్ధం చేసే వారికి సంతృప్తి ఫలం (అ3-వ56), సౌగంధికా బిల్వపుష్పాలతో స్వామిని సేవించే వారికి సౌభాగ్యఫలం (అ3-వ59), శ్రీశైలశిఖరం దర్శిస్తే భయంకరమయిన యమలోకం చూడని ఫలం (అ3-వ66), శిఖరేశ్వరలింగాన్ని దర్శిస్తే పాపరాహిత్యం, విముక్తి ప్రాప్తిఫలం (అ3-వ67).

శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో ఏఏ మాసాలలో శ్రీపర్వత స్వామిని సేవిస్తే ఏఏ ఫలితాలు కలుగుతాయో స్పష్టం చేశాడు. కార్తీకమాసంలో సేవిస్తే వాజపేయ యజ్ఞఫలం (అ3-వ12) మార్గశిర మాసంలో సేవిస్తే పౌండరీకమఖఫలం (అ3 వ13) పుష్యమాసంలో సేవిస్తే అతిరాత్ర యజ్ఞఫలం (అ3-వ14), మాఘమాసంలో సేవిస్తే రాజసూయ యాగఫలం (అ3-వ15). ఫాల్గుణమాసంలో అయితే సౌత్రామణి ఫలం (అ3-వ16), మధుమాసంలో అయితే బహుసువర్ణ యజ్ఞఫలం (అ3-వ17) వైశాఖమాసంలో అయితే లక్షగోవుల్ని దానం

చేసిన ఫలం (ఆ3-వ18) జ్యేష్ఠమాసంలో అయితే సువర్ణదాన ఫలం (ఆ3-19) ఆషాఢమాసంలో అయితే కోటి గోవుల దానం చేసినఫలం (ఆ3-వ20) శ్రావణమాసంలో అయితే పాత్రత నెరిగి దానం చేసిన ఫలం (ఆ3-వ21), భాద్రపదంలో అయితే కోటిగోవుల నిచ్చే ఫలం (ఆ3-వ22) అశ్వయుజమైతే బుద్ధిమంతునికి ఐదుగురు కన్యలను ఇచ్చిన ఫలితం (ఆ3-వ23) వస్తుందని కవి స్పష్టం చేశాడు.

చంద్రవతి శ్రీపర్వతలింగాన్ని పూలతో పూజించాలనుకుంది. ఆ సమయంలో కవి ఏవి పూలతో స్వామిని పూజిస్తే ఏవి ఫలితాలు కలుగుతాయో స్పష్టంచేశాడు.

శ్రీపర్వతస్వామిని పూలతో పూజించే కులాతుల వారికి అగ్రజాతి ప్రముఖులయ్యే ఫలం (ఆ4-వ46) విరులతో హరుని పూజించే వారికి ఇంద్రపట్టఫలం (ఆ4-వ47) ఉడిగిన తావుల పువ్వులు, కడిబోయిన పుష్పాలు, వాడిన పుష్పాలు, తొడిమలుపోయిన పుష్పాలతో స్వామిని పూజించరాదని స్పష్టం (ఆ4-వ48) రాజప్రసూనాలతో స్వామినిపూజిస్తే రాజఫలం (ఆ -వ49) శతపత్రాలతో పూజించే వారికి శతరుద్రప్రముఖ సదృశ్య సామర్థ్యమయ్యే ఫలం (ఆ4-వ50) బిల్వదళాలతో స్వామిని పూజించే వారికి వైరివర్గం తొలిగే ఫలం (ఆ4-వ52) తులసిపుష్పాలతో ధూర్జటిని పూజించే వారికి ద్వాదశలక్షల ప్రసవమాలికలు స్వామికర్పణం చేసిన ఫలం (ఆ4-వ53) అభినవకోమలమయిన, కాంతి కలిగిన అన్ని పుష్పాలు స్వామి పూజకు అర్హమైనవేనని మాహాత్మ్యం స్పష్టంచేయడం (ఆ4-వ58) శివుడ్జి పుష్పాలతో పూజించు మాహాత్మ్యం గురించి—

సీ॥ ఈ పుష్పములఁగాదె యీశ్వరుఁ బూజించి
యమసుతుల సుతులుగా నదిచిగాంచె

నీ పుష్పములగాదె యీశ్వరు బూజించి
మనుజులు దేవత్వమునుహమబొంది
రీపుష్పములగాదె యీశ్వరు బూజించి
సుందరిశ్రగు పశ్చి శుక్రుబడసె
నీ పుష్పములగాదె యీశ్వరు బూజించి
యమునాకాంతు బుత్రుగా నత్రిపడసె
నమచు నవ్వన వీధియం రథికనియుతి
సకల వికచ ప్రసూనముల్ చాలగోసి
లేమలన్నియు పేదె మాలికలు సేసి
సరసపల్లావములబల్కె జలజగంధి (ఆ4-ప59)

స్పష్టం చేశారు.

చంద్రవతి మల్లికాపుష్పాలతో శ్రీపర్వతస్వామిని సేవించి

తే॥ "వరద సేబూను నర్జున వర్ణమైన
మల్లికాదామమెపుడు నీ మౌళిదాల్చి
మల్లికార్జున లింగనామంబు నీవు
అవధరింపుము యిదియ నాకభిమతంబు" (ఆ4-ప101)

కం॥ ఈ మల్లికా ప్రసూనపు
దామము గంగావగాంబు ధారణలీలన్
ప్రేమంబున ధరియింపుము
కామాంతకః తుహిన ధామ కళయునిబోలెన్ (ఆ4-ప102)

అని వరం వేడింది. ఆమెకోరికపై స్వామి మల్లికార్జునస్వామిగ అవతరించాడు.

శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో కరవీరపుష్పం ప్రాధాన్యాన్ని స్పష్టం చేశాడు. కరవీరుడు సుశ్రీకరవీర గుణాకరుడు. అతడు ఏరేశ్వరుడను పేరుగల గిరి వీరేశ్వరుని కొలిచాడు. పైగా అచంచలమయిన తపస్సు చేశాడు. హరుడు ప్రత్యక్షమై వరం కోరుకో మన్నాడు. తనను కరవీరవృక్షంగా శివపూజకు ఉపయోగపడేటట్లు వరం ప్రసాదించమన్నాడు. పైగా ఈ కరవీరపుష్పాలతో ఈశ్వరుని పూజించే వారికి దేవేంద్ర ఐశ్వర్యం కలగాలని కోరుకున్నాడు. హరుడు ఆ వరాన్ని ప్రసాదించాడు. అందుకే కరవీరపుష్పం (గన్నేరుపువ్వు) శివపూజకు ప్రీతికరమయిందని చెబుతారు.

6.4 సంగీతవైదుష్యం :

సమ్యక్ గీతం సంగీతం. వేదాలలో సామవేదం సంగీతాత్మకం. పరమశివుడ నాదప్రియుడని ప్రతీతి. దేవాలయాల్లో సంగీతానికి ప్రాధాన్యం ఎక్కువ.

నాగలూటి శేషనాథార్యకవి సంగీతశాస్త్రకోవిదుడు. తన సంగీత వైదుష్యాన్ని ప్రాస్తావికంగా కొన్నిచోట్ల, కాన్త్రికంగా మరికొన్ని చోట్ల స్పష్టం చేశాడు.

సనత్కుమారుడు శ్రీశైలమహిమను వ్యాసునికి వివరిస్తూ శ్రీశైలంలోని చెట్లుచేమలు, గుట్టలు, పుట్టలు, సామాన్య ప్రాణులు, హింసా జంతువులుకూడా శివమహిమ కీర్తిస్తున్నాయని [అ1-ప69] స్పష్టం చేశాడు.

శిలాదుడు పరమేశ్వరసాక్షాత్కారంకోసం చేసిన నాదోపాసనాన

సీ॥ ....శంఖాంఖోది

తంత్రికావాద మర్దల నినాద

భేరి నిస్స్వాన సంభృతవేణు తాళాది
ఘంటానినాద మేఘధ్వనములు
మొరసి దశవిధముల మ్రోయంగ నాక్రింద
దొమ్మిదింట మాని తీరమైన
నాదముల్లసిల్ల నాదప్రియుండగు
నాగధరున కర్పణంబుచేసి (ఆ-ప33)

అని విశదం చేశాడు.

చంద్రవతి వయోచితంగా చెలికత్తెలతో ఉద్యానవనంలో విహరించే సందర్భంలో-

తే॥ "పడతి నానారస ప్రాయ భంగులందు
ప్రౌఢరీతుల గీతముల్ పాడ...." (ఆ4-ప15)

అని క్షత్రియ కాంతల గీతానురక్తిని సూచించాడు.

ఆపై స్తోత్రాదులతో కరగని సర్వేశ్వరుణ్ణి చంద్రవతి సంగీతంతో కరగించడాన్ని విశదం చేశాడు.

కం॥ ఏవేళన నేరాగము
లేవీణెలగూర్చి పాడనీశ్వరహితమౌ
నావేళల నారాగము
లావీణెలగూర్చి పాడు నభినవ గతులన్ (ఆ4-ప85)

వ॥ వీణోత్తమంబు బ్రహ్మవీణకైలాసవీణ సారంగవీణ కూర్మవీణ ఆకాశవీణ రావణవీణ గౌరివీణ బాణవీణ కశ్యపవీణ స్వయంభూవీణ సరస్వతీవీణ భుజంగవీణ కిన్నెరవీణ లావణ్యవీణ జనకవీణ మనోహరవీణ గణనాథ వీణ కుమారవీణ కుంభికావీణ విపంచికావీణ

రావణహస్తంబు స్వరవిణ పరివాదినీవీణ యంఖోజవీణస్వరమండలంబు రుద్రవీణ మొదలైన వీణలు లక్షణోక్త ప్రమాణ యోగతంతులు కది యుగణికలుగూర్చి స్వరక్రమంబులుల్లసిల్ల (అ4-ప86)

కం॥ కేవలసప్తస్వరముల
ద్వావింశతి శ్రుతులుగూర్చి తగరాయములన్
గావుల మిశ్రధ్వనులను
నావనిత విలాసగతుల నాళవిసేయున్ (అ-ప87)

కం॥ ఖురతాడనంబు విషయము
స్వర (వర) మంజరి దృఢసుభద్రరుంలిరుదము సం
ధుర పంచస్ఫుటముల
ధరనేకోత్తర శతంబు తాళము లొలయున్ (అ4-ప88)

వ॥ మరియు శ్రీరాగం ఆందోళి లలిత చిత్రాంగి శౌరరాగంబు శంకరాభరణంబు గాంధారి మధ్యమ గాంధారి పంచమగాంధారి గుప్త గాంధారి గుప్తసాధారణము దేశిక కుంభకము ధన్యాసి కాంభోజిదేశాక్షి మధుకరి మేఘరంజి వరాలితంగిణి బహుళి బంగాళి మాహురి బృహతి సౌరాష్ట్రి సైంధవి పథరంజరంబు శుద్ధవరాళి సింధు వరాళి కురువంజి రామక్రియ దేవక్రియ గురుక్రియ నాదనామక్రియ మౌళగౌళ ఛాయా గౌళ కర్ణాటగౌళ సౌరాష్ట్రిగౌళ డేహగౌళ కర్ణాటవరాళి భైరపవసంతము ఏకచ్ఛవి సావరి కౌశికపూర్ణనాట సారకగనాట గుజ్జరి సౌరాష్ట్రగుజ్జరి ద్రావిడగుజ్జరి మలహరి మాళవభూపాళంబు హిందోళంబు తొంటితురక తొంటి దివ్యవతి దేశాపురి చిత్రవేళాపురి మధుమావతి మాళవి సిరియు మొదలైన సాంగ భాషాంగ క్రియాంగ సంజనిత రాగంబునడది నూట యెనిమిదింటియందు శ్రీపురుష రాగభేదంబు లెఱింగి పాంచాలనాద మిశ్రకాపుళ ధ్వని చతుష్టయంబుల తెలుగున నాస్వరంబులు పుట్టు

కాలంబులును తిథులు నక్షత్రంబులు గ్రహంబులు యోగంబులజాతుల నెఱింగి ప్రథమతాళమిశ్రితాళ శుద్ధతాళంబులును బదియేను సారంగ రాయంబులును ముప్పదిరెండు శుద్ధరాయంబులును ఆఱుదెఱంగుల అలతి భేదంబులును అరువది రెండు గమకంబులును ప్రత్యేక గమకంబులును అష్టాదశ వంశనాదంబులుల్లసిల్ల గౌళవైదర్భి పాంచాలరీతులను మంద్ర మధ్యతాళంబులును మానంబులు దేశిమార్గంబు దీటుకొన దశప్రాణాను బంధంబులు సంపూర్ణంబులైయుండ గంబళాశ్వ తరుల భంగాశ్వ తతులన్ దుంబురు నారదాదుల మీఱఁబాడుచున్నంత" (ఆ4-ప89)

ఉ॥ సన్నుత పంచమస్వరము సంభవమై గగనంబు ముట్టగా
దినగ నాళతించి రహితీర్చెననన్ బదియూట యెన్నిదై
యున్నత రాగభేదములు నుల్లసిలంగను గూఢ. రీతులన్
గిన్నెరకంఠి కంకరుని గీతము లింపువహింపఁబాడగన్
(ఆ4-ప90)

25 వీణలు, 20 -శ్రుతులు, తాడన విశేషాలు 80 రాగతాళ విశేషాలు చెప్పడం అతని సంగీత విద్యావైదుష్యాన్ని నిరూపిస్తాయి. భరతుని నాట్యశాస్త్రం ప్రకారం శ్రుతులు 22 (నాట్యశాస్త్రము పుట 767) కాని శేషనాథార్యకవి 20 శ్రుతులే చెప్పాడు.

6.5 నాట్యవైదుష్యం :

శేషనాథార్యకవినృత్యవిద్యావిశారదుడు.తనకున్ననృత్యశాస్త్రాభి మానాన్ని ప్రాస్తావికంగా కొన్నిచోట్ల, శాస్త్రసమ్మతంగా మరికొన్నిచోట్ల విశదం చేశాడు.

కైలాసంలో ఉన్న శివుడు కొలువుతీరి ఉన్నవేళ అచ్చరలేమలు నిండురస స్థితులతో నాట్యం చేశారని (ఆ2-ప15) విశదం చేశాడు.

హరి బ్రహ్మాదులు శ్రీపర్వతేశ్వరుని భజించే వేళ ఇందువదనలు చేసే నాట్యాన్ని—

శా॥ "....ఝుం ఝుం ఝుణ త్రు త్రు తూ
ధిక్కం థిం థిమితక్క తోనక ధిమిం ధీయంచు ఘూర్ణిల్లగన్
(అ2-ప112)

శా॥ పంకేజాక్షుల నర్తనంబు పటహ ప్రక్వాణ వీణారటల్
ఢంకారార్భటి మర్దల ధ్వని భేమడ్డక్కాహ డుక్కామహ
ఝుంకారానక ఝర్ఝర ప్రకట ఝుం ఝుం ఝల్లరి నిక్వణ
ద్ధ్వాంకారంబులు మ్రోయ శ్రీనగముపై బ్రహ్మాదికాలంబునన్
(అ2-ప119)

అనే పద్యంలో విశదం చేశాడు.

కేవలం నాట్యం అనే పదంతోనే కాకుండా నాట్యశాస్త్రంలోని అనేకాంశాలను ద్వితీయాశ్వాసంలో కవి స్పష్టం చేశాడు. వాటిలో 12 గతులు, 6 సంగతులు, 4 విభ్రమాలు, 64 దోర్విలాసములు, 33 మస్తకాస్ఫాలనములు, 10 కర్ణావధానములు, 3 వక్షోవిలాసములు, 20 అభినయాలు, రకరకాలయిన గతులు చోటు చేసుకున్నాయి (అ-2 ప111). అయితే భరతుని నాట్యశాస్త్రంలోని ఉపవిభాగాలకు శేషనాథార్య కవి విభాగానికి పొంతన కుదరడంలేదు. భరతుడు 32 అంగహారములు (నాట్యశాస్త్రము పుట 79) 108 కరణములు (నాట్యశాస్త్రము పుట 81) 64 హస్తములు (నాట్యశాస్త్రము పుట 292), 4 రేచకములు (నాట్యశాస్త్రము పుట 118) నాట శాస్త్రంలో సింహవృక్ష వానరగతుల వైవిధ్యాలు చెప్పబడగా (పుట 359) శేషనాథార్యకవి "తరుణ కలహంస

గతులు, మాతంగగతులు, లీలవాయుతగతులను (అ2-వ111) విస్తరించి చెప్పాడు.

శేషనాథాచార్యుడు నాట్యాంశాలు పేర్కొన్నాడు గాని వాని పేర్ల వివరం చేయకపోవడంవల్ల భరతుని నాట్యశాస్త్రంతో పోల్చడానికి వైషమ్యాలు వివరించడానికి వీలులేదు.

6.6 అలంకార వైదుష్యం :

సౌందర్యమలంకారః అలంకారమంటె సౌందర్యం. కావ్యార్థమును అలంకరించేది కాబట్టి అలంకారం కావార్థమంటె రసం. శబ్దార్థాలు రెండూ కావ్యంయొక్క శరీరాత్మలులు అలంకారాలు కావ్యశోభా హేతువులు. అవి శబ్దార్థాలకు ఉత్కర్ష కలిగించి రసాన్ని వ్యంజిస్తాయి.

కావాత్మ అయిన వ్యంగ్యానికి రమణీయత ప్రయోజనాలయ్యేవి అలంకారాలు. హారనూపురాదులవలెఉండే అనుప్రాసం, ఉపమ మొదలయిన అలంకారాలు అంగాలయిన శబ్దార్థాలకు ఉత్కర్షను కలిగించి, ముఖ్యమయిన రసాన్ని విలసిల్లజేస్తాయి.

ప్రతిభావంతుడయిన కవిఅలంకారాలను అప్రయత్నంగాచేస్తాడు కవి తాను దర్శించిన వస్తువును పాఠకునిముందు ప్రదర్శించడానికి అలంకారాలను ఆశ్రయిస్తాడు. జడపదార్థం చైతన్యవంతం కావడానికి అలంకారం ముఖ్యసాధనం.

వేదవాఙ్మయంనుండి అలంకార ప్రయోగం కనిపిస్తుంది. అది శాస్త్ర పురాణ ఇతిహాసాలలో పరిణతి చెందింది, అంతేగాక కావ్యనాటకాలలో అలంకారాలు ఎక్కువగా ప్రయోగించబడ్డాయి, పురాణఇతిహాసాలు కథాప్రధానాలు. నీతిబోధకాలు. ఉన్నది ఉన్నట్టు చెప్పడం వానిపని. ఇవి మిత్రసమ్మితాలు. మిత్రుడు ఒకే కథలో మరోకథను ఇమిడించి

ఉదాహరణ పూర్వకంగా చెబుతాయి. వీటిలో ఆలంకారికత స్వల్పంగా ఉంటుంది. వేదాలు ప్రభుసమ్మితాలు. ఆజ్ఞాపించడం వాటి పని. అలంకారాలతో అవసరంలేదు. కావ్య నాటకాలు కాంతా సమ్మితాలు. కాంత సౌందర్యానికి ప్రతీక. సౌందర్యం హృదయరంజకం హృదయ రంజనకు అలంకారం ఉపయోగకరంగా ఉంటుంది. అందువల్ల కావ్యానికి అలంకారాలు అవశ్యకాలు.

అలంకారాలు వైవిధ్యంతోకూడి ఉన్నాయి. అందుచేత అలంకారాలను చాలరకాలుగా చెప్పవచ్చు. కొన్ని పాత్ర మనస్తత్వాన్ని నిరూపించేవి, కొన్ని కవి లోకజ్ఞతను చాటేవి. మరికొన్ని శాస్త్రార్థబోధకములు ప్రస్తుత భావపోషకములు, భూతభవిష్యత్కథా సూచకములు, కొన్ని తాత్కాలికములు మరికొన్ని సార్వకాలికములు. అపై కొన్ని సిద్ధములు మరికొన్ని సాధ్యములు.

శ్రీపర్వత పురాణంలోని అలంకారాలను రెండురకాలుగ వర్గీకరించవచ్చు.

1. పాత్రస్వభావాన్ని నిరూపించే అలంకారాలు
2. కవి లోకజ్ఞతను చాటే అలంకారాలు

పాత్రస్వభావాన్ని నిరూపించే అలంకారాలు :

ఆకారాన్నిబట్టి, స్థితినిబట్టి, మనస్తత్వాన్నిబట్టి పాత్రలయొక్క స్వభావాన్ని నిరూపించవచ్చు. ఆదృష్టితో చేసే అలంకారాలను పాత్ర స్వభావాన్ని నిరూపించే అలంకారాలుగా చెప్పవచ్చు.

శ్రీపర్వతపురాణం ద్వితీయాశ్వాసంలో ప్రధానదేవతాపాత్ర శివుడు శిలాదుడొకముని. అతడు రోజూ ఒక్కరాయి తింటూ శతకోటి సంవత్సరాలు సంతానంకోసం శివుణ్ణి ఉద్దేశించి తపస్సుచేశాడు. హఠయోగంతో

స్వామిని మెప్పించాడు. శిలాదుని తపస్సుకు మెచ్చి పరమశివుడు ప్రత్యక్షమయ్యాడు.

సీ॥ మొలకచుక్కలరాజు మొల్లపువ్వునుబోలె
    మించిన మౌళి గీలించినాడు
బొడల కెంజాయలుగాలి గజ్జసునితోలు
    గటిమీద దిండుగా గట్టినాడు
విశదరత్నసభల్ వెడజల్లు శేషాహి
    గొడుగు పాహాలుగా దొడగినాడు
వడకు గుబ్బలి రాచవారి కన్నెను మేన
    నచ్చిన గతి నుండనిచ్చినాడు
కలికిచూపుల బచ్చవిల్కానిజూచి
భూతినెరపూతగా మేననూసినాడు
అట్టి దేవుండు సకలలోకైకమూర్తి
తా-శిలాదుని యోగిక ప్రత్యక్షమై (అ2-ప36)

ఈ పద్యం శివుని రూపవర్ణనకు సంబంధించింది. అందులో శివుని సౌంద్ర్య కౌన్నత్యం స్వభావంస్పష్టం. శిలాదుడు సంతానంకోసం తపస్సు చేస్తున్నాడు. "వడకు గుబ్బలి రాచవారి కన్నెనుజూచి, మేననిచ్చిన గతి నుండనిచ్చినాడు, కలికిచూపుల బచ్చవిల్కానిజూచి భూతినెరపూతగా మేననూసినాడు" అనే మాటలనుబట్టి శివునిలో ఒక సంసారిక వాతావరణాన్ని శిలాదుడు దర్శించాడని చెప్పడం ఇందులోని విశేషం. సంసారం సంతానంవలన పూజనీయమవుతుంది. పదిమంది దృష్టిలో గౌరవాన్ని సంతరించుకుంటుంది. ఈ వర్ణనవల్ల శిలాదునికి సంతానం కలుగుతుందనికూడా సూచ్యం.

చంద్రవతి చంద్రగుప్త మహారాజుకూతురు చంద్రవతిబాల్యంనుండి శివభక్తురాలు. చంద్రవతి రూపవతి. గుణవతి. ఆమె యుక్తవయస్కు.

రాలయింది. చెలికత్తెలతో కలిసి తిరిగే చంద్రవతిని చూచి ఒకసారి ఆమె తండ్రి మరులుగొన్నాడు. దానికి కారణం తండ్రికాదని కాముడే కారకుడని భావించింది. కాముణ్ణి జయించాలని కామారిని స్తుతించింది. చంద్రవతి భక్తితో సేవించింది. శివునికి ఇష్టమైన రాగాలతో వీణలతో స్తుతించింది. నాదశరీరుడయిన శివుడు ఆమె సంగీతానికి ముగ్ధుడయ్యాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు.

సీ॥ వింజామరంబుల విధముల జూపట్టు
 జడముడిపై బాలచంద్రికళలు
జడముడిపై బాలచంద్ర మరీచులు
 నెలకొని నిండువెన్నెలలుగాయ
నిండువెన్నెల తేట నిగ్గున వికసించు
 చదలేటి పూదాలి సభ్రమంబు
చదలేటిపూదాలి చవులగాడ్పులు గ్రోలి
 పాపపెండెము కళాప్రౌఢిమెఱయ
నెఱయ సరసంబు లెంకాయ దొఱపుదెగడు
వన్నెచారల తోలు దువ్వలువ మెఱయ
ప్రమథగణ రాజితో సురవ్రతతితోడ
సతివ ముందఱ ప్రత్యక్షమై శివుడు (ఆ4-ప96)

పైపద్యంలో బాలచంద్రకళలు, బాలచంద్రమరీచులు, వెన్నెల తేట, చదలేటిపూదాలి, పాపపెండెము మొదలయిన మాటలు పరిశీలింపదగ్గవి. అవన్నీ తెల్లనివి. తెలుగు జ్ఞానానికి సూచిక. కల్మష రాహిత్యానికి ప్రతీక. చంద్రవతి భావాలు వ్యక్తిత్వంకూడా శివునిలాగే నిర్మలమయిందని విశదం చేయడం కవి ఉద్దేశ్యం. చంద్రవతి నిర్మలమయిన మనస్సుతో ప్రార్థించడం. నిర్మలమయిన శివుడు ఆమెకు

ఆమెకు ప్రత్యక్షం కావడం ఇందులోని ప్రత్యేకత. ఇక్కడ చంద్రపతి స్వభావం వ్యక్తమవుతుంది.

శ్రీపర్వతపురాణం చతుర్థాశ్వాసంలో క్షత్రియపౌత్ర చంద్రగుప్తుడు చంద్రగుప్త మహారాజు రాజ్యపాలన, విజయయాత్రలు, కీర్తిప్రతిష్ఠలు క్రింది పద్యంలో సాక్ష్యమిస్తాయి.

సీ॥ చేయించె నెవ్వాడు సేవితోరీశ్వరుల
రాజ్యంబు లక్ష్మీవిరాజితముగ
ప్రేయించె నెవ్వడుర్వర సర్వదిగ్గజ
స్తంభములను జయశాసనములను
మాయించె నెవ్వండు మార్తాండ విక్రమో
ద్ధతి జనాకించన ధ్వాంతములను
కాయించె నెవ్వడుత్కట కీర్తిచంద్రికల్
చక్రవాళాంత భూచక్రమునను
నితడు జలరాశి పరివేష్టితావనీశ
రాజరాజీవషండ మార్తాండమూర్తి
చంద్రచంద్రాత పామృత చారుకీర్తి
గుప్త వంశోద్భవుడు చంద్రగుప్త నృపతి (అ4-ప9)

సాధారణంగా రాజులకు సామంతులు కప్పంకడుతూ ఉంటారు. కప్పం కట్టేవారిని, కట్టవారిని సమానంగా ఆదరించే దయార్ద్ర హృదయుడు చంద్రగుప్త రాజు. దిగ్గజస్తంభములు అని చెప్పడంవల్ల రాజ్యాలను జయించాలనే కోరిక చంద్రగుప్తునిలో ఉందని స్పష్టంగా తెలుస్తుంది. చంద్రగుప్త రాజు ప్రజలలోని అజ్ఞానం అనే చీకటిని పార దోలాడు. విజ్ఞానంఅనే వెలుగును ప్రజలకుఅందించాడు. భూమండలంలో తన కీర్తిప్రతిష్ఠలు వ్యాపింపజేశాడు.

ఒక వ్యక్తి గొప్పతనాన్ని ముందు గంభీరంగా వర్ణించడంలో ఆ వ్యక్తిపట్ల గౌరవం పెరగడానికి ఆస్కారం ఎక్కువ. కథ మలుపు తిరుగుతున్నపుడు వ్యక్తి దిగజారిపోతున్నపుడు ముందు చెప్పినగుణాల పట్ల సహృదయుడు సందేహమనస్కుడవుతాడు. ఒక్కొక్కసారి సాను భూతిపరుడవుతాడు. చంద్రగుప్తునిలో అచ్చం ఇలాగేజరిగింది. ఎంతటి మహానుభావులకయినా ఏదో ఒక విషయంలో బలహీనత ఉంటుందని కవి స్పష్టం చేశాడు.

2. కవి లోకజ్ఞతను చాటు అలంకారాలు :

శ్రీపర్వతపురాణం ద్వితీయాశ్వాసంలో పర్వతుని కథలో కవి లోకజ్ఞత వ్యక్తమవుతుంది. పర్వతుడు శిలాదుని కొడుకు. పర్వతుడు పెరిగి పెద్దవాడయ్యాడు. శివుణ్ణి ఉద్దేశించి రాత్రనక పగలక తపస్సు చేశాడు. పర్వతుని తపస్సుకు మెచ్చి పరమశివుడు ప్రత్యక్షమయ్యాడు ప్రత్యక్షమైన శివుణ్ణి—

మ॥ కరిపోతంబు తదీయ మాతృకుచ మాకాంక్షించుగా జెట్టుసూ
కర వక్షోరుహ దుగ్ధధారలమదిన్ గామించునే దేవ నీ
చరణ ద్వంద్వపయోజభక్తికల నాసౌఖ్యామృతా స్వాదని
ర్జర రాజ్యాదిక దివ్యభోగముల నిస్సారంబులన్ గోరునే?

(ఆ౨. ప౨౬)

అని పర్వతుడు స్తుతించాడు.

ఏనుగుగున్న తల్లి చనుబాలు తాగడానికి ఇష్టపడుతుందిగాని సూకరి వక్షోజానికి అర్రులు చాస్తుందా అనడం దృశ్యమానమైనచిత్రణ అలాగే శివుని పాదాలను భక్తితో పూజించి సౌఖ్యామృతాన్ని ఆస్వా-

దించే వ్యక్తి నిస్సారమైన రాజ్యాలు దివ్యభోగాలు కోరుకుంటాడా అని చెప్పవడంవల్ల కవి లోకజ్ఞత స్పష్టమవుతుంది.

చంద్రవతి కథలోకూడా కవిలోకజ్ఞత స్పష్టమవుతుంది. చంద్రవతి చంద్రగుప్త మహారాజు కూతురు. చంద్రవతి చెలికత్తెలతో సరసాలాడు తుండగా చంద్రగుప్తుడు ఆమెపైపు ప్రత్యేకంగా చూస్తాడు. ఆ చూపుకు కారణం తండ్రికాదని కాముడే కారకుడని—

కం॥ మదనుడు పాపకర్ముడు
మొదలన దర్పకుడు గాన నూభుడుగాడే
మదనారిని డెందంబున
బదిలంబుగ నిలిపి తండ్రి పగ సాధింతున్ (ఆ4—ప13)

చంద్రవతి గుర్తించింది. ఈ కథ చెప్పడంలో కవి ఆశయాలు నాలుగు—

మొదటిది భక్తికి స్త్రీ పురుషభేదంలేనట్లే ఉచ్చనీచాలు లేవని చెప్పడం.

రెండవది స్త్రీ ఆధిక్యతను పరోక్షంగా చెప్పడం. అంటె పురుషుల కామం సులభంగా బహిర్గతమవుతుంది. స్త్రీలు పురుషుల కామాన్ని సులభంగా పసిగట్టగలరు. అయినా నిగ్రహంవల్లగాని, అగడుపడ కూడదనే భావంతోనే జాగ్రత్తపడతారు. ఈ కథలో చంద్రవతి లోబడక తన ఆధిక్యతను నిలుపుకుంది.

మూడవది తండ్రిస్థానంలో ఉన్నవాడు, పైగా రాజయినవాడు కుమార్తెపట్ల ఆ విధంగా ప్రవర్తించడం చాల నీచమయిన విషయం.

నాలుగవది ఈ కథాచెపంతో కవి సమాజానికి నీతి చెప్పడం

విశేషంగా చెప్పవచ్చు. "బ్రహ్మకైన పుట్టును రిమ్మ తెగులు" అనే వేమన పద్యాన్ని తలపింపజేస్తుంది.

శ్రీపర్వతపురాణంలో భావసౌష్ఠవంతో రమణీయ చిత్రణతో సాగిన పద్యాలలో ఉపమాలంకారాలు, రూపకాలంకారాలు అపహ్నుతులంకారాలు' సందేహాలంకారాలు దృష్టాంతాలంకారాలు, శ్లేషోపమాలంకారాలు, ఉత్ప్రేక్షాలంకారాలు, ఆక్షేపాలంకారాలు, స్వభావోక్తి అలంకారాలు, వృత్త్యను ప్రాసాలంకారాలు యమకము, వికటబద్ధవృత్తి అలంకారాలున్నాయి.

ఉపమాలంకారాలు :

ఉపమాన ఉపమేయములకు నొగసైన సాదృశ్యం చెప్పిన ఎడల ఉపమాలంకారం అవుతుంది.

ఔపమ్యంలేని అలంకారం అసలులేదు. స్వభావోక్తిలాంటి వాటిలో తప్ప. అందువల్ల "ఉపమ అలంకార రాజమయింది. ఉపమను అభిమానించిన కవి కాళిదాసు. శేషనాథార్యకవి ఉపమాలంకార ప్రియుడే కాని తాను వ్రాస్తున్నది పురాణంకావడంవల్లపరిమితంగా అలంకారాలను వాడాడు. ఆ కవి వాడిన ఉపమలు 3 రకాలు—

1. సంపూర్ణోపమా ప్రయోగం
2. వర్ణ్య వస్తువుకు భిన్నోపమానాలు
3. అలవోకగా విశిష్ట ఉపమాప్రయోగం

**1. సంపూర్ణోపమా ప్రయోగం :**

వర్ణ్య వస్తువుకు సంబంధించిన అన్ని అంశాలకు పోలిక కుదరడం పూర్ణోపమ. పోలె, వలె, వగిది, కైవడివంటివి ఉపమావాచకాలు, శ్రీశైల పర్వతాన్ని పోలసముద్రం. ...

పోల్చడం. ఈ కోవలోకి వస్తాయి. ఇవన్నీ కోరిన కోరికలు నెరవేరుస్తాయని కల్పవృక్షాదులు సార్థకాలు. శ్రీశైలంలో పాలసముద్రం లేదు. అయినా కవి అన్ని అంశాలను పరిగణలోకి తీసుకొని పూర్వోపమా ప్రయోగం చేశాడు.

ఉ॥ మానితమౌని పుష్పకసమాజ పవిత్ర పరంపరల్ శుభా
స్థానిక భక్తరత్నముల సంగత శృంగతరంగ రాజి ప్రా
చీన విశాలఫేనముల శ్రీకుధరేతర సీమవేలలన్
శ్రీనగరాజమూరి విలసిల్లును దుగ్ధపయోధికైవడిన్ (అ2-ప4)

మునీశ్వరులు తపశ్శక్తితో తలలు పండినవారు. ఆదిశేషుని పడగలాంటివారు పతంజలి యోగం ప్రసిద్ధం. యోగంతో జ్ఞానానందమయిన పరంజ్యోతిని దర్శించినవారని అభిప్రాయం. సముద్రం రత్నాకరం ఈశైలంలో భక్తాదులు రత్నాలవంటివారు ఒక్కొక్క భక్తుడు సాధనతో పక్వమయినమూర్తి శరీరదీక్షవలన సముద్రంలో రత్నసేకరసాధ్యం. అలాగే హఠయోగాదులతో స్వామిని అలంకరించిన భక్తులు రత్నములు కావడంలో విశేషంలేదు సముద్రానికి చెలికట్టలాగే శ్రీశైలం చెలియలికట్ట.

ధేనువుకు పాదాలు, వాలం, శృంగం, రోమరాజి శుభకరమయిన స్థానాలు దూడల చేపు మరొకసౌభాగ్య లక్షణం శ్రీపర్వతం కామధేనువు లాంటిది ఈ పర్వత కామధేనువుకు ధర్మార్థ కామమోక్షాలు పాదాలు వాలచలనం శుభకరమయినట్లే శ్రీశైలవాసం మంగళప్రసాదిని 'శృంగదర్శనం పాపహారి అయినట్లే శిఖరదర్శనం శ్రీశైల. నాలుగుదిక్కుల్లోని నాలుగు శివాలయాలు వక్షోజాలవంటివి కవికి పర్వతమంతా కామధేనువులాగా కనబడడం ఒక విశిష్టభావన (అ2-ప5)

కొండకు కల్పవృక్షానికి పోలికవృక్షంలో గుత్తులు, ఫలాలు, శుక

వాసం మొదలయినవి కనిపిస్తాయి అలాగే శ్రీనగంలో పుణ్యతీర్థాలు గుత్తులులాగా ఉన్నాయి శివశక్త్యనుగ్రహం ఫలాలవంటివి తీర్థ యాత్రాగుణం చిలుకల్లాంటివి అనేకతీర్థాలున్నాయని గుత్తులుపోలికలో అభివ్యక్తం చిలుకలువలుకుతాయి యాత్రాగణం శ్రీశైలమాహాత్మ్యన్ని కొనియాడడం విశేషం.

మ॥ పరితఃక్ష్మాధర సంఘముల్ విటపముల్ పాతాళగంగాదిసుం
దరతీర్థావళి గుచ్ఛరాజి శివశక్త్యాదుల్ ఫలస్తోమముల్
పరిషత్పంచజముల్ తదుత్తమఫల ప్రత్యగ్రకీరౌఘముల్
సరియే శ్రీనగ కల్పవృక్షమునకున్ సర్వం హాశైలముల్

(ఆ2-ప6)

ఒక ప్రవాహంలో కనిపించే వస్తువులకు ఒక స్త్రీ అవయవాల కున్న పోలికలను పురస్కరించుకొని సంపూర్ణోపమ చేయడం పాతాళ గంగ వర్ణనలో కనిపిస్తుంది.

ప్రవాహంలోను మత్స్యాలుంటాయి ప్రవాహం సుడి తిరుగుతూ ఉంటుంది చక్రవాకాలు ఆశ్రయించి ఉంటాయి నురుగు కదలుతూ ఉంటుంది తీరంలో ఇసుక దిబ్బలుంటాయి సరోవరంలో పద్మాలు కనిపిస్తాయి తుమ్మెదలు అటూఇటూ తిరుగుతూ తచ్చాడుతుంటాయి. అలల కదలిక ఉంటుంది కలహంసలు మనోహరంగా తిరుగుతుంటాయి

రెప్పవాల్పక చూడడం, లోతైన బొక్కిలి ఉండడం, పర్తులస్తనసౌభాగ్యముండడం, తెల్లనిహారాలు ధరించడం, విశాలమయిన జఘన భాగం రమణీయంగా కనిపించడం, నల్లటి కురులుండడం, సొగసైన నడకలుండడం యౌవనంలోని స్త్రీల సహజలక్షణం ఈ రెంటిని మేళవించి వ్రాసిన క్రింది పద్యం మనోహరం.

సీ॥ అనిమిషలోచన యావర్తన తతాళి
పృథురథాంగస్తన శోభహార
శృంగారసైకత శ్రీజఘనస్థలి
వికచ పద్మానన విద్రుమోష్ఠి
కంబుకంధర మధుకర నీలకుంతల
యంభోజ పుష్పరసాంగరాగ
మహనీయ కల్లోల మాలికాకరయుగ్మ
యభిరామశవ కలహంసయాన
తరుణికైవడి నొప్పుపాతకవిభంగ
నట తటోత్సంగ దురిత పన్నగవిహంగ
భవశిరస్సంగ సేవిత పావనాంగ
తరళ రంగత్తరంగ పాతాళగంగ (అవి-వచన్)

2 వర్ణ్య వస్తువులకు భిన్నోపమానాలు :

ఒక వస్తువు స్వరూపావగాహనకు ఒకటిలోలిక సరిపోనప్పుడు కవి అనేక ఉపమలను వాడడం ఈ వర్గంలో చేరుతుంది.

సీ॥ మదనఖాత్రజ మహిళాకదంబాది
సహితమై జీవశాస్త్రమువోలె
సమర మునీంద్ర గాయత్రి జపానేక
సహితయయ్యును బ్రహ్మసభయుబోలె
వసుధ మాధవిరాజ వరుణసువర్ణాఖ్య
విరసమై హరిసభా వేదివోలె
జటిలార్క హరిశివా శరభవ బ్రహ్మ సం
చయముతె నీశ్వరస్థలమువోలె

గౌశికాగస్త్య చిత్రశిఖండి వితతి
సముదయంబున దావసాశ్రమముపోలె
వనము గుంపును నధికపావనము నొంపు
లికుచ పనసశోభనము కదళీవనంబు (ఆ6-ప28)

ఈ పద్యంలో కదళీవన ప్రస్తావన ఉంది. దేవతాస్థలము, బ్రహ్మసభ, హరిసభావేది, ఈశ్వరస్థలములనేవి ఉపమలు, పవిత్రత చెప్పడం మొదటి "ఉపమ" ఉద్దేశ్యం. సృష్టికి మూలమనడం, మునీంద్రసేవితమనడం రెండవ "ఉపమ" ప్రయోజనం. సంపద్యుక్తమనడం మూడవ పోలిక అంతరార్థం. సకలదేవతా నివాసమనడం చివరి పోలిక అభిప్రాయం.

3 అలవోకగా నీకైక ఉపమాప్రయోగం :

ఈలాంటి ఉపమాప్రయోగంలో ఝటితిస్ఫూర్తి ఒకటిప్రయోజన

శా॥ అల్లోనేరేడు పండుపోలె నరచేనత్యుగ్రకాకోలమున్
ప్రోల్లాసంబున నిల్పిగ్రుక్కగొని విస్ఫూర్జత్ప్రతాపంబుతో
(ఆ1-ప4)

సీ॥ మొలకమక్కల రాజు మొల్లపుష్పముబోలె
మించిన మౌళి గీలించినాడు
కొండలకెంటాయల బులిరక్కసుని తోలు
గటిమీద దిండుగా గట్టినాడు (ఆ2-ప36)

సీ॥ ఒజ్జలు శిష్యులకుపదేశములు చెప్ప
విధమున జెప్పిన పెరవనేను
చాలు నీకథలింక శ్రీగిరి మహిమలు
ఎన్నంగ నా పద్మజునకు దరమె (ఆ5-ప107)

సీ॥ చింతామతంబుల విధముల జూపట్టు
జడముడిపై బాలచంద్రకళలు
జడముడిపై బాలచంద్రమరీచులు
నెలకొని నిండువెన్నెలలుగాయు (అ5–ప96)

రూపకాలంకారాలు :

ఉపమేయానికి ఉపమానంతో అభేదంగాని తాద్రూప్యంగాని వర్ణించినఎడల రూపకాలంకారం అవుతుంది. రూపకంలో ఆరోపణకు ప్రాధాన్యం. ఉపమలాగే రూపక ప్రయోగం విశిష్టం. శ్రీశేషనాథార్య కవి కావ్యాన్ని మహావృక్షంగా శ్రీశైలాన్ని మహాక్షేత్రంగా ఆరోపించి వ్రాసిన పద్యాలు మనోహరాలు.

వననిర్మాణంలాగే కావ్యరచన సప్తసంతానంలోనిభాగం. కావ్యం మహీరుహంలాంటిది. బీజం అంకురం, పల్లవం, పుష్పం. ఫలాలు, కీర వాసమునేవి వృక్షపరిణతిలోని అవస్థలు. అలాగే శివచారిత్రం, సేవా వివేకం, కవితాశ్రేణి సమాఖ్యవ్రాతం, స్తవసముదాయం. భావజ్ఞుల సహవాసమునేవి కావ్యరచనలోనివిశేషాంశాలు. పవిత్రచరిత్ర చేపట్టడం వల్ల మాన్యత కవిపండిత సమ్మాన్యత మహాకవికి ఎనలేని గౌరవాన్ని తెచ్చిపెట్టేవి. సహృదయుల మెప్పు శాశ్వతత్వాన్ని సమకూర్చేవి.

మ॥ శివచారిత్రము బీజమంకురము నీసేవా వివేకంబు స
త్కవితాశ్రేణులు పల్లవంబులు సమాఖ్యవ్రాతముల్, పుష్పముల్
భవదీయస్తవముల్ ఫలావలులు తద్భావజ్ఞులే కీరముల్
భువిమత్కావ్య మహీరుహంబునకు శ్రీభూభృత్సుతాధీశ్వరా!
(అ1–ప15)

శ్రీశైలం ఒక పెద్ద మబ్బులాంటిది. శ్రీశైలంలో నింగిచూచిన

వృక్షాలున్నాయి. ఆకాశాన్నంటే శిఖరాలున్నాయి. ప్రకాశవంతమయిన ఓషధులున్నాయి. పర్వతసీమనంటే మబ్బులున్నాయి. ఈ భావాలను జతచేస్తూ "శ్రీశైలమహాభ్రమని" ఆరోపణ చేసి కవి వర్ణించిన పద్యం హృద్యం.

శా॥ కుంభద్మాధర గహ్వర ప్రతిరవాక్షుద్రాభ్ర నిరోషముల్
సంఖాహాది దివావసర్గ ఫలవిస్తారాంబు వర్షంబులున్
కుంభత్కాష్ఠ మహీరుహ స్థిర తృణ జ్యోతిస్తటిద్వల్లికా
రంభంబుల్ విలసిల్లు పర్వత మహాభ్రంబౌచు విభ్రాజియై
(ఆ2–ప9)

స్వాగతం చెప్పడం హైందవసంప్రదాయం. స్వాగతసమయంలో స్త్రీలు హారతులుపట్టడం, మంగళతూర్యనాదాలుమోగించడం, పొగడుతూ పాటలు పాడడం, సంతోష పారవశ్యంతో నటించడం సంప్రదాయం. వనలక్ష్మి ఆగమనానికి తుమ్మెదలు, కోయిలలు, రాయంచలు, పిల్లగాలి పూలగుత్తులు, చిగురులు సంతోషం వ్యక్తంచేస్తాయి. ఈ రెండు భావాలను జతచేస్తూ "రూపకం" చేసి కవి వ్రాసిన సీసపద్యం రమణీయం.

సీ॥ బాలాళి నివహంబు బాలాశిఖంగిని
 ఆకులపై నిల్చి యారతులు సేయ
కోయిల జవ్వనుల్ గూడి కుహూకార
 కాహళధ్వనులు చొక్కముగ బూన
రాయంచలేమలు రహినిల్వ పొగడంగ
 దాజిల్క జవరాలు రామసంగ
మలయానిలుండును మందమార్గంబున
 నలకాళికుని భంగి నటనజూప

సంభ్రమంబున మంజరీస్తనము-లొరయ
వైభవంబున గర పల్లవముల సాచి
తరుణాంగన చెలగి నర్తనము సలుప
నంతకంతకు వనలక్ష్మి యతిశయిల్లె (అ4-ప39)

అపహ్నుతాలంకారాలు :

ప్రకృత వస్తువును అన్యవస్తువు ధర్మము ఆరోపించుటకై ప్రకృతి ధర్మాన్ని నిషేధించినచో అపహ్నుతి అలంకారం అవుతుంది.

వర్ణ్యవస్తువును యథాతథంగా నోలేదా అలంకారికంగా నోభావించి కాదని సంశయములో పడి మరోరూపంలో నిర్ధారించడం అపహ్నుతి ఒక వస్తువు ఒకేసమయంలో భిన్నభిన్నంగా కనబడడం ఈఅలంకారం లోని ప్రత్యేకత.

సీ|| ఘనకాంతి మెఱగెడు కనకంపుదీగెయో!
కాదు, కంతుని భద్రగజముగాని
గాంతయో! కస్తూరికా పత్యరూపమో!
కాదు, నిర్జరకంబుకంఠిగాని
రాజాస్యరూపమో! రత్నప్రదీపమో!
కాదు, కాముని దేహకాంతి గాని
చిరుసానబట్టిన చిత్తజుబాణమో!
బాణమె మన్మథక్షాణగాక
కలరె యారీతి మానవాంగనలు ధరణి
ననుచు బుధులెల్లను నభినుతింప
గంతుసామ్రాజ్య పట్టంబుగట్టదగిన
రమణి విలసిల్లె విభ్రమారంభములను (అ4-ప12)

"కనకపుతీగ" అనడంలో కాంతికి, కాంతి ప్రసరించే గుణముంది గాని కదలలేరు. అందువల్ల కంతుని భద్రగజమని మరొక నిర్ధారణ. వశ్యరూపమనడంలో బలవంతం గోచరిస్తుంది. వశ్యమయిన దానికి శాశ్వతత్వం ఉండదు. అందువల్ల "నిర్జరకంబుకంధరి" అని మరొక సమర్థన.

సందేహాలంకారాలు :

అనిశ్చయజ్ఞానంసందేహం. సందేహంవలన ఏర్పడు అలంకారం సందేహం. వర్ణావర్ణ్యముల సాధారణ ధర్మములు మాత్రమే దర్శించి, విశేషధర్మాన్ని దర్శించలేకపోవడంవలన ఉద్భవించిన అనిశ్చయంవర్ణించ బడడం సందేహాలంకారం. వస్తుస్వరూప పరిజ్ఞానం సరిగా లేనపుడు ఇదా, అదా అనే సందేహాలు కలుగుతాయి.

సీ॥ నరుడవో ప్రచ్ఛన్న హరుడవో నీవుకి
న్నరుడవో శివభక్తిపరుడ వమృత
కరుడవో పాతాళచరుడవో నీవు ఖా
న్మరుడవో శివయోగి వరుడవిట్లు
సురుడవో దానవేశ్వరుడవో నిర్జరే
శ్వరుడవో సంయమీశ్వరుడ వనఘ
యేలోకమున నుండి యేతెంచి తిచటికి
నేలోకమున కింకనేగు తెలుగు
దేవవృత్తాంతమంతయు దెలియవలయు
ననుచు వినుతింప మునినాథుడట్లు నిలిచి
విను తపోధన చెప్పెద విస్మయంబు
అనుచు మునినాథుడిట్లని యానతిచ్చె (అ5-ప30)

నిశ్చితత్వం [illegible] వ్యంజితం. [illegible]

చేరుకోలేడు. చేరుకోవలెనంటె ఎంతో పుణ్యసంపాదన ఉండాలి. అందువల్ల మొదట "నరుడవో" అని సందేహం. శివభక్తులు శివాకారులే. భక్తులకు భగవంతునికి భేదంలేదు. అందువల్ల "ప్రచ్ఛన్న హరుడవో" అని తర్కం. అమృతం నిర్జరత్వాన్ని ప్రసాదించేది. అమృతసిద్ధి బహు ప్రయత్నోపేతం. అమృతమూర్తి ఇతరులకు ఆనందదాయకుడు. అమృతకరుడవో అనడంలో రూపసామ్యం, భక్త్యనుగ్రహత్వంవ్యక్తం

దృష్టాంతాలంకారాలు :

రెండువాక్యాలకు బింబ, ప్రతిబింబత్వం ఉన్న ఎడల దృష్టాంతాలంకారమవుతుంది.

ఒక నీతి చెప్పి దానికి బలంగా కొన్ని దృష్టాంతాలివ్వడం లేదా ఒకదృశ్యదృష్టాంతాన్ని స్పష్టంచేసి ఒక నిర్ధారణచేయడం ఈభాగంలో చేరుతుంది.

మ॥ కరిబోతంబు తదీయ మాతృకుచ మాకాంక్షించుగాకెట్లు సూ
కరి వక్షోజము చేర నాసపడునే కామారి! నీపాద సం
స్మరణానంద సుధారసజ్ఞుడు నినున్ సంధించుగా కాత్మలో
బర దైవాంతరమున్ గుణించి మఱిలో భావించగా నేర్చునే
(అ4-న81)

ఏనుగు గున్నతల్లి చనుబాలు తాగడానికి ఇష్టపడుతుంది గాని సూకరి వక్షోజానికి అర్రులు చాస్తుందా అనడం దృశ్యమానమయిన ఒక చిత్రణ. కరికి సూకరికి ఆకారంతో పోలికలు. కరి వెంబడి గున్న లేగినట్లే సూకరి వెంబడి పిల్లలు సాగుతాయి. శబ్దంలో కరికిలాగే సూకరికి సామ్యం కరి అనే మాటకు ముందు "సు" చేర్చడంవల్ల సూకరి గొప్పకాదు. ధ్యేయమొకటయినా ప్రయత్నంలో సముఖత విముఖతలుంటాయి.

**శ్లేషోపమాలంకారాలు :**

అనేకార్థాలను ఆశ్రయించుకొని ఉండడం శ్లేషాలంకారం. శ్లేషాలంకారంతో ఔపమ్యానికి ప్రాధాన్యం ఉన్న అలంకారాలు ఈ వర్గంలో చేరుతాయి. మచ్చుకు తృణబిందు సరోవర ప్రశంస.

సీ॥ తృణబిందు కర్దమధీవర పారీన
సహితమై తాపసాశ్రమము వోలె
దారుణ బకకంక ధార్తరాష్ట్రవ్యాప్తి
నభిమత వ్యాసకావ్యంబు వోలె
జిరకాలయుత మహజ్జీవస్థితి యందు
వరమంత్ర సిద్ధదేవతయు బోలె
గచ్ఛప మకరశంఖ స్థూల పద్మప
స్ఫూర్తుల ధననాథుపురము వోలె
పుష్కరోత్ఫుల్ల హల్లక పుండరీక
ఫలిత మకరంద విభ్రమ భ్రమణ నికర
గాయకోత్తమ బృందిష్ఠగాన ఘోష
రూఢసుఖదంబు పుణ్యసరోరుహంబు (అ5-ప42)

బకమంటె కొంగ, కంకమంటె రాపులుగు. ధార్తరాష్ట్రమంటె సర్పవిశేషం. బకుడు, కంకుడు, ధృతరాష్ట్ర పుత్రులు భారతంలోని వ్యక్తులు. అందువల్ల వ్యాసకావ్యంలో వుందని ఔపమ్యం. కొంగలు, రాపులుగులు, పాములు మొదలయినవి సరోవరాన్ని ఆశ్రయించి ఉన్నాయి కనుక పదజాలం సార్థకం.

**ఉత్ప్రేక్షాలంకారాలు :**

వస్తువునుబట్టి, హేతువునుబట్టి, ఫలమునుబట్టిఊహించుట ఉత్ప్రేక్షాలంకారం, ఉపమానానికి ఉన్న ధర్మాలే ఉపమేయంలో ఉండడంచేత

ఉపమేయానికి ఉపమాన తాదాత్మ్యం ఊహించిన ఎడల ఉత్ప్రేక్ష అవుతుంది, ఎమో అని అంటె ఉత్ప్రేక్ష అవుతుంది.

సీ॥ నళినాస్త్ర మురళికా నాదమోయన మించు
కలకంఠ మృదు కుహూకారరవము
కందర్పు నత్కళకాహళ ధ్వనులను
చనుచంచరీక సంచయ రవంబు
కుసుమ సాయకుడుండు గొల్లెనలోయన
బ్రభవించు కింశుక ప్రసవతతులు
జలజసాయకుని చిచ్చఱకోల లోయన
విలసిల్లు సంపె విరులపెంపు
కంతుసామ్రాజ్య పట్టంబు గజములనగ
నంతకంతకు జెలగె రాయంచగములు
తియ్యవిల్తుని సామ్రాజ్య తేజమనగ
జెరగలింపుచు బలికె రాజిలుగకములు (ఆ4-ప41)

ఆక్షేపాలంకారాలు :

స్వయంగా తాను చెప్పిన మాటనే ఆలోచన చేసిన మీదట నిషేధించడం జరిగితే అది ఆక్షేపాలంకారమవుతుంది.

సీ॥ కలుగవా జనులందు గారిన్యగుణములు
ముదితల వక్షోజములనెకాని
వక్రగుణంబు లెవ్వారియందును లేవు
కుటిలాళి వేణుల కురులగాని
చంచలత్వంబు లేజనులయందును లేవు
హసాకోమలుల చూపులనెకాని

జాడ్యంబులవ్వారి జనులయందునులేవు
నారీమణుల గమనములుగాని
లేములవ్వారి జనులందులేవు వెరసి
అలరుబోణుల చారుమధ్యములగాని
యట్టి కళ్యాణపదముల గాలయంబు
పుడమి నీ చంద్రగుప్తికేపురము సాటి: (అ4-వ4)

చంద్రగుప్తపురంలోని స్త్రీలు, పురుషులు కాఠిన్యం లేనివారు. వక్రత్వం తెలియనివారు. వారిలో చాంచల్యంలేదు. జాడ్యమసలులేదు లేనితనంకాదు అయితే స్త్రీల వక్షోజాలలో కాఠిన్యముంది. కురులలో వక్రత్వముంది. కోమలుల చూపులలో చాంచల్యముంది. గమనంలో అలసత్వముండి, నడుమున్నదా లేదా అన్నట్లుంది అని కవి వర్ణించాడు

మొదటిది స్వభావానికి సంబంధించింది కాగా రెండవభాగం శరీరనిర్మాణానికి సంబంధించింది. మొదటిది స్త్రీ పురుషుల సామాన్య వర్తనంకాగా రెండవది స్త్రీలకు సంబంధించిన అంశం.

స్వభావోక్తి అలంకారాలు :

జాత్యాదిస్థమయిన స్వభావాన్ని వర్ణించినపుడు అది స్వభావోక్తి అలంకారమవుతుంది. జాత్యాదులు అనగా జాతి గుణ క్రియాదులని భావం. స్వభావవర్ణన అనగా యథాతథవర్ణన అనిభావం స్వభావాని వర్ణించే ఉక్తి అవడంవల్ల స్వభావోక్తి అలంకారమవుతుంది.

శా॥ ముక్కంటిం భజియించువేళల గతుల్ ప్రోయుంగ
నాట్యక్రియల్
నిక్కంబున్ బచరింతు రిందువదనల్ వేర్పున్ విడంబంబింగా

జక్కన్ మర్దల కాహళధ్వనిగతుల్ ఝుం ఝుం ఝుణత్తుత్తు తా
ధిక్కుం ధిం ధిమితక్కతోనక ధిమిం ధీయుంచుఘూర్ణిల్లగన్
(ఆ2-ప112)

శా॥ వంశీజాక్షుల వర్తనంబు పటహ ప్రక్వాధ వీణారటల్
ఢంకారార్భటి మర్దల ధ్వని డమడ్డక్కాహ ఢుక్కామహా
ఝుంకారానక జర్ఝర ప్రకర ఝుం ఝుం ఝుల్లరీ నిక్వణ
ధ్వాంకారంబులు మ్రోయ శ్రీనగముపై బ్రాహ్లాదికాలంబునన్
(ఆ2-ప113)

పైనాట్యవర్ణనలో పరికర వాయిద్యాల ఒవళి యథాతథంగా వర్ణితం.

ఇలాగే చిరుగాలి చేతల్ని శేషనాథార్యకవి సహజంగా వర్ణించిన తీరు గమనార్హం.

ఉ॥ కిన్నర కామినీ సురతఖేల పరిశ్రమవారి దోగి యు
త్ఫుల్లత మల్లికావకుళయూథవధూజన మంజరీ వ్రజా
ఛిన్నకుచంబులంటె మునిం, బృందముమీద సుమాళిమొప్పగా
గ్రొక్కన విల్తుసేన కెలగోలుగనేగె సమీరమింపుగన్ (ఆ1-ప61)

వృత్యానుప్రాసాలంకారాలు :

ఏకాక్షరం అనేకసార్లు ఆవృత్తికావడం దీనివల్ల శ్రుతి రమ్యత సాధ్యం.

కం॥ కలకంఠ కంర కందళ
కలహంస కలభఖడ్గ కారండమహా
కలవింక కంకకాసర
కలరవములు కలకలంబుగల కాననమున్ (ఆ1-ప54)

పై పద్యంలో కల, కలశబ్దం అనేకసార్లు ఆవృత్తి కావడంవల్ల పక్షుల కిలకిలమనే శబ్దాలు స్ఫురించడం ఇందులోని విశేషంగా చెప్పవచ్చు. మరికొన్ని ఉదాహరణలు.

"ధ" అక్షరావృత్తి :

ఉ॥ బంధుర గంధసింధుర మదాంధ జలంధర దానవచ్ఛటా
బంధ దురంధర ప్రమథబాంధవ పంకజబంధు వంద్య సౌ
గంధిక గంధిదేహయుత కంధినిషంగ కబంధ జారి సం
బంధ కిరీట భక్తజన బంధుర శ్రీగిరి కందరాలయా (అ2-ప57)

"భ్ర" అక్షరావృత్తి :

శా॥ అభ్రద్వీపవతీ మహాల హరినమ్యగ్గోత్ర విద్యుత్ప్రభా
బిభ్రద్భ్రూభుజ టాటువీకుట జలంబి స్థూలరేఖాశిఖా
సిభ్రాదభ్ర సిభ్రాభ్రవర్ణ సుమనస్స్రగ్గంధు రేఖాధరా
మభ్రత్సర్వ జగత్పవిత్రకరనామా! పర్వతాధీశ్వరా! (అ3-ప111)

"క" అక్షరావృత్తి :

కం॥ తలకక పండ్లిల కరవక
కలగక కరమడ్డుమడక కదలకనదిపై
ములకక బెదరక యదరక
యులగక మెలగినను దేవతాంగనమెచ్చున్ (అ5-ప90)

"ద" అక్షరావృత్తి :

తే॥ బెదరకెంతయు నదరక భీతిలేక
యులగ కదరగ చింతింప కదిరిపడక

యాలాక కోడక తలగడ యాదరిపడక
తొలగిపోవక తలగక త్రొక్కువడక (ఆ5-ప118)

యమకము :

సీ॥ ఈ పురాణశ్రోత హృదయంబు సదయంబు
పంచాక్షరీ రసబ్రహ్మ జిహ్వ
కాయంబు పుణ్యనికాయంబు నాతని
వదనంబు సదనంబు వరదునకును
గర్ణంబు లీశ్వరాకీర్ణంబు లతులిత
భక్తి తాత్పర్య సపర్యచర్య
చరణంబు లతి శుభాచరణంబులై యొప్పు
గరములు శోభనాకరములగును
నరుడు త్రిపురభట్టు పురాణంబు వినిన
నెసగు భోగంబులు మోక్షంబు నిందునందు
నని మహాదేవుడంబిక కానతిచ్చిన
సరణిచెప్పెను నాకు సజ్జలజ భవుడు (ఆ1-ప64)

ఏకశబ్దావృత్తి :

శ్రీపర్వత మహిమవర్ణన ఏకశబ్దావృత్తిలో సాగింది.

సీ॥ గోకర్ణ గోకర్ణ గోకర్ణ సేవ్యంబు
కౌశిక కౌశిక కౌశికంబు
శ్రీధర శ్రీధర శ్రీధరావాసంబు
కామద కామద కామదంబు
నిర్వాణ నిర్వాణ నిర్వాణ శుభదంబు
భైరవ భైరవ భైరవంబు

గాంధర్వ గాంధర్వ గాంధర్వముఖశాలి
శైలాది శైలాది శైలయుతయు
అంజనాదృశ్య వినుత విద్యానువంద్య
సకల సంజీవనీ వయస్స్తంభ సంభ
కారవరగాయ భోగినీ కాయసిద్ధి
ఫలద మహిమోన్నతంబు శ్రీపర్వతంబు (ఆ4-వ110)

6.7 ఛందోవైదుష్యం :

ఆహ్లాదాన్ని కలిగించేది ఛందస్సు. ఈఆహ్లాదాన్ని కలిగించడంలో గణాలు, పాదాలు మొదలయినవే కాకుండా యతిప్రాసలు కూడా దోహదం చేస్తాయి. కవి తన అభిరుచినిబట్టి, విషయాన్నిబట్టి, ఉద్దేశ్యం బట్టి ఛందస్సులోకూడా ఎంతో వైవిధ్యం ప్రదర్శిస్తుంటాడు.

శ్రీపర్వతపురాణంలోని గద్య పద్యాల సంఖ్య 701

| ఆశ్వాసాలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| ఉత్పలమాల | 11 | 7 | 4 | 3 | 13 | 1 | 39 |
| చంపకమాల | 1 | 3 | 2 | 3 | 6 | 0 | 15 |
| శార్దూలం | 12 | 10 | 9 | 5 | 4 | 6 | 46 |
| మత్తేభం | 7 | 11 | 5 | 4 | 2 | 1 | 30 |
| మాలినీవృత్తం | 1 | 1 | 1 | 1 | 1 | 1 | 6 |
| కవిరాజవిరాజితం | — | — | — | — | 1 | — | 1 |
| తాళవృత్తం | — | — | — | — | 1 | — | 1 |
| తేటగీతి | 1 | 6 | 9 | 15 | 16 | 21 | 68 |
| సీసం | 13 | 15 | 7 | 18 | 26 | 12 | 91 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కందం | 22 | 44 | 61 | 45 | 40 | 56 | 268 |
| గద్యలు | — | 2 | — | — | — | — | 2 |
| రగడలు | — | — | — | 1 | — | 1 | 2 |
| వచనాలు | 17 | 23 | 14 | 18 | 30 | 28 | 130 |

శ్రీపర్వతపురాణంలోని ఛందోరీతుల్ని, విశేష ఛందోరీతులు, సామాన్య ఛందోరీతులు అని వర్గీకరించవచ్చు.

విశేష ఛందోరీతులు :

శ్రీపర్వతపురాణంలో విశేషఛందోరీతులు ఎక్కువగా లేవు. ఉన్న వానిని మూడురకాలుగా వర్గీకరించవచ్చు.

1. విశిష్టవృత్తాలు
2. విశిష్టగద్యలు
3 విశిష్ట దేశిచ్ఛందోగీతులు

**1. విశిష్టవృత్తాలు :**

ఈ విభాగంలో నాలుగుపాదాలు కలిగి, నియత గుణనియమం కలిగిన పద్యాలు చేరతాయి. "మాలినీ" అన్నది విశిష్టవృత్తం. న,న, మ,య,య అనేవి వరుసగా గణాలు. శేషనాథార్యకవి ఆశ్వాసాంతంలో మాలినీవృత్తాన్ని ప్రయోగించాడు. కథాభాగంలో ఎక్కడాకూడ ఈ వృత్తం కనిపించదు.

శ్రీపర్వతపురాణంలో కవిరాజవిరాజితం అనేపేరుతో ఒక ఛందోరీతి ఉంది. సంస్కృతాంధ్ర లాక్షణికులు కవిరాజవిరాజితాన్ని వృత్తంగానే గణించారు. న, 6 జగణాలు, వ అనేవి వరుసగా కూర్చడం, నాలుగు పాదాలు వ్రాయడం దీని లక్షణం అయితే శేషనాథార్యకవి కవిరాజ విరాజితం భిన్నంగా ఉంది.

"అగ్రభవ మిత్ర భవనేత్ర కరనేత్ర శతపత్ర సుపవిత్రతర విచిత్ర చారిత్రా
పంకజభృగంక శుకరాంక హరికింకర శశాంకధర శంకరమహేశా
అక్షయ విపక్ష సురాక్షస బలక్ష పణలక్ష్య నిటలేక్షణ కటాక్ష విక్షేపా
దక్షస పశిక్షణ సపక్ష సంద్రుక్ష శివరక్ష మాం పర్వతాధ్యక్షా"
(అర్-వ34)

వరుసగా మాత్రల సంఖ్యలోకూడా పొంతన కుదరడంలేదు. బహుశః అది కవి వినూత్న సృష్టికావచ్చు.

2. విశిష్టగద్యలు :

సంస్కృత సాహిత్యంలో గద్య వాఙ్మయానికి ప్రత్యేక స్థానముంది. స్తుతివాఙ్మయంలోకూడ గద్యలనే పేరుతో కొన్నిటికిప్రాధాన్యం కనిపిస్తుంది. వాటిలో రఘువీరగద్య, శ్రీరంగగద్య ముఖ్యమయినవి. తెలుగులో బిరుదు గద్యలు అనే పేరుతో కొన్నిగద్యలు, వచనాలపేరుతో సింహగిరి నరసింహవచనాలు కనిపిస్తాయి. శేషాచార్యకవి శ్రీపర్వత పురాణంలో రెండు గద్యలను ప్రవేశపెట్టాడు.

1 పర్వతగద్య
2 నందీశ్వరగద్య

పర్వతగద్య :

శిలాదుని కొడుకైన పర్వతుడు తనకు సాక్షాత్కరించిన పరమ శివుని కీర్తించడం ఈ గద్యంలోని విషయం దీనిని కవి అక్షరాలగద్యగా పేర్కొన్నాడు

పాల్కురికి సోమనాథుడు అక్షరాంకగద్య వ్రాశాడు. "అ నుండి క్ష వరకు వర్ణసమామ్నాయములో 50 అక్షరాలను ఒక్కొక్క పాదం

ప్రథమాక్షరంగా ఉంచి వ్రాసిన స్తోత్రం లఘుకావ్యం. ఈ కావ్యపు ప్రారంభంలోను, చివరలోను శ్లోకాలున్నాయి. మొత్తం 52 పాదాలు గల గద్యస్తోత్రం మాత్రాగణ నిబద్ధమైంది. ఇందులో అంత్యనియమం ఉంది.

"అఖిల లోకాధార
ఆనంద రసపూర
ఇన చంద్రశిఖినేత్ర
ఈడితామర గాత్ర
ఉరులింగ నిజరూప
ఊర్జితాచల చాప
ఋష్యాంగిర కోటీర
ౠవర్జితోదార
ఌలిత తాండవకాండ
ౡనికృతా కాండ
ఏకద్వైతత్త్వేశ
ఐశ్వర్య నిర్వేశ
ఓంకార దివ్యాంగ
ఔన్నత్య గణసంగ
అంబికా హృదయేశ
అస్తోక కలినాశ
.... .... ....
శ్రీపర్వత మహాలింగ మహాదేవ నమస్తే నమస్తే నమస్తే నమః
(అ2–ప101)

శేషనాథాచార్యకవికూడా "అ" మొదలు "క్ష" వరకున్న అచ్చుల్ని

పాదాదితో ఉంచి సంబోధనాంతంగా ముగించాడు. కాని సోమన గద్యలో లాగ ప్రారంభంలోను చివరలోను శీకాలులేవు.

భగవంతునికి అక్షరుడని పేరుంది అక్షరుని స్తుతించేది గనుక అక్షరాంకగద్యనామం సార్థకం. ఇందుకాభాషకు వర్ణాలు ప్రధానం వర్ణాలలో అచ్చులకే స్వరములని పేరు. స్వరాలతో స్వామిని స్తుతించడం, బీజాక్షరాలతో ప్రార్థించడం మంత్రశాస్త్ర విషయం. ఈ దృష్టితోనే నిర్దిష్ట ప్రయోజనార్థం పర్వతుడు శివుణ్ణి అక్షరాంకగద్యలో ఆరాధించాడు.

2. నందీశ్వరగద్య :

శిలాదుని కొడుకైన నందీశ్వరుడు తనకు సాక్షాత్కరించిన పరమ శివుణ్ణి కీర్తించడం ఈ గద్యలోని విషయం. దీనిని నిరోష్ఠ్యగద్యగా పేర్కొన్నాడు.

ఆశు, మధుర, చిత్ర, విస్తార కవితలలో నిరోష్ఠ్యం అన్నది చిత్ర కవితా విభాగంలో చేరుతుంది. ఇది అక్షరాలకు సంబంధించింది కావడం వల్ల దీనిని శబ్దాక్షర చిత్ర కవిత అని వ్యవహరించవచ్చు. నిరోష్ఠ్యం అంటె ఓష్ఠ్యవర్గాలు లేకపోవడం అని అర్థం. ప్రాచీన సాహిత్యంలో నిరోష్ఠ్యపదాలున్నాయి కాని గద్యలులేవు. శేషనాథార్యకవి గద్యంలో కూడ ఈ ప్రయోగం చేసి తన వైదుష్యాన్ని నిరూపించుకున్నాడు.

నిరోష్ఠ్యగద్య :

"జయ జయ సకల కళ్యాణతన్న రత్నాకరా!
సకల నిర్జర నికరశరణ్యా!
శ్రీశైల హాటకాచల కైలాస కందర సదన సంతత సంచారా!
జలజాసన సహస్రాక్ష ధనంజయ దండధర నిశాట సదాగతి
ధనదాది నిఖిల నిర్జర శిరః కిరీట రత్న చకచక

చాంచల్యస్థగిత చరణ సరసిజా!

....    ....    ....    ....

లింగాక్ష సహస్రాక్ష దశానన గజానన గజకర్ణ శంఖకర్ణ గోకర్ణాది
సనాతన గణాళి సదారాధన క్రియాధ్యేయ నిధానన
చంద్ర చంద్రికా రాజిత గిరిరాజ కన్యకానయన
హల్లక నిజదేహ జలది జనిత జగజ్జాల తరంగ
శ్రీశైలలింగ నమస్తే నమస్తే నమః (అ2-ప65)

3. విశిష్టదేశిచ్ఛందోరీతులు :

ఇందులో మూడు భాగాలున్నాయి.

1. గణప్రాధాన్యం కలవి
2. మాత్రాప్రాధాన్యం కలవి
3. గణమాత్రాదులతోపాటు తాళాలకు ప్రాధాన్యం కలవి

గణప్రాధాన్యం కలవి :

గణములకు ప్రాధాన్యమివ్వడం ఇందులోని విశేషం. దండకాదులు ఇందులో చేరతాయి. సంస్కృతంలో దండకాలున్నా తెలుగుదండకాలకు వాటికి పేరులో తప్ప సామ్యాలులేవు. స-భ-య-ర-త గణాలతో ఎన్నిటినైనా కూర్చి దండకాలు వ్రాయవచ్చు. చివర నమః అని ఉండడం స్తుతి దండకం అవుతుంది.

నన్నయ భారతంలో అర్జునుడు శివస్తుతి చేసిన సందర్భంలో-
"శ్రీకంఠలోకేశ లోకోద్భవ స్థాన సంహారకారీ.... .... కారుణ్య
మూర్తి త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః
(అరణ్యపర్వం ఆ1.ప324)

అనే తగణ దండకం ఉంది.

శేషనాథార్యకవి వ్రాసిన దండకాలు రెండు. మొదటిది శిలాదుని దండకం. రెండవది పర్వతుని దండకం.

శిలాదుని దండకం :

భక్తుడయిన శిలాదుడు సాక్షాత్కరింపచిన పరమశివుని కీర్తించడం ఈ దండకంలోని విశేషం. ఇది తగణదండకం. ఈ దండకం పూర్తిగా సంస్కృతదండకం శ్రీనాథుడుకూడా శృంగార నైషధంలో సంస్కృతం సరస్వతీ దండకాన్ని వ్రాశాడు.

దండకం 1

"శ్రీ మేరు కైలాస సింహాసనాధీశ నాకేశ ముఖ్యామరస్తోమ
మస్తస్థలీ హేమకోటీర నిష్యూత మాణిక్యరింఛోళి పాళీ
మయూఖాగ్ర కింజల్కిత శ్రీపదాంభోజ సత్కీర్తి కర్పూర
సంవాసి శాంభోజ గర్వాండఖాండా మహోద్దండ శుండాల
దైతేయ ఖేలా తమః ఖండ మార్తాండ హేమాద్రి కోదండ
చండేశ్వర స్తుత్య నిత్యా నిరాతంక నిశ్శంక నిర్ద్వంద్వ
నిస్సంగ నిర్లేప నిర్మాయికా నిష్కళంకా
.... .... .... ....
నాగేంద్రాత్మ జేశా మహేశా గిరిజా
నమస్తే నమస్తే నమస్తే నమః (ఆ2-ప38)

శ్రీమేరుశబ్దంతో మొదలుకావడం నమః శబ్దంతో ముగియడం, సంస్కృతంలో దండకరచన సాగడం ఇందులోని విశేషం. ఇందులో 251 తగణగణాలున్నాయి.

పర్వతుని దండకం :

శిలాదుని కొడుకైన పర్వతుడు తనకు సాక్షాత్కరించిన పరమ శివుని కీర్తించడం ఈ దండకంలోని విషయం. దీనికి విశేదండకం

అని కవి పేరుపెట్టాడు. ఇలాంటి పేరు ఏ లక్షణగ్రంథంలోను కనిపించదు. అయితే భాషా విషయంలో మాత్రం ఇది సంస్కృతాంధ్ర సమ్మిశ్రితం.

"శ్రీశైల సామ్రాజ్య సింహాసనాసీన శ్రీమన్మహాదేవ సర్వజ్ఞసర్వేశ

సర్వామరాధీశ సమ్యక్పర బ్రహ్మరూపా విరూపాక్షదేవా!

....  ....  ....  ....

దేవ నీనిల్కడల్ పుణ్యతీర్థాళి నీక్రమంబుల్ సమస్తామర

శ్రేణి నీచారు నిశ్వాసముల్ వేదముల్ నీదు లీలావినోదంబు

లీలోక జాలంబు నీదేహ వారాశిలో లోక వీచీకదంబంబు

లావిర్భవింపంగ నప్పద్మజాండంబులోనున్న బ్రహ్మాదులా

నీ మహత్త్వంబు వర్ణింపగా నేర్తురే దేవ నీ భ్రూలతాచారు

విక్షేపమార్గంబునన్ బద్మజాండంబులెల్లన్ సముద్భూత

రక్షోన్నతిం జెర్చు నీవర్గిమహింపు కార్యంబు లెన్నంగ శక్యంబె

....  ....  ....  ....  ....

పుణ్యహేతో నమో నిత్యశక్తే నమస్సత్యరక్తే నమో

మంజుకాంతే నమస్తత్త్వ శాంతే నమోనంత భూతే నమః

పూతగతే నమో ధర్మయుక్తే నమస్సూన్నతోక్తే నమో

విశ్వసృష్టే నమో దివ్యదృష్టే నమో భక్తబంధో నమః

పుణ్యసింధో నమో భవ్యమూర్తే నమశ్శుభ్రకీర్తే నమః

పుణ్యవర్తే నమః పార్వతీశా నమశ్శ్రీగిరీశా నమస్తే

నమస్తే నమస్తే నమః (అ2-ప81)

ఇదికూడా తగణదండకమే. శ్రీశైల శబ్దంతో మొదలుకావడం నమః శబ్దంతో ముగియడం. ఇందులో 244 తగణగణాలున్నాయి.

2 మాత్రాప్రాధాన్యం కలవి :

మాత్రాప్రాధాన్యం గల ఛందస్సులో రగడలు పేర్కొనదగినవి. లాక్షణికులు నవవిధ రగడలను పేర్కొన్నారు. ప్రబంధాలలో పుష్పాపచయ సందర్భంలో రగడలకు వ్యాప్తి ఎక్కువ. కాని సుదర్శనరగడ జయనరగడ మొదలయిన వాటినిబట్టి మొదట స్తుతికి రగడలువాడినట్లు స్పష్టం.

శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో రెండు రగడలున్నాయి.

చంద్రవతి "రగడ"
కావ్యాంత "రగడ"

చంద్రవతి రగడ :

చంద్రవతి పరమశివుని కీర్తించడం ఈ రగడలోని విషయం ఇది హరిగతి రగడకు చెందిన రగడ.

"శిఖరము జూచిన నరులకు నధికశ్రేయము లొనగును శ్రీపర్వత
లింగము
శిఖరము జూచిన నతులిత ముక్తిశ్రీ లొనరించును శ్రీపర్వత
లింగము (ఆ4-ప27)

ఈ రగడలో న-ల-స-భ-గ-గ గణాలున్నాయి ఆద్యంత ప్రాస నియమాలున్నాయి మధురగతి రెట్టింపు 4 గణములపై యతి. ఈ రగడలో 84 పాదాలున్నాయి.

కావ్యాంతరగడ :

శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణం కావ్యాంతంలో రగడ వ్రాశాడు

"శ్రీగిరి నాయకు సేవించెదనని
శ్రీగిరి సన్నుతి చేసెదనేనని
శ్రీగిరి తీర్థ ప్రేరిత గతియని
....     ....     ....
ఇది శ్రీగిరి పతిహిత సన్నిధియని
ఇది పరియిలపని నిహపరసుఖమని (ఆ6-ప118)

ఇది మధురగతి రగడ చతుర్మాత్రా గణాలు నాలుగు రెంటిపై యతి గా-భ-స-న గణాలున్నాయి జగణం లక్షణంలో నిషిద్ధం.

3 గణమాత్రాదులతోపాటు తాళాలకు ప్రాధాన్యం కలవి :

వీటిలో తాళవృత్తాలు చెప్పుకోదగినవి శ్రీపర్వతపురాణంలో కర వీరుని స్తుతిలో ఉంతాళవృత్తాలు కనిపిస్తాయి ఇది చాల సుదీర్ఘమయిన తాళవృత్తం ఇందులో 17 భాగాలున్నాయి ఒక్కొక్కభాగం ఒక్కొక్క నడకతో సాగుతుంది స్తుతిలోని పూర్వభాగం మధురగతి రగడలాగ సాగుతుంది. ఉదాహరణకు-

"శ్రీపర్వత సింహాసనభర్తా
పావన కల్మషచయ సంహర్తా
మానిత పూజాశుచి నుతిహారా
శ్రీనగ శృంగ స్థితశుభపిరా
వితత చతుర్దశ భువనాధీశా
ప్రథిత శ్రీపర్వతమల్లేశా (ఆ5-ప33)
ఒకచోట మాత్రం-
"జయ జయరంగ తరంగ శుభాంగ
ఒరంగ దృగంగయుత స్వచ్ఛం

శశిచ్ఛ విగుచ్ఛ సుధారన కచ్ఛ
జట ఝట సుమతి ఛ్ఛందం" (అ5-వ33)

అనే వివరణ కనిపిస్తుంది అయితే సంస్కృతాంధ్ర లక్షణగ్రంథా లలో ఈ పేరుతో ఉన్న ఛందస్సు కనిపించదు. పరిశీలించగా ఇది పాదానికి స్థూలంగా 15 మాత్రలు కలిగిన ఛందస్సు అని చెప్పవచ్చు

2 సామాన్య ఛందోరీతులు :

శార్దూలం :

ఇది అతిధృతిచ్ఛందం నుండి పుట్టింది పాదానికి 19 అక్షరా లుంటాయి మ-స-జ-స-త-త-గ గణాలుంటాయి 12వ అక్షరం యతి స్థానం.

"శార్దూల విక్రీడితం మసౌజసౌతౌగా దిత్యఋషయః"
(పింగళఛందం అ8-వ22)

సంస్కృతాంధ్ర లాక్షణికులు ఈ పేరునే లక్షణాన్నే అనువర్తిం చాడు సంస్కృతాంధ్రాలలో ఈ ఛందస్సుకు విశేష ప్రచారం ఉంది. రాజశేఖరుడు మొదలయిన కవులు దీనిని ఎక్కువగా అభిమానించాడు మత్తేభాన్ని అణగద్రొక్కి సంస్కృతాంధ్ర భాషలలో స్వేచ్ఛావిహారం చేసింది విశేషించి ప్రాచ్యులయిన గౌడీయులకు శార్దూలం పరమ ప్రీతికరమైందని "శార్దూల లీలాప్రాచ్యేషు"అని కాత్యాయనవచనము. (కావ్యశాస్త్రము 14)

19 అక్షరాల పాదంలో 12 అక్షరాలవరకు అవిచ్ఛిన్నమయిన ఉచ్చారణ విధించడంచేత శార్దూలవృత్తం వక్తృప్రౌఢ శాంతికరం, దుఃఖావహం, ఓజో నిర్వర్త్యం అట్లే శ్రోతృ శ్రవణోద్వేజకం, ఓజో నకం దీర్ఘసమాన ఘటనాత్మకంగా నిర్విరామ వాక్యనిర్మాణప్రవణు లయిన గౌడీయులకు శార్దూలవృత్తం ప్రేమపాత్రం కావడం సహజం

గురువు అక్షరాల బాహుళ్యంచేత సాడంబరమై ఉండడంవల్లకూడా గౌడీయులకు ఉదాత్తపాత్రమవడం ఉచితం. "గౌడ్యోస్వక్షరడంబరః" అని అభియుక్తోక్తి.

తెలుగు సాహిత్యంలో శార్దూలవృత్తప్రయోగానికి ముఖ్యకారణం దాని గురువు అక్షరాల బాహుళ్యం ఓజోమయత్వం అని చెప్పవచ్చు. ఆంధ్రులు చతురమధురమయిన వైదర్భమార్గప్రియులు. ద్విత్రిగురువు లయిన పదాలు తెలుగులో దుర్లభం. దుష్కరప్రాసవలె శార్దూలవృత్తం కూడ విశిష్ట ప్రయోజనం అవసరమున్నచోటనే కాబట్టి ఉపయుక్తమవు తుందని చెప్పవచ్చు.

కవియొక్క చిత్తస్పందన ఎక్కువైనపుడు శార్దూలవృత్తం కన బడుతుంది. చిత్తస్పందం మన్ప్రవాహిణి అయినపుడు గురువు అక్షర ప్రాయముఅయిన శార్దూల విక్రీడితాలు ప్రయోగార్హములని భరతుడు అభినవగుప్తుడు ఉపదేశించారు. ఆ చిత్తస్పందం కరుణవీర రౌద్రాదు లందు పరభులీకాస్సరణ సమయంలో ఉండవచ్చునని వారే ఉప దేశించారు.

నాగలాటిశేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో శార్దూలపద్యాలను వ్రాశాడు ఈ కవి శారూల పద్యాలను నాలుగురకాలుగా వర్గీకరించవచ్చు.

1. వస్తుప్రాధాన్యం కలవి
2. మానసిక ప్రాధాన్యం కలవి
3. స్తుతి ప్రాధాన్యం కలవి
4. చలదృశ్య ప్రాధాన్యం కలవి

వస్తు ప్రాధాన్యం కలవి :

శేషనాథార్యకవి ప్రధానంగా నదులు (ఆ3-ప53, 60), కొండలు

(ఆ3-వ66, 95), ఆశ్రమవర్ణన (ఆ3-వ94) లకు శార్దూలం వాడాడని చెప్పవచ్చు. మచ్చుకు—

శిలాదుని కొడుకు పర్వతుడు. పర్వతుడు పెరిగి పెద్దవాడై శివుణ్ణి ఉద్దేశించి తపస్సు చేస్తున్నాడు.

శా॥ దుల్లెన్ దారలు చంద్రభాస్కరులు బిట్టుజ్జాడగా బ్రహ్మభీ
తిల్లెన్ దిక్కరులెల్లమ్రొగ్గె దివిజాధీశుల్ దలంకంగ ని
ట్లల్లాడెన్ ధర తల్లడిల్లె హరి బ్రహ్మాండంబు కంపింప శో
భిల్లెన్ శంకరుడాదిదేవుడు కృపాభీష్టప్రదస్వాంతుడై (ఆ2-వ77)

తారలు, దిగ్గజాలు, ధరాదులు, తల్లడిల్లడాన్ని పాదాదిలోనే సూచించి కల్పాంతసమయాన్ని కవి సూచించాడు.

మానసికప్రాధాన్యం కలవి :

శేషనాథార్యకవి మానసిక అవస్థను శార్దూల పద్యంలో వ్రాశాడు. సాధకుడు పేళికాబిలం చేరాడు తివాంగనలు అతని యోగక్షేమాలు విచారించారు. సాధకునికి నింగారుగిన్నెలో రసాయనం ఇచ్చారు. సాధకుడు బలవంతుడయ్యాడు. అపుడు సాధకునికి మానసికపరిణామాని శార్దూల పద్యంలో నిరూపించబడింది.

శా॥ నీరే జానను డెంత నేర్పరి జయోన్నిద్రుండ వై వస్త్రతుం
డారాత్రిచరుడే బలాన్వితుడు తీవ్రాంశుడు తేజస్వియో
శూరుండే యనిలుండు పాశధరుడన్ సుత్రాముడే భోగి వి
స్తార ప్రక్రియ నేనెగాక నిగదా వందంబుచే దివ్యులున్

(ఆ6-వ17)

స్తుతిప్రాధాన్యం కలవి :

శేషనాథార్యకవి ప్రధానంగా పరమేశ్వరస్తుతి (ఆ1-వ1, 2, 3, 4

19, 11, 12, 22) (అ2–ప58, 83, 84, 85), (అ3–ప28), (అ4–ప32, 75, 79, 80), (అ5–ప145) తీర్థాల స్తుతులకు (అ4–ప68), ప్రధానంగా శార్దూలం వాడాడని చెప్పవచ్చు. మచ్చుకు చంద్రవతి శ్రీపర్వతస్వామి స్తుతి.

శా॥ శ్రీకంఠాయ నమోస్తుతే భగవతే శీతాంశు జూటాయుతే
వైకుంఠాక్షి సమర్పితాయ దివిషద్వ[illegible]ంతే దేవతా
నీకాభీష్ట ఫలప్రదాయ కరుణోన్మీల త్కటాక్షాయతే
లోకేశాయ నమోఽస్తుతే యనుచు నాలోకించు బూజింపుచున్

(అ4–ప79)

శా॥ విద్యుత్కాంతి జటాకలాపః యుభవాః విశ్వేశః నీపూజచే
సద్యోముక్తములౌ సంఘంబులు మరుత్సంఘంబుచే బాయునే
ప్రద్యోత ప్రబల ప్రతాపమగు నాథానుప్రభన్‌గాక యా
ఖద్యోతద్యుతివాయు నేర్చునె మహాభర్వోర్వరధ్వాంతముల్

(అ4–ప80)

చలదృశ్య ప్రాధాన్యం కలవి :

చలదృశ్య ప్రాధాన్యం ఉన్న వర్ణనలో నాట్యవర్ణన పేర్కొనదగింది. ద్వితీయాశ్వాసంలో హరిబ్రహ్మాదులు పర్వతలింగాన్ని పరివేష్టించి కొలిచేసందర్భంలో ఈ నాట్యవర్ణన ప్రాధాన్యం గల శార్దూల పద్యం వ్రాశాడు.

శా॥ ముక్కంటిం భజియించువేళల గడున్‌ప్రేమోయంగ నాట్య క్రియల్
నిక్కంబున్ బచరింతు రిందువదనల్ నేర్పున్ విడంబింపంగా

ఢక్కన్ మర్దల కాహళ ధ్వనిగతుల్ ఝుం ఝుం ఝుణత్తుత్త తా
ధిక్కం ధిం ధిమితక్క తోనకధిమిం ధీయుంచు ఘూర్ణిల్లగన్
(అ2-ప112)

శా॥ పంకేజాక్షుల నర్తనంబు పటహ ప్రక్వాణ వీణారటల్
ఢంకారార్భటి మర్దల ధ్వని ఢమడ్ఢక్కాహుడుక్కా మహా
ఝ్ఝుంకారానక ఝర్ఝర ప్రకర ఝుం ఝుం ఝుల్లరీ నిక్వణ
ధ్వాంకారంబులు మ్రోయ శ్రీనగముపై బ్రాహ్లాది కాలంబునన్
(అ2-ప113)

మత్తేభం:

మత్తేభవృత్తానికి సంస్కృత వాఙ్మయంలో ప్రచారం లేదు. తెలుగులో శార్దూలంకన్నా మత్తేభానికే ఎక్కువ ప్రచారం ఉంది.

పాదానికి 20అక్షరాలుంటే అందులో 10 గురువు అక్షరాలుంటాయి దీనిలోని అక్షరవృత్తి విలంబితం అనదగింది. భయ, శోక, జుగుప్స, విస్మయాది భావాలందు చిత్తస్పందన విలంబనం వ్యంజించడానికి సులభం సరిపోతుంది. కవిత్రయ కవులు వీరరౌద్రాలకే మత్తేభ వృత్తాన్ని పరిమితం చేయలేదు. ఇతర రసాలకుకూడా మత్తేభవృత్తాన్ని వాడినారు.

నాగలూటి శేషనాధార్యకవి శ్రీపర్వతపురాణంలో మత్తేభవృత్తాలను వ్రాశాడు. ఈ కవి మత్తేభవృత్తాలను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

1. వస్తుప్రాధాన్యం కలవి

2. స్తుతిప్రాధాన్యం కలవి

పద్య ప్రాధాన్యం కలిగి :

శేషనాథార్యకవి ప్రధానంగా కొండ (ఆ2-ప3, 5, 6, 13) (ఆ2-ప84, 96), నది (ఆ1-ప57), (ఆ3-ప54, 72), విద్యాకౌశలం (ఆ4-ప93) లకు ప్రధానంగా మత్తేభాన్ని వాడాడని చెప్పవచ్చు. మచ్చుకు కైలాసవర్ణన–

మ॥ అమరేంద్రాది విశాల వైభవ పరిహాసంబు సంజీవనీ
ద్రుమ లీలావనకేకి వానము సురస్త్రీమాప్సరః కిన్నరీ
ప్రమదాధ్యాసము దత్పుధారన పరివ్రాజత్ప్రపావాసమున్
బ్రమదోల్లాసముగల్గు భూరుహ మనోజ్ఞానంబు గైలాసమున్
(ఆ2-ప13)

స్తుతి ప్రాధాన్యం కలవి :

శేషనాథార్యకవి ప్రధానంగా స్వామి స్తుతులకు (ఆ1-ప6, 15, 16) (ఆ2-ప86), (ఆ3-ప32), (ఆ4-ప81, 82), (ఆ6-ప110), దిగ్పాల స్తుతులకు (ఆ3-ప54, 72) ప్రధానంగా మత్తేభవృత్తాన్ని వాడాడని చెప్పవచ్చు. మచ్చుకు పర్వతుని స్తుతి–

మ॥ కరిపోతంబు తదీయ మాతృకుచ మూకాంక్షించుగా కెట్లునూ
కరపక్షోరుహ దుగ్ధధారలమదిన్ గామించునే దేవ నీ
చరణద్వంద్వ పయోజభక్తి కల నా సౌఖ్యమ్మృతాస్వాదిని
ర్జర రాజ్యాదిక దివ్యభోగములు నిస్సారంబులన్ గోరునే?
(ఆ2-ప86)

ఉత్పల చంపకాలు :

నాగానం ముక్తేబాలలో గురులఘర ప్రాధాన్యం వుండే ఉత్పల

చంపకాలలో లఘ్వక్షర ప్రాధాన్యం ఎక్కువ. ఉత్పల చంపకాలు పుష్ప వాచకాలు. ఉత్పల చంపకాలు వాటికి ప్రాధాన్యం. అందువల్ల భక్తి ప్రాధాన్యం వున్న గ్రంథాలలో ఉత్పల చంపకాల ప్రయోగం ఎక్కువ ఉంటుంది. ఉత్పల చంపకమాలలు స్తుతికేగాక వస్తు వర్ణనకు, విషయ వివరణకుకూడా శేషనాథార్యకవి వాడాడని చెప్పవచ్చు. స్తుతికి ఉదాహరణ–

ఉ॥ పంకజ గర్భవంద్య శివశర్మ గణప్రియ విన్నపంబు నా
వంక గృపా సుధార్ద్ర పరివర్ధిత తుష్టియొనర్చి నన్ను నీ
వింక గజాశిలోక నొక లెక్కనుగా దయ బ్రోవుమయ్య ని
శ్శంక వృషాంక! కింకర వశంకర! శంకర! శాంకరీ ప్రియా!
(అ2-ప50)

విషయ వివరణకు ఉదాహరణ–

చ॥ ఎదురున మోహినీగజము హెచ్చిమహోగ్రగతి యంకరార్భటిన్
మదయుత ఘీంకృతధ్వనులు మార్మ్రోగనియుండగ సాహసోద్ధతిన్
బెదరక నిల్చి సాధకుడు వెల్వడసేగును విక్రమక్రమా
భ్యుదిత మహాప్రతాపమున మందగ జూచి మదేభమున్నతిన్
(అ5-ప12)

సీసం :

అనియతాక్షర సంఖ్యాకమయిన సీసం శుద్ధదేశీయచ్ఛందం. సీసం తక్ జాతీయములయిన ఆటవెలది తేటగీతులు ఉపజాతులుగా చెప్పబడుచున్నాయి. వీని నిర్మాణంలో ఉపయుక్తమయ్యేవి. ఉప గణములలోని సూర్య ఇంద్రగణాలు. గురువు లఘ్వక్షర నివేశక్రమ రాహిత్యంవల్ల ఈ పద్యాలను నిర్మించడంలో కవికి అపారమైన స్వేచ్ఛ

ఉంది. "అనియతగణైః ప్రాసోనా యతిర్వా" అని దేశీయచ్ఛందం సామాన్యలక్షణం. సీసం, ఆటవెలది తేటగీతి ఈ లక్షణాల్ని, అనుసరించి ఉంటాయి.

ఆరు ఇంద్రగణాలపై రెండు సూర్యగణాలుచేరి ఏర్పడిన నాలుగు పాదాలనుకూర్చి తరువాత ఒక ఆటవెలది లేక తేటగీతి పద్యం చేరిస్తే సీసపద్యం ఏర్పడుతుంది. నాలుగు సీసపు పాదాలపై గీతి పాదాలు నాలుగు చేరగా ఏర్పడిన సీసపద్యం నిజానికి పద్యద్వయ సమాహారమే గాని ఏకపద్యం కాదు. విస్తృతమయిన విషయాన్ని ఏకాన్వయంగా ప్రతిపాదించుటకై సీసపద్యం కల్పించబడింది. "దేశి" పద్యాలన్నింటిలో కెల్ల సీసం విస్తృతమయింది.

ఆంధ్రమహాభారతంలో ప్రయోగించిన సీసపద్యాలు సమసీసాలు భారతకవులు ప్రయోగించిన సీసపద్యాలన్నీ గురులఘు మిశ్రమాలు

శీర్షక శబ్దభవం సీసం కావడం ఒకకారణమయినా పర్వతాలలోనే శీర్షకమయిన శ్రీశైలాన్ని వర్ణించడంవల్ల సీసం ఎన్నుకోవడం సమంజసంగా ఉంది.

శేషనాథార్యుని సీసపద్యాలను–

1 గణవిన్యాస వైచిత్రి కలవి
2. పాదవిన్యాస వైచిత్రికలవి
3. వస్తువిన్యాస వైచిత్రి కలవి

అని మూడురకాలుగా వర్గీకరించవచ్చు.

1. గణవిన్యాస వైచిత్రి కలవి :
ఏకరూపక ప్రథమాక్షరసామ్యం :

సీ॥ ఏ ఎల్లవాలయిన నెనసిన యువి సర్వ

శోకోపహార దివ్యౌషధములు
ఏ గిరిపై బ్రవహించిన దివవంత
లంబుదాసులకు జన్మాంతరంబు (ఆ5–ప139)

ఏకరూపక ద్వితీయా గణసామ్యం :

సీ॥ ముడిచినాడే వేల్పు మున్నిటి నడివీథి
శృంగార పూదోట చిన్నిపువ్వు
గట్టినాడే వేల్పు కటిమీద దిండుగా
బది తెలుంగుల వన్నె వచ్చడంబు (ఆ2–ప78)

ఏకరూపక ప్రథమ, ద్వితీయ, తృతీయ గణసామ్యం :

సీ॥ ఎన్ని కల్పాదుల నెందఱుపేంద్రులు
నెన్నికల్పాదుల నెందఱజలు
ఎన్ని కల్పాదుల నెందఱు దేవేంద్రు
లెన్ని కల్పాదుల నెందఱమరు (ఆ1–ప72)

ఏకరూపక సప్తమాష్టమ గణసామ్యం :

సీ॥ బాలకులోత్తమ బ్రహ్మచారులకును
శిక్షించి చదువురాజెప్పి చెప్పి
శోభితనవలతాశుద్ధాంత కాంతల
గమ్మని పూలిచ్చి కలసి కలసి (అ4–ప38)

ఏకరూపక అష్టమ గణసామ్యం :

సీ॥ శ్రీపర్వతంబు వర్ణింపగాదగు ధరా
జలజాక్షి కర్ణభూషణమువోలె
గవిరాజ దినకర కమలాసతీశ్వర
ధామమై యేరు భూధరమువోలె (అ4–ప3)

2. పాదవిన్యాసవైచిత్రి కలవి :

పాదాలదృష్టితో పరిశీలించగా శ్రీపర్వతపురాణంలోని సీసాలు 3 రకాలు.

1. నాలుగుపాదాలతో గీతాంతములు
2. ఐదుపాదాలతో గీతాంతములు
3. అనేకపాదాలతో గీతాంతములు

నాలుగుపాదాలతో గీతాంతములు :

సీ|| ఏ దేవునకు శిఖరేశ్వరం బ్రశాంత
లాలిత క్రీడాచల స్థలంబు
శివనేపెల్లు క్రీడించు కేళాకూళి
తరళ తరంగ పాతాళగంగ (అ3-ప92)

ఐదుపాదాలతో గీతాంతములు :

సీ|| వినవయ్య మరియును విపినాంతరంబున
కేల త్తిరికి బ్రీతివరుగునెడను
నందొక్క యాబోతు నవలిత ప్రేఖతోడ
నన్నుతాకృతి జూచి యుల్లసిల్లి
రొక్కపుణ్యుండు సముత్సాహభక్తితో
నంత ప్రదక్షిణం బాదరించు
పలుమారు మ్రొక్కుచు బ్రణుతించి వృషభంబు
అక్కడ మగిడి తానీ బిలంబు
జొచ్చిన నామది పోద్యమందుచు వచ్చి
యా యయ్యకును మ్రొక్కి యతని బొగడి

యెందు నుండి వెపుడు నీవెవ్వరనఘ
యిట్టి వృషభంబు నెక్కడకేగు తెఱగు
ఇంత సంభ్రమమేల యిందేలసిద్ధి
నాకు నీయాన చెప్పుము నిర్మలాత్మ (అ5-వ59)

3. అనేక పాదాలతో గీతాంతములు :

ఐదుకంటె మించిన పాదాలుండడం దీని ప్రత్యేకత. ఈలాంటి వాటిని "సీసమాలిక"అని చెప్పవచ్చు. చంద్రవతి శ్రీపర్వతాన్నిస్తుతించె సందర్భంలో "సీసమాలిక" ఉంది. ఇందులోని సీసపాదాలు 16.

సీ॥ శ్రీకోటిలింగాద్రి వేళికాగహ్వర
బ్రహ్మ మాధవ రుద్ర పర్వతములు
భర్గజూటీ సింధు పావన ప్రోత్తుంగ
తర మహాభంగ పాతాళగంగ
.... .... .... .... ....
శేషయోగీంద్ర హృదయేశ శ్రీగిరీశ (అ5-వ72)

3. వస్తువిన్యాస వైచిత్రికలవి :

కవి కథాకథనానికి, వస్తువర్ణనకు, తన అలంకారిక ప్రతిభ ప్రదర్శనకు, వైదుష్యానికి వాడుకోవడం ఈ విభాగంలో చేరుతుంది.

కథాకథనసీసాలు :

ఈలాంటి సీసాలలో గతికి ప్రాధాన్యం తక్కువ. ఎన్నో విషయాలను చెప్పడమే దీని ప్రయోజనం. కథ ముందుకు నడిపించడమే కవి ఆశయం.

సీ॥ వసుమతి యను మునీశ్వరపుత్రి సుకుమారి

కలహంస గామిని కంబుకంఠి
యచ్చర్వతమ్మున నయ్యిందు బింబాస్య
తరలాక్షి యత్యుగ్ర తపము చేయ (ఆ3-ప11)

వర్ణనాత్మక సీసాలు :

సామాన్యులకంతగా తెలియని వస్తువు, వ్యక్తి స్వరూపస్వభావాలను విశదపరచేవేళ కవి సీసపద్యాలను ప్రయోగించడం ఈ వర్గంలో చేరుతుంది.

సీ॥ పర్వతభూమి ముప్పదియోజనంబుల
వెడలుపు నిడువుదవ్విస్తృతంబు
క్రమజనాభీష్ట కామ్య పదైశ్వర్య
ధన్యంబులగు చతుర్ద్వారములను
గామిత ఫలసిద్ధి కారణసౌఖ్య సా
ధ్యము లెనిమిది యుపద్వారములను
షోడశ సంఖ్యాత శోభితాలంకార
కరణంబులగు గవాక్షములు గలిగి
భుక్తి ముక్తి స్థలోపేత పుణ్యతీర్థ
శక్తి భైరవ దేవతా సంయుమీంద్ర
పావనాశ్రమ శివలింగ వరికరాష్ట
శిఖరశోభా విలాసంబు శ్రీనగంబు (ఆ3-ప4)

ఆలంకారికసీసాలు :

విభక్త్యంతంగా, ఉపమావాచకాంతంగా, సంబోధనాంతంగా, సీసాలను ముగించడం ఆలంకారికసీసం,

విభక్త్యంతం :

మైత్రాయణీయంబు మండూకశౌక్లేయ

సామాయణీయాది శాఖలందు
వార్తాంతపేయంబు వైనేయశౌనక
శ్యాపాయనీయాది శాఖలందు (ఆ1-ప48)

ఉపమావాచకాంతం :

సీ॥ మదన రంభాప్రజ మహిళాకంటాది
సహితమైన దివతాస్థలమువోలె
సమర మునీంద్ర గాయత్రి జపానేక
సహితమయ్యును బ్రహ్మసభయుబోలె (ఆ6-ప29)

సంబోధనాంతం :

సీ॥ మాధవీ నవ పుష్పమంజరి చూచితే
యభిరామ నవకలహంసయానః
యభిరామ నవకలహంసాళి జూచితే
ఖేలాభినవ రాజ కీరవాణి (ఆ4-ప43)

ఇవేకాకుండా ఏకనామ, సర్వనామ క్రియాంతాలయిన సీసాలు కూడా శ్రీపర్వతపురాణంలో కనిపిస్తాయి.

భాషాదృష్టి :

భాషాదృష్టితోపరిశీలిస్తే శేషనాథార్యకవిసీసపద్యాలలో సంస్కృత సీసాలు, ఆంధ్రసీసాలుకూడా కనిపిస్తాయి.

సంస్కృతసీసాలు :

తెలుగు పదాలేవీ లేక సాగడం కొన్నిటిలో కనిపించినా గీతంలో చివరిపాదం మాత్రం తెలుగుతనం చేయడం ఈవిభాగంలో కనిపిస్తుంది

సీ॥ శ్రీనగ ప్రోత్తుంగ శిఖరాగ్ర సంసంగ
వేదికోత్తుంగ సమీనసంగ
యుళయ తీరకుడుంగ యుక్తపవిత్రాంగ
జలజాత భృంగ సంచరరథాంగ (ఆ4-ప6౦)

సీ॥ అనిమిషలోచన యావర్తనతనాభి
పృథురథాంగస్తన పీనహార
శృంగార సైకత శ్రీజఘనస్థలి
వికచపద్మానన విద్రుమోష్ఠి (ఆ3-ప54)

సీ॥ శ్రీనీలకంఠాయ శీతాంశుజూటాయ
మననాంతయ నమశ్శివాయ
కాలాగ్ని రుద్రాయ కాలసంహరణాయ
మున్మసిజ్ఞాయ నమశ్శివాయ (ఆ4-ప100)

వికసమాసాంతంగా సీసపద్యాలయు నడిపించడం కూడా ఇందు లోని భాగం.

సీ॥ సురధేను గోష్ఠ సంశుద్ధ రోమాంథ ప్ర
సిద్ధ పావన కనచ్ఛ్రేణికలను
దత్తప్రదేశ విస్తర సుధాదీర్ఘికో
పాంత మాణిక్యసోపానములను (ఆ2-ప12)

కందం !

సంస్కృతంలో అనుష్టుప్పుకు ఎంతప్రాధాన్యతఉందో తెలుగులో కందపద్యానికి అంత ప్రాధాన్యం ఉంది. శివకవులు ఎక్కువగా కంద పద్యాన్ని అభిమానించారు.

"అనుష్టుప్ సతతశక్తా సాభినందస్య నందినీ

విద్యాధరసన్న వదనే గుళికేవ ప్రభావభూః"

అని క్షేమేంద్రుడు అనుష్టుప్పును గురించి అన్నమాట కంద విషయంలో కూడ సత్యం.

శివనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో కందాపద్యాలు ఎక్కువగా వాడినాడు. ఉపదేశానికి, కథనమునకు, వర్ణనకు, రసపోషణకు, శిల చిత్రణకు, సంభాషణకు కందాన్ని పరమసాధనంగా ప్రయోగించాడు.

ఉపదేశం :

కం॥ వైశాఖమాసమున నా
శ్రీశైలము జూచునతడు జితమోహతమః
పాశుడగు లక్షగోవుల
దేశల మతులకును నొసగు పెంపువహించున్ (ఆ6-ప18)

కథనం :

కం॥ "ఎయ్యెడ నుండువు నామం
బెయ్యది వృత్తాంత మనఘ మెఱింగింపుమనన్
నెయ్యముతో సాధకుడా
తొయ్యలులకు రాక ముదముతో నెఱింగించెన్" (ఆ6-ప13)

కం॥ నాపేరు పుష్పదంతుడు
శ్రీపర్వతమునకు వచ్చి శ్రీగిరినాథున్
శ్రీపాదము లర్చింతును
దీపిత శివభక్తియుక్తి దృఢ నియమములన్ (ఆ6-ప51)

వర్ణన :

కం॥ నలరాజు రాజీవాసము
మొదలవ దర్పకుడుగాన మూఢుడుగాడె

శశిధరునున్ బోఁటి చక్కదనమును నొఱపున్
గిలుపాడి యొప్పులన్నియు
నిలిపి ప్రయత్నమున నజుఁడు నెలఁతుక జేసెన్ (ఆ4-ప10)

రసపోషణ :

కం॥ సలిపె దప ముష్టకాలము
పలుకక దొడరంగ నోరు వటపట బగులున్
దలచినడెందము గలగంగ
జలియింపక తపము సలిపె సాహసవృత్తిన్ (ఆ2-ప72)

శీలచిత్రణ :

కం॥ సుదతులందు పాపకర్ముండు
మొదలన దర్పకుడు గాక మూఢుడుగాడే
మదనారిని డెందంబున
బదిలంబుగ నిలిపి తండ్రి పగసాధింతున్ (ఆ4-ప18)

సంభాషణ :

కం॥ నీపాద భక్తియుక్తుల
నోపరమేశ్వర కృపాబ్ధి నొసంగుము మునులన్
నీపాదభక్తియుందును
ఏపాటిగొఅంతయైన నీవరద

ఇక తెలుగులో ప్రసిద్ధముల
వానిలో కవి చూపిన ప్రత్యేకతలు

వచనం :

శ్రీపర్వతపురాణంలో 124

రకాలుగా విభజించవచ్చు.

పరిమిత ప్రాధాన్య విభాగంలో అతి దీర్ఘవచనాలు, చిన్నవచనాలు చేరుగాయి. మరియును (అ2-వ24), అనుచు (అ6-వ117), అంత (అ2-వ62) మొదలయిన పదాలతో సాగినవి చిన్న వచనాలు. మిగిలినవి సుదీర్ఘవచనాలు (అ2-వ106), (అ2-వ21, 23).

భాషా ప్రాధాన్యవిభాగంలో తత్సమ పద భూయిష్ఠమయినవి (అ1-వ52,77), తద్భవ దేశ్య పదసమ్మిశ్రిత వచనాలు (అ2-వ42, 8') గణింపదగినవి.

ఉద్దేశ్యప్రాధాన్యం కలవి :

శ్రీపర్వతపురాణంలో వచనాలు ఇక ప్రయోగదృష్ట్యా ఆలోచిస్తే పట్టిక ఇవ్వడంకోసం వచనం, సన్నివేశ సంధానంకోసం వచనం, వర్ణనకోసం వచనం అని మూడు రకాలుగా వర్గీకరించవచ్చు.

పట్టిక ఇవ్వడంకోసం వచనం :

శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో తీర్థాలను, క్షేత్రాలను, పీఠాలను, లింగాలను పట్టిక ఇవ్వడంకోసం వచనం వ్రాశాడు. [illegible]

వ॥ అంత అతీర్థంబులు మహేశ్వర లింగస్థలంబులను భవానీదేవియును శక్తియు రుద్రధారయు, పంచధారయు, సక్షీరధారయు గోపిధారయు పల్లవధారయు విష్ణుధారయు భైరవధారయు చంద్రధారయు మహేశ్వరంబును వేలేశ్వరంబును నవభైరవులు సప్తగుప్తస్థానంబుల సహస్రలింగ స్తంభంబులు జంబుకేశ్వరంబును సంధ్యాతీర్థంబును గరుడేశ్వరంబును గణేశ్వరంబును సమాధి తీర్థంబును కాలహ్రదతీర్థంబును దేవహ్రదంబును నీలహ్రదంబును నగ్నేశ్వరంబును

వర్ణనకోసం వచనం :

శేషనాథార్యకవి శ్రీపర్వతపురాణంలో వర్ణనకోసం వచనం వ్రాశాడు

వ. దేవా! ఈ భువనమునందు శైలోత్తమశ్రేణులు హేమవత్పర్వతంబును హేమకూటంబును నీలమేఘనిభంబైన నీలపర్వతంబును రజతప్రభాభాసితంబైన శ్వేతశైలంబును శృంగత్రయంబును గలిగి సకలదేవభవనంబైన శృంగవనగంబును జ్వలనప్రభగల కుంజరగిరియును బాలసూర్యప్రభగల హేమచలంబును భిన్నాంజనప్రభగల గంధమాదనంబును మరకత ప్రభాభాసురంబైన మాల్యవంతంబును సర్వరత్నమయంబై పద్మరాగ నిభంబైన యుదయ మహీధరంబును మలయభూధరంబును జంబూనద నిభంబైన తుషారధరంబును శంఖకుందేందు నిభంబైన కైలాసశిఖరియును వర్ధమాన గోత్రంబు రౌప్యధాతు యుక్తంబైన రౌప్యవంతంబును హరిచందన వర్ణంబైన హరినీల శిలోచ్ఛయంబును మృణాల సన్నిభంబైన వైరోచనాద్రియు రత్నప్రవాళభాసురంబైన శతపర్వతంబును కుంకుమ వర్ణంబైన. దిందుక ధరిత్రీధరంబును స్ఫటిక నిభంబైన విద్యుత్పర్వతంబును నీలోత్పలశ్యామంబైన పుష్పగిరియును మొదలైన, సర్వసర్వం సహాసంభవంబులు నానాద్భుతములుగల కుంభినీధరంబుల నెల్ల నతిక్రమించి శ్రీశైలప్రశాంత క్రీడా వినోదస్థానంబు గావించుకొని యున్నవాడ విభుడ మాహాత్మ్యంబెట్టిది. యానతీయవలయుననిన నమ్మహాదేవుం డమ్మహాదేవికిట్లనియె (అ2-వ21).

శ్రీపర్వతపురాణంలోని పద్యాలలో విశేషయతిప్రాసల విభేదాలు కనిపించవు. కాకపోతే ప్రాసాదులలో మాత్రం అక్కడక్కడ అలంకార ప్రాసలున్న పద్యాలెక్కువగా కనిపిస్తాయి. వాటిలో దుష్కరప్రాస చెప్పుకోదగ్గది.

దుష్కరప్రాస :

ఖ్యప్రాస (అ1-వ22), ధ్యప్రాస (అ2-వ47), ర్వప్రాస (అ3-వ70), ■ ప్రాస (అ6-వ87), శ్వ ప్రాస (అ2-వ93), ష్కృప్రాస (అ3-వ72) ష్ఫప్రాస (అ1-వ11) క్షప్రాస (అ3-వ89) మచ్చుకు ష్కృ ప్రాస—

ఉ॥ నిష్కపటీ వృద్ధ జననిర్మల చిత్తవికాస భావనా
విష్కృతతీరసారకు నవీన పవిత్ర మహాప్రపూరకున్
దుష్కృత కర్మదుర్భరవిధూత విదారకుబుణ్యనీరకున్
బుష్కరతీరసారకు బ్రభూత విహారకుసాటియేనదుల్ (అ3-వ72)

ఇవేగాకుండా బిందుపూర్వకమైన క (అ7-వ113), బిందుపూర్వకమైన గ (అ3-వ16), బిందుపూర్వకమైన చ (అ2-వ32), బిందుపూర్వకమైన డ (అ2-వ17), బిందుపూర్వకమైన త (అ5-వ26) బిందుపూర్వకమైన ద (అ1-వ56), బిందుపూర్వకమైన ధ (అ2-వ57) ప్రాసలు కనిపిస్తున్నాయి.

ఇక తరువాతి ప్రకరణం ఉపసంహారం.

కం॥ శర్వాయ కమలజాత సు
పర్వప్రముఖామ పాంపాండిత్య కళా
ఖర్వాయ తే నమో మహ
దర్వాచీనాయ తే నమోఽమృతవిధయే (అ2-వ97)

★

# ఉపసంహారం

"శ్రీపర్వతపురాణ పరిశీలన" అనే సిద్ధాంతగ్రంథంలో కనుక్కొన్న విశేషాంశాలను క్రోడీకరించడం ఈ ప్రకరణం ఉద్దేశ్యం.

"తెలుగులో శ్రీశైలక్షేత్ర సాహిత్యసమీక్ష" అని ఎం.ఫిల్. పట్టం కోసం నేను పరిశోధన చేపట్టినపుడు సంస్కృత శ్రీశైలఖండం దొరకలేదు. ఎందరో పండితులు, విమర్శకులుకూడ శ్రీశైలఖండాన్ని చూడలేదని చెప్పారు. శ్రీశైలానికి సంబంధించి ఎన్నో గ్రంథాలు ముద్రించిన శ్రీశైల దేవస్థాన అధికారులు కూడా ప్రయత్నించి విఫలులయ్యారు కాని పిహెచ్.డి. పరిశోధన సాగిస్తున్నపుడు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో తెలుగులిపిలోని సంస్కృత స్కాందం దొరికింది. క్షేమరాజ కృష్ణదాస, శ్రీవేంకటేశ్వర స్టీమ్‌ప్రెస్, బొంబాయి వారు ముద్రించిన సంస్కృత స్కాందంలో శ్రీశైలఖండం భాగం లేదు. దొరికిన శ్రీశైలఖండాన్ని శ్రీపర్వతపురాణాన్ని కథాదృష్టితో సమన్వ

యించుకోవడానికి వీలయింది. తెలుగు శ్రీపర్వతపురాణంలో సాధకుని వృత్తాంతం విపులంగా ఉండగా సంస్కృతంలో సంక్షిప్తంగా ఉంది. అలాగే మూలంలో "శ్రీభ్రమరాంబికోపాఖ్యానం" ప్రసిద్ధంగా ఉండగా తెలుగులో ఈ ఉపాఖ్యానమే లేదు. కాకపోతే భ్రమరాంబికా అనేపేరుతో మాత్రం చాలచోట్ల ప్రస్తావితం. కవి ఈ ఉపాఖ్యానమెందుకు వ్రాయలేదో అంతుపట్టదు.

సంస్కృతంలో శ్రీశైల వాఙ్మయం పరిశీలించినపుడు శ్రీశైల మల్లికార్జునస్తుతి చేసిన మొదటి భక్తుడు ఆదిశంకరాచార్యులే అని తెలింది. అతని "సేవే శ్రీగిరి మహాలింగం శివాలింగితం", శ్రీశైల స్థల వాసినిం భగవతీం శ్రీమాతరం భావయే" అనే స్తుతులే ప్రాచీనం. అవి నేటికి చాలమందికి నిత్యపారాయణ స్తోత్రం.

"శ్రీశైల ప్రశంస" దాక్షిణాత్య భాషలలోకూడా కనిపిస్తుంది. తమిళవాఙ్మయంలో జ్ఞాన సంబంధర్ దేవారంలో మొట్టమొదటి "తిరుప్పరుప్పదమ్" (శ్రీశైలం) ప్రశంస కనిపిస్తుంది. కన్నడ వాఙ్మయంలో 12వశతాబ్ధికి చెందిన అక్కమహాదేవి రచనలలో శ్రీశైలస్వామిసంకీర్తన విరివిగా ఉంది.

శాసన వాఙ్మయం పరిశీలిస్తే శ్రీశైలానికి సంబంధించి 34శాసనలున్నాయి. మొదటిది త్రైలోక్య మల్లిదేవుని భార్య మైలాలదేవి శాసనం(21-4-1057) విజయనగరరాజులనాటి యుగంనాటి శాసనాలే ఎక్కువ.

ఆంధ్ర వాఙ్మయంలో శ్రీపర్వతాన్ని మొట్టమొదట ప్రస్తావించిన వాడు నన్నయ్య. ఆపై శివకవుల రచనలలో, శ్రీనాథుని కృతులలో శ్రీశైల ప్రస్తావన విరివిగా ఉంది.

శ్రీశైలానికి సంబంధించి స్వతంత్ర కావ్యగేయ వాఙ్మయంకూడా

విస్తారంగా ఉంది. వాటిలో శ్రీశైలాత్మక పురాణాలు, మాహాత్మ్యాలు, నాటకాలు, యక్షగానాలు, శతకాలు పేర్కొనదగినవి. ప్రత్యేకించి శ్రీపైడి లక్ష్మయ్యగారు శ్రీశైల వాఙ్మయ వికాసానికి కంకణం కట్టుకొని సఫలీకృతులయిన వారు. శ్రీశైలీయం, శ్రీశైల మల్లికార్జున మాహాత్మ్యం అనేనాటకాలు, శ్రీశైలీయం అనే యక్షగానాలు వ్రాశారు. అలాగే వాగ్గేయకార సాహిత్యం యాగంటి వారి పదాలు, వీరబ్రహ్మం గారి కాలజ్ఞాన తత్త్వాలలో కూడా శ్రీశైల ప్రాధాన్యం కనిపిస్తుంది. జానపదసాహిత్యంలో కూడా శ్రీశైలానికి ప్రాధాన్యం ఉంది. జానపద గేయ వరుసలలో ఎందరోకవులు పాటలుకూడా వ్రాయడం ఈ వాఙ్మయ విస్తారాన్ని స్పష్టం చేస్తుంది.

తెలుగులో లభ్యమయిన పురాణాలలో శేషనాథార్యుని శ్రీసర్వత పురాణం మొదటిది. అతని రచనలలో వ్యక్తిత్వం మెచ్చుకోదగింది. మతవిషయంలోను, భాషా విషయంలోను, ఇతరులను గౌరవించడం లోను, శేషనాథార్యుడు చాలమంది కవులకన్నమిన్న మతం జోలికి వస్తే ఇతడు విష్ణుద్వేషికాడు. అలాగే వీరశైవుడుకాడు. ప్రత్యేకించి—

కం॥ శివజన్ముడ శివగోత్రుడ
శివలింగ ధ్యానపరుడ శీలవ్రతుడన్
శివపూజా పరతంత్రుడ
శివయోగ సుధాను భవుడ శేషాహ్వయుడన్ (అ1—ప18)

అని చెప్పుకొన్నాడు.

భాషా విషయంలో పరిశీలించినపుడు—

కం॥ తెనుగైననేమి కవితా
జనితాలంకార చిత్ర సంగత పద వ
ర్ణన వచనరచన చతురత
విన యోగ్యంబైన కృతియు విండ్రుమాహాత్మ్యల్ (అ1—ప25)

చ॥ జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘన లలితార్థ గౌరవ విలాసి తెనుగుంగభిరమ్యమంతకున్
గనుగొనజూడ బీజమునకంటెను గోమల పత్రపుష్పశో
భన నవపల్లవాభినవ బాలరసాలము సొంపునింపదే (ఆ1-ప28)

అని తన సమభావాన్ని వ్యక్తంచేశాడు.

ప్రాచీనకవుల్ని పేర్కొనకపోయినా వారిపట్ల గౌరవం ఉన్నవాడే. ఇతని పద్యశైలిబట్టినన్నెచోడ, శ్రీనాథులు కవికి ఆరాధ్యులనితెలుస్తుంది ఇతర ప్రబంధకవులలాగా కాకుండా కుకవుల్ని పెద్దగా పట్టించుకోలేదు.

ఉ॥ దూషణమేల చేయు నలధూర్తుల నిష్ఠురకష్ట దుర్వచో
దూషిత సజ్జనుల్ వినుడు ధూర్తనికాయము మీకు నాత్మ సం
తోష యశోవిశేష జగదున్నత హేతువుగాదె ధాత్రిపై
నూషర దీర్ఘికల్ కలుగ బొందవె చారు దీర్ఘికల్ (ఆ1-ప33)

అని సరిపెట్టుకొన్నాడు.

శ్రీపర్వతపురాణంలో శిలాద నందీశ్వర పర్వతుల కథ, వసుమతి కథ, చంద్రవతి కథ, సోధరుని కథలకు ప్రాధాన్యం తరువాత కాలంలో భ్రమరాంబకు ప్రసిద్ధి వచ్చింది.

పాత్రచిత్రణదృష్ట్యా పరిశీలిస్తే కవి ప్రతి స్త్రీ పాత్రను ఆదర్శంగా చిత్రీకరించాడు. ప్రత్యేకించి వసుమతి, చంద్రవతి, పద్మవతి పాత్ర అందుకుసాక్ష్యాలు.

శ్రీపర్వతపురాణంబట్టి శేషనాథార్యుడు సంగీతనాట్యవిద్యావిశారదు డని స్పష్టం. చంద్రవతి కథలో కవి పేర్కొనిన వీణలపేర్లు, రాగాల పేర్లు దీనికి ఉదాహరణలు.

మంత్రం న్యాసం పురాకృత్వా పశ్చాల్లక్షం జపేదను
—నిత్యానాథ, సిద్ధసిద్ధాంత సంగ్రహః

శ్లో॥ శ్రీపర్వతశ్శిరస్థానే కేదారస్తు లలాటకే
వారాణసీ మహాప్రాజ్ఞ భ్రువోర్ఘ్రాణస్య మధ్యమే
కురుక్షేత్రం కుచస్థానే ప్రయాగో హృత్సరోరుహే
చిదంబరం తు హృన్మధ్యే ఆధారే కమలాలయః॥
—శ్రీపాద విశ్వనాథ, శ్రీపాద విశ్వనాథశరీరమ్
(అముద్రిత ఆయుర్వేద యోగగ్రంథం)

పద్యాలు :

కం॥ శ్రీశైలభ్రమరాంబా
ధీశుని పదపూజనంబె దృఢమనుచు సదా
శ్రీశంభో శ్రీశంభో
శ్రీశంభోయనుచు స్మరణచేయుము మనసా

కం॥ శ్రీశుడు మృత్యుంజ భూ
మీశుడు వరదుడనుచు నెపుడు మేలుగలర్పన్
శ్రీశంభో శ్రీశంభో
శ్రీశంభోయనుచు స్మరణచేయుము మనసా
(శ్రీమృత్యుంజయ నిశ్శంకలహద్దర్ మానసబోధ శ్రీశంభుశతకం)

2. నదులు/తీర్థాలు/ధారలు :

-:o:-

## 3. వీణల పేర్ల పట్టిక

ఆకాశవీణ అ4-వ86
కశ్యపవీణ అ4-వ86
కిన్నరవీణ అ4-వ86
కుంభికావీణ అ4-వ86
కుమారవీణ అ4-వ86
కూర్మవీణ అ4-వ86
కైలాసవీణ అ4-వ86
గౌరీవీణ అ4-వ86
పరివాదినీ వీణ అ4-వ86
భుజంగవీణ అ4-వ86
మనోహరవీణ అ4-వ86
రావణవీణ అ4-వ86
లావణ్యవీణ అ4-వ86
విపంచికావీణ అ4-వ86
సరస్వతీవీణ అ4-వ86
సారంగవీణ అ4-వ86
స్వయంభువీణ అ4-వ86
స్వరవీణఅ4-వ86
గణనాధవీణ అ4-వ86
జనకవీణ అ4-వ86
బాణవీణ అ4-వ86
బ్రహ్మవీణ అ4-వ86
యంభోజవీణ అ4-వ86
రుద్రవీణ అ4-వ86

—o—

## 4. రాగాలపేర్ల పట్టిక

మాహురిరాగం ఆ4-వ89

మేఘరంజిరాగం ఆ4-89

మౌళగౌళరాగం ఆ4-వ89

లలితరాగం ఆ4-వ89

వసంతరాగం ఆ4-వ89

శంకరాభరణరాగం ఆ4-వ89

శ్రీరాగం ఆ4-వ89

సాంగరాగం ఆ4-వ89

సిరియురాగం ఆ4-వ89

సౌరరాగం ఆ4-వ89

సావరిరాగం ఆ4-వ89

హిందోళరాగం ఆ4-వ89

రామక్రియారాగం ఆ4-వ89

వరాళిరాగం ఆ4-వ89

విచిత్రాంగిరాగం ఆ4-వ89

శుద్ధవరాళిరాగం ఆ4-వ89

సంజనితరాగం ఆ4-వ89

సింధువరాళిరాగం ఆ4-వ89

సైంధవిరాగం ఆ4-వ89

సౌరాష్ట్రగుజ్జరిరాగం ఆ4-89

-:o:-

# ఉపకరించిన రచనలు


| | |
|---|---|
| గోపాలకృష్ణారావు, కె. | ఆంధ్రశతక సాహిత్య వికాసము<br>హైదరాబాదు, ప్ర. ము. 1976 |
| గోపాలరెడ్డి & సుజాతరెడ్డి | సంస్కృతసాహిత్య చరిత్ర<br>తెలుగు విశ్వవిద్యాలయం,<br>కళాభవన్, సైఫాబాదు హైదరాబాదు<br>1986. |
| చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం | శిల్పప్రభావతి<br>(ప్రభావతి ప్రద్యుమ్న చరిత్ర)<br>శిల్పి ప్రచురణలు, 1980 |
| జనార్దనం, కె. | యాగంటి పదాలు - పరిశీలన<br>జానకి ప్రచురణలు<br>కార్వేటినగరం, 1988 |
| జోగారావు, యస్వీ. | ఆంధ్ర వాఙ్మయచరిత్ర<br>ఆంధ్రా యూనివర్శిటి<br>విశాఖపట్టణం, 1960. |
| దొరసామిశర్మ, రావూరి | తెలుగుభాషలో ఛందోరీతులు<br>రచయిత<br>మద్రాసు-5, 1962 |
| దొణప్ప, తూమాటి | ఆంధ్రసంస్థానములు- సాహిత్యపోషణ<br>ఆంధ్ర విశ్వకళాపరిషత్తు<br>వాల్తేరు, 1969 |

| | |
|---|---|
| దొరప్ప, తూమాటి | తెలుగు హరికథా సర్వస్వం<br>రచయిత<br>నాగార్జునసాగర్, గుంటూరు, 1978. |
| నరసింహం అంతటి | ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు<br>సమతా సాహితి<br>3-4-705/5, నారాయణగూడ<br>హైదరాబాదు, 1979 |
| నరసింహారెడ్డి, పాపిరెడ్డి | ప్రాచీన తెలుగు కావ్యాల్లో<br>తెలుగునాడు<br>శ్రీనివాస మురళీ పబ్లికేషన్స్<br>తిరుపతి 1984 |
| నాగయ్య, జి. | తెలుగుసాహిత్యసమీక్ష ప్రథమసంపుట<br>నవ్యపరిశోధక ప్రచురణలు<br>తిరుపతి, 1983 |
| నాగభూషణం, రాంపల్లి | తిరుపతి క్షేత్ర సాహిత్యసమీక్ష<br>పవన్‌కుమార్ ప్రచురణలు<br>తిరుపతి, 1983 |
| ప్రభాకరశాస్త్రి, వేటూరి | ప్రబంధ రత్నావళి<br>శ్రీప్రభాకర పరిశోధన మండలి<br>విజయనగర్ కాలని<br>హైదరాబాదు, 1976 |
| బాలకృష్ణారెడ్డి, ఎడ్ల | జానపద పారమార్థిక గేయసాహిత్యం<br>చైతన్య ప్రచురణలు<br>శ్రీశైలం ప్రాజక్టు, 1986 |

మహంతయ్య, ఎం. ఎస్. — కన్నడసాహిత్య చరిత్ర
సాహిత్య అకాడమీ
న్యూఢిల్లీ, 1978

మాధవశర్మ, పాటిబండ — ఆంధ్రమహాభారతము ఛందఃశిల్పము
అభినవ భారతీ ప్రచురణలు 1966

రఘునాథాచార్య, ఎస్.బి. — అర్థవిజ్ఞానసర్వస్వము
మొదటి సంపుటము వేదసంహితలు
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి, 1982

రాధాకృష్ణశర్మ, చల్లా — తమిళసాహిత్య చరిత్ర
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
హైదరాబాదు, 1976

రామకృష్ణశాస్త్రి, శిష్టా — వీరశైవాంధ్ర వాఙ్మయము
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 1952

రామరాజు, బిరుదురాజు — తెలుగు జానపద గేయ సాహిత్యము
జానపద విజ్ఞాన ప్రచురణలు
హైదరాబాదు, 1978

రామానుజాచార్యులు — శ్రీరంగగద్య
భగవద్రామానుజ గ్రంథమాల
పరిష్కర్త : అణ్ణంగరాచార్య
కాంచీపురము

| | |
|---|---|
| లక్ష్మణస్వామి, దాసరి | వర్ణన రత్నాకరము<br>విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల<br>పిఠాపురం |
| లక్ష్మయ్య, పైడి | శ్రీశైల మల్లికార్జున మాహాత్మ్యము<br>(యక్షగానం) శ్రీశైల దేవస్థాన<br>ప్రచురణ శ్రీశైలం, 1965 |
| లక్ష్మయ్య, పైడి | శ్రీశైలీయం (నాటకం)<br>శ్రీశైలం, 1979 |
| లక్ష్మయ్య, పైడి | శ్రీశైల మల్లికార్జునమాహాత్మ్యము<br>(నాటకం) శ్రీశైల దేవస్థాన ప్రచురణ<br>శ్రీశైలం, 1981 |
| లక్ష్మయ్య, పైడి | శ్రీశైలీయం (హరికథా)<br>శ్రీలప్రభ, శ్రీశైల దేవస్థానం<br>శ్రీశైలం, 1981 |
| వీరేశలింగం, కందుకూరి | ఆంధ్రకవులచరిత్రము<br>తృతీయభాగము<br>రాజమహేంద్రవరము, 1949 |
| వెంకటరెడ్డి, మేడపాటి | యోగశాస్త్రంలోశ్రీశైలప్రశంసదర్శనం<br>(వ్యాసం) డైరెక్టర్<br>వేమన యోగి పరిశోధనాలయం<br>సికింద్రాబాదు |
| వేంకటరమణయ్య, బులుసు | బృహత్స్తోత్ర రత్నాకరం |

| | |
|---|---|
| | బాలసరస్వతీ బుక్ డిపో<br>మద్రాసు, 1977 |
| వేంకటరావు, నిడుదవోలు | ఉదాహరణ వాఙ్మయచరిత్ర<br>విజయభాస్కర పబ్లికేషన్స్<br>హైదరాబాదు, 1950 |
| వేంకటరావు, నిడుదవోలు | దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము<br>మద్రాసు యూనివర్సిటీ<br>1954 |
| శంకరాచార్యులు | శివానందలహరి-దుర్గానందలహరి<br>సాధన గ్రంథమండలి<br>తెనాలి, 1982 |
| శంకరనారాయణరాజు, రత్నకరం | కర్ణాటక ఆంధ్రసాహిత్య చరిత్ర<br>బెంగుళూరు విశ్వవిద్యాలయం<br>బెంగుళూరు, 1976 |
| శేషయ్య, చాగంటి | ఆంధ్ర కవిత తరంగిణి<br>(తొమ్మిదవ సంపుటము)<br>హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయం<br>కపిలేశ్వరపురం<br>తూర్పుగోదావరి (జిల్లా) 1952 |
| శేషనాథాచార్యుడు, నాగలూటి | శ్రీపర్వతపురాణం<br>జూపిటర్ బుక్ హౌస్<br>గుంటూరు, 1970 |
| సంపత్కుమారాచార్య, కోవెల | తెలుగు ఛందోవికాసము |

కులపతి సమితి
వరంగల్లు, 1962

సత్యనారాయణ, విశ్వనాథ — విశ్వనాథ మధ్యాక్కరలు
ఎం.ఎస్.ఎన్ అండ్ కో
విజయవాడ

సుబ్రమణ్యం, జి.వి. — మారన మార్కండేయ పురాణం
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
ప్రచురణ హైదరాబాదు-4, 1984

## ఆంగ్లం

Prarabrahma Sastry, P.V. — Srisailam its Hisiory and Cult
P.V.P. Sastry
2-1-514/A, Nallakunta
Hyderabad, 1985

★